## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని మోహన్ పబ్లికేషన్స్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్: www.mohanpublications.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో మోహన్ పబ్లికేషన్స్ వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/Whatsapp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

http://www.mohanpublications.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సద్గురువుల అనుగ్రహప్రాప్తికి

# నవనాధ చరిత్ర

## నిత్యపారాయణ గ్రంథం

రచన :
ఇసుకపల్లి సంజీవశర్మ
చందలూరు, కర్నూలుజిల్లా





ప్రకాశకులు : ☎ 246 2565
మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1.

 2012 వెల : 100-00





## నవనాధ చరిత్ర

శ్రీ ఇసుకపల్లి సంజీవ శర్మ
చందలూరు, కర్నూలు జిల్లా.



ప్రకాశకులు :
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.

## ముందుమాట

శ్రీ ఇసుకపల్లి సంజీవశర్మ గారిచే రచింపబడిన శ్రీ నవనాధ చరిత్ర ఒక మహత్తర గ్రంథం. నవనాధ చరిత్ర 108మార్లు పారాయణ చేయవలెను. సుప్రసిద్ధ రచయితతో నవనాధ చరిత్ర అందించుటకు సంతోషిస్తు న్నాము. తెలుగులో మొట్టమొదటి సారిగా నవనాధ చరిత్ర అందించుటకు సంతోషిస్తున్నాము. నవనాధచరిత్ర సంజీవ శర్మగారిచే అందించాలని మా ఆకాంక్ష ఈనాటికి నెరవేరింది. మీ కుటుంబంలో ఉన్న బాల బాలికలకు, యువతులకు, యువకులకు నవనాధచరిత్ర పారాయణ చేయమనగలరు. నవనాధ చరిత్ర పారాయణ చేయటం మనసు ఏకాగ్రత కాగలదు. ముఖ్యముగా అందరిని అలరించాలని ఆశిస్తూ నవనాధ చరిత్ర విడుదల చేసి వున్నాము. శ్రీ ఇసుకపల్లి సంజీవశర్మ గారు నవనాధ చరిత్ర రాయటంలో సిద్ధ హస్తులు. నవనాధచరిత్ర ఒక్క రోజులో పారాయణం చేయవచ్చును. వీలైనవారు 108 మార్లు కూడా పారాయణ చేయగలరు.

త్వరలో బొమ్మలతో శ్రీ షిర్డీ సాయి బాబా జీవిత చరిత్ర కూడా విడుదల చేయబోతున్నామని తెలియ జేయుటకు సంతోషిస్తున్నాము.

మీసహాయ సహకారాలతో



ఇట్లు
**పబ్లిషర్స్ &**
**డా॥ ఆదిపూడి వేంకట శివ సాయిరామ్**





## నవనాధ చరిత్ర
## పారాయణ విధానము

1. పుస్తకమునందలి కథలన్నియు ఒకే ఆసనముపై అనగా పూర్తియగు నంతవరకు చదువుట ఒక పద్ధతి.
2 ఏడు దినములలో నవనాధ చరిత్ర చదువుట మరి యొక పద్ధతి.
3. శ్రీదత్త ప్రభువుల పటమునలంకరించి దీపమును వెలిగించి పారాయణ మును ప్రారంభింపవలయును.
4. పారాయణము ముగిసిన పిదప ద్రాక్ష;లేదా కలకండ (పటికబెల్లము) లేదా రెండు ఖర్జూరపు పండ్లు, బెల్లము పానకము, అరటిపండ్లు లభ్యమైన దేదో నివేదన సలుపవలయును.
5. పుస్తకము పూర్తియైన పిదప టెంకాయను సమర్పించి మహానైవేద్యము (అన్నము - పాయసము వగైరా) సమర్పించి కర్పూరహారతి నివ్వ వలయును.
6. అవకాశమును కల్పించుకొని ముగ్గురు సాధువులకో లేదా బిచ్చగాండ్రకో కడుపార భోజనము నిడి దక్షిణ తాంబూలము నిచ్చి నమస్కరింప వలయును.
7. దీక్షను పాటించి నియమముగా పారాయణము చేయు దినముల యందు మాత్రమే బ్రహ్మచర్యమును శిర స్నానమును పాటింపవలయును. అనవసర ప్రసంగ ములను వదలి "శ్రీ గురు దత్తా, జయ గురుదత్తా" యని జపము సేయుట సర్వోత్తమము.
8. దైనందిన (డైలీ) పారాయణము చేయువారలకు శ్రద్ధాభక్తులున్న చాలును. నియమములతో నిమిత్తము లేదు. సాయం సమయమున పటము ముందు దీపమును వెలిగించి, ఊదీకడ్డీలను వెలిగించి

**ఓం సాయివరదః కార్తవీర్యాది రాజరాజ్య ప్రదః అనఘః** అను స్తోత్రమును కనీసము 8 పర్యాయములకు మించి చేయుట లెస్స.

## నవనాధ పారాయణ ఎవరు చేయాలి?

శ్రీ దత్త భక్తులు
శ్రీ సాయి భక్తులు
సజీవముగా గురువును సేవిస్తున్న భక్తులు
సద్గురువును సేవిస్తున్న భక్తులు
నిరాకారములో వున్న గురువును సేవిస్తున్న భక్తులు
అవధూతల దర్శిస్తున్నవారు, సందర్శించదలచినవారు
అవధూతలు సేవిస్తున్న భక్తులు
నాధ సంప్రదాయములో వున్నభక్తులు
దత్త సంప్రదాయములో వున్నభక్తులు
గురు సంప్రదాయములో వున్నభక్తులు
గురువు కోసం అన్వేషిస్తున్నవారు



## నవనాధ చరిత్ర పారాయణ విధులు

1. శ్రీదత్త ఫోటోగాని, శ్రీదత్త విగ్రహం వుంటే చాలా మంచిది.
2. తూర్పు దిక్కుగా (ఈశాన్యం వైపు) కూర్చుని పారాయణ చేసిన చాలా మంచిది.
3. పసుపు వస్త్రాలు ధరించి పారాయణ చేసిన చాలా శ్రేష్ఠము.
4. పారాయణ శ్రద్ధతో జాగ్రత్తగా చేయాలి.
5. పారాయణ కాగానే నైవేద్యం సమర్పించాలి.
6. పారాయణ కాగానే రూ. 11/- దక్షిణ తప్పక సమర్పించాలి.
7. శ్రీ గురుని మీద ధ్యాసవుంచి చదవాలి. వేరే ఆలోచన చేయరాదు.
8. "అన్యధా శరణం నాస్తి" అను భావనతో చేసిన విశేష ఫలితములు వుండును.
9. దత్త క్షేత్రముల ప్రయాణపు సామాగ్రిలో ఈ పుస్తకము తప్పనిసరిగా వుంచవలెను.
10. ఇతర ప్రయాణాలలో ఈ పుస్తకము తీసుకొని వెళ్ళవలెను.
11. ఎల్లవేళలా, ఈ గ్రంధమును మీవద్ద ఉంచుట మంచిది.







## నవనాధ చరిత్ర ఎన్నిమార్లు పారాయణ చేయాలి?

### ఫలితములు - నైవేద్యములు

| ఫలితములు | | నైవేద్యం |
|---|---|---|
| 1. 1మారు | మానశ్శాంతి | టెంకాయ |
| 2. 3 మార్లు | భయాలు తొలగును | ద్రాక్షపండ్లు |
| 3. 5 మార్లు | కార్యసిద్ధి | దద్ధోజనం |
| 4. 11 మార్లు | సంతానప్రాప్తి | శెనగలు |
| 5. 14 మార్లు | విద్యాప్రాప్తి | శెనగలు |
| 6. 21 మార్లు | నవగ్రహదోష నివృత్తి (వివాహమునకు) | పులిహోర |
| 7. 27 మార్లు | ఆరోగ్యము కొరకు (వివాహమునకు) | గోధుమ హల్వా |
| 8. 54 మార్లు | ప్రత్యేక సంకల్పం కొరకు (ఋణపీడానివారణ) | ప్రతిగురువారం పొంగలి |
| 9. 108 మార్లు | శ్రీ గురు దర్శనము | పాలకోవా |
| 10. 7 మార్లు | కుజదోషనివృత్తి (సంతానం, వివాహం) | కందిపప్పుతో వంటకాలు |
| 11. 19 మార్లు | శనిదోషనివృత్తి (ఏలినాటి శనిమహర్దశ) | నువ్వుండలు, నువ్వు జీడీలు |
| 12. 18 మార్లు | సర్వదోష నివృత్తి | మినపగారెలు |
| 13.9 మార్లు | ధనలాభము కొరకు | నేతితో పాయసం |

## నవనాథ చరిత్ర

### పారాయణ నియమములు

1. ఒక గురువారం ఉదయం గురువారం సాయంత్రంతో ముగించవలెను.
2. గురు పూర్ణిమ ఉదయం ప్రారంభించి గురు పూర్ణిమ సాయంత్రం ముగించవలెను.
3. శ్రీరామనవమి ఉదయం ముందుగా ప్రారంభించి శ్రీరామనవమి సాయంత్రం ముగించవలెను.
4. విజయదశమి ఉదయం ఏకాదశి సాయంత్రం దేవీనవరాత్రులతో ముగించవలెను.
5. దత్తజయంతి ఉదయం ముందుగా ప్రారంభించి దత్తజయంతి సాయంత్రం ముగించవలెను.

### నవనాథ చరిత్ర పాటించవలసిన నియమములు

1. ఏ వయస్సులో ఉన్నవారైనా స్త్రీలు, పురుషులు ఈ పారాయణ చేయవచ్చును.
2. పారాయణ ఆచరించే రోజు శిరస్నానం చేయాలి.
3. పగలు నిద్రపోరాదు.
4. మధ్యాహ్నం 12 గంటలు లోపుగా పారాయణ ప్రారంభించాలి. ఉదయం నుండి ఉపవాసం చేయాలి.
5. పారాయణ చేసే రోజున మద్య, మాంసాదులు ముట్టరాదు.
6. ప్రతిసంవ్సరం గురు పూర్ణిమ రోజన పారాయణచేయవచ్చును.
7. ప్రతి మాససములో ఒక గురువారం నాడు గాని, ఏకాదశి తిథి యందు గాని పూర్ణిమ తిథి యందు పారాయణ చేయవచ్చును.
8. కనీసం సం॥లో ఒకసారి అయినా శ్రీ సాయిబాబా పుణ్యతిథి యందు యీ పారాయణ చేసిన చాలా అద్భుత ఫలితములు ఇచ్చును.
9. ప్రత్యేకముగా ఒక సంకల్పాన్ని సాధించదలచుకున్న వారు ప్రతి గురువారం 5 వారాలు వరుసగా పారాయణ చేయాలి.

   (ఆటంకం కలిగిన యెడల ఆ వారము మినహాయించి తదుపరి వారము కొనసాగించ వచ్చును.)



E/Srinivas/Nava Nadha Charitra



### నవనాథ చరిత్ర పారాయణ చేయవలసిన ప్రదేశములు

1. దత్త క్షేత్రములు (పిఠాపురం, వర్సోబావాడీ, గాణ్గాపూర్, కరంజా)
2. శ్రీ సాయిబాబా దేవాలయముల ప్రాంగణములు.
3. షిరిడీ పుణ్యక్షేత్రము, (పారాయణ మండపము నందు)
4. దత్తాత్రేయ అవతార పరంపర క్షేత్రములు (మాణిక్యనగర్, అక్కల్‌కోట, షేగాం, నాగపూర్, సాకోరి)
5. దత్తాత్రేయ దేవాలయముల ప్రాంగణములు
6. మీ పూజా మందిరము వద్ద పారాయణ
7. ప్రయాణములలో కూడ చదవవచ్చును.
8. పుణ్యక్షేత్రములలో పారాయణ.
9. మీకు అనువైన ప్రదేశములలో పారాయణ
10. ఔదుంబర వృక్షము వద్ద (మేడిచెట్టు) పారాయణ
11. రావిచెట్టు వద్ద పారాయణ
12. పుణ్య నదీతీరముల వద్ద పారాయణ
13. సజీవ అవధూతల, యోగుల, సిద్ధుల సన్నిధానమున పారాయణ
14. అవధూతల, యోగుల, సిద్ధుల సన్నిధానమున పారాయణ
15. గురుస్థానముల వద్ద, గురుపీఠముల వద్ద పారాయణ
16. ముఖ్యముగా, శైవ, వైష్ణవ, శక్తి క్షేత్రముల వద్ద పారాయణ

## నవనాథ చరిత్ర

### పారాయణ చేయవలసిన పర్వదినములు

1. జనవరి 1వ తేదీ (ఆంగ్లసంవత్సరాది)
2. మకర సంక్రాంతి
3. మహాశివరాత్రి
4. ఉగాది
5. శ్రీ రామనవమి
6. శ్రీ హనుమజ్జయంతి
7. తొలిఏకాదశి
8. గురుపూర్ణిమ
9. వినాయక చవితి
10. విజయదశమి
11. విజయదశమి మరుసటితిథి ఏకాదశి (శ్రీ సాయిపుణ్యతిథి)
12. దీపావళి
13. దత్తజయంతి
14. ముక్కోటి ఏకాదశి
15. సుబ్రహ్మణ్య షష్ఠి
16. రథసప్తమి
17. అనఘాష్టమి తిథి
18. గురువారంతో అమావాస్య
19. గురువారంతో పూర్ణిమ
20. గురువారంతో ఏకాదశి
21. గురువారంతో మాస శివరాత్రి
22. శని త్రయోదశి
23. మొహరమ్
24. బక్రీద్
25. క్రిస్టమస్



E/Srinivas/Nava Nadha Charitra

## శ్రీ దత్తాత్రేయ అష్టోత్తర శతనామావళి.

(ఈ నామములకు మొదట "ఓం" అని చివర "నమః" అని చదువవలెను.)

ఓం శ్రీ దత్తాయ నమః
దేవదత్తాయ
బ్రహ్మదత్తాయ
విష్ణుదత్తాయ
శివదత్తాయ
అత్రిదత్తాయ
ఆత్రేయాయ
అత్రివరదాయ
అనసూయాయై
అనసూయాసూనవే
అవధూతాయ
ధర్మాయ
ధర్మపరాయణాయ
ధర్మపతయే
సిద్ధాయ
సిద్ధిదాయ
సిద్ధపతయే
సిద్ధసేవితాయై
గురవే
గురుగమ్యాయ
గరోర్గురుతరాయ
గరిష్ఠాయ
వరిష్ఠాయ
మహిష్ఠాయ
మహాత్మనే
యోగాయ
యోగగమ్యాయ
యోగదేశకరాయ
యోగపతయే
యోగీశాయ
యోగాధీశాయ
యోగపరాయణాయ
యోగిధ్యేయాంఘ్రిపంకజాయ
దిగంబరాయ
దివ్యాంబరాయ
పీతాంబరాయ
శ్వేతాంబరాయ నమః
చిత్రాంబరాయ
బాలాయ
బాలవీర్యాయ
కుమారాయ
కిశోరాయ
కందర్ప మోహనాయ
అర్ధాంగాలింగితాంగనాయ
సురాగాయ
విరాగాయ
వీతరాగాయ
అమృతవర్షిణే
ఉగ్రాయ
అనుగ్రహరూపాయ
స్థవిరాయ
స్థవీయసే
శాంతాయ
అఘోరాయ
మూఢాయ
ఊర్ధ్వరేతసే
ఏకవక్త్రాయ
అనేకవక్త్రాయ
ద్వినేత్రాయ
త్రినేత్రాయ
ద్విభుజాయ
షడ్భుజాయ నమః
అక్షమాలినే
కమండలధారిణే
శూలినే
శంఖినే
గదినే
ఢమరుధారిణే
మునయే
మౌళినే
విరుపాయ
స్వరూపాయ
సహస్రశిరసే నమః
సహస్రాక్షాయ
సహస్రబాహవే
సహస్రాయుధాయ
సహస్రపాదాయ
సహస్రపద్మార్చితాయ
పద్మహస్తాయ
పద్మపాదాయ
పద్మనాభాయ
పద్మమాలినే
పద్మగర్భారుణాక్షాయ
పద్మకింజల్కవర్చనే
జ్ఞానినే
జ్ఞానగమ్యాయ
జ్ఞానవిజ్ఞానమూర్తయే
ధ్యానినే
ధ్యాననిష్ఠాయ
ధ్యానస్థిమితమూర్తయే
ధూళిధూసరితాంగాయ
చందనలిప్తమూర్తయే
భస్మోద్ధూళితదేహాయ
దివ్యగంధానులేపినే
ప్రసన్నాయ
ప్రమత్తాయ
ప్రకృష్టార్థప్రదాయ
అష్టైశ్వర్యప్రదాయ
వరదాయ
వరీయసే
బ్రహ్మణే
బ్రహ్మరూపాయ
విష్ణవే
విశ్వరూపిణే
శంకరాయ
ఆత్మనే
అంతరాత్మనే
పరమాత్మనే
దత్తాత్రేయాయనమోనమః

## శ్రీ అనఘాదేవీ అష్టోత్తర శతనామావళిః

(ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః" అని పఠించవలెను.)

ఓం శ్రీఅనఘాయై నమః
మహాదేవ్యై
మహాలక్ష్మ్యై
అనఘస్వామి పత్న్యై
యోగీశాయై
త్రివిధాఘ విదారిణ్యై
త్రిగుణాయ
అష్టపుత్ర కుటుంబిన్యై
సిద్ధసేవ్య పదే
ఆత్రేయగృహదీప్తాయై
వినీతాయై
అనసూయాత్రి ప్రీతిదాయిన్యై
మనోజ్ఞాయై
యోగశక్తి స్వరూపిణ్యై
యోగాతీతహృదే
భర్తృశుశ్రూషణోత్కర్షాయై
మతిమత్యై
తాపసివేషధారిణ్యై
తాపత్రయప్రదే
చిత్రాసనోపవిష్టాయై
పద్మాసనయుజే
రత్నాంగులీయకులసత్పాదాంగుళ్యై
పద్మగర్భ సమానాంఘ్రి తలాయై
హరిద్రాంచత్ప్రదాయై
మంజీరకలజత్రవే
శుచివల్కలధారిణ్యై
కాంచీదామయుజే
గళేమాంగల్యసూత్రాయై
గ్రైవేయాళిధృతే
క్వణత్కంకణయుక్తాయై
పుష్పాలంకృతయే
అభీతిముద్రహస్తాయై
లీలాంభోజధృతే
తాటంగయుగళీదీప్తాయై
నానారత్నసుదీప్తయే
ధ్యానస్థిరాక్ష్యై

ఓం ఫాలాంచత్తిలకాయై నమః
మూర్ధాబద్ధజటారాజత్సు మదామాళయే
భర్తృరాజ్ఞపాలనాయై
నానావేషధృతే
పంచపర్వానితాయై
విద్యారూపికాయై
సర్వావరణశీలాయై
స్వబలావృతవేధసే
విష్ణుపత్న్యై
వేదమాత్రే
స్వచ్ఛశంఖధృతే
మందహాస మనోజ్ఞాయై
మంత్రతత్త్వ విదే
దత్త పార్శ్వ నివాసాయై
ముఖనిస్సృతశంపా భత్రయీ దీప్త్యై
రేణుకేష్టకృతే
విధాతృ వేదసంధాత్ర్యై
సృష్టిశక్త్యై
శాంతిలక్ష్మ్యై
గాయకాయై
బ్రహ్మణ్యై
యోగచర్యరతాయై
నర్తికాయై
దత్తవామాంక సంస్థితాయై
జగదిష్టకృతే
శుభాయై
చారుసర్వాంగ్యై
చంద్రాస్యాయై
దుర్మానస క్షోభకర్త్యై
సాధుహృచ్ఛాంతయే
సర్వాంతగతయే
పాదస్థితాయ
పద్మాయై
గృహదాయై
సక్థి స్థితాయై
సద్రత్నవస్త్రదాయై

ఓం సర్వాంతగతయే నమః
గుహ్యస్థాన స్థితాయై
పత్నీదాయై
క్రోడస్థాయై
పుత్రదాయై
వంశవృద్ధికృతే
హృద్గతాయై
సర్వకామపూరణాయై
కంఠస్థితాయై
హారాది భూషణదాత్ర్యై
ప్రవాసిబంధు సంయోగదాయికాయై
యిష్టాన్నదాయై
వాక్ఛక్తిదాయై
బ్రాహ్మ్యై
ఆజ్ఞాబల ప్రదాత్ర్యై
సదైశ్వర్య కృతే
ముఖస్థితాయ
కవితాశక్తిదాయై
శిరోగతాయై
నిర్దాహకర్త్యై
రౌద్ర్యై
జంభాసురవిద్యాహిన్యై
జంభావంశహృతే
దత్తాంక సంస్థితాయై
వైష్ణవ్యై
ఇంద్రరాజ్యప్రదాయిన్యై
దేవప్రీతికృతే
నహుషాత్మజదాత్ర్యై
లోకమాత్రే
ధర్మకీర్తి సుబోధిన్యై
శాస్త్రమాత్రే
భార్గవక్షిప్రతుష్టాయై
ఓం కాలత్రయవిదే
కార్తవీర్యవ్రత ప్రీతమతయే
శుచయే
కార్తవీర్య ప్రసన్నాయై
సర్వసిద్ధికృతే

E/Srinivas/Nava Nadha Charitra

## శ్రీ అనఘాదేవ అష్టోత్తర శతనామావళిః

(ఈ నామములకు మొదట "ఓం" అని చివర "నమః" అని చదువవలెను.)

ఓం దత్తాత్రేయాయ నమః
అనఘాయ
త్రివిధాఘాయ
విదారిణే
లక్ష్మీరూపాయ
అనఘేశాయ
యోగధీశాయతే
ద్రాంబీజాయ
ధ్యానగమ్యాయ
విజ్ఞేయాయ
గర్భాదితారణాయ
దత్తాత్రేయాయ
బీజస్తుపటుతుల్యాయ
ఏకార్ణవమనుగామినే
షడర్ణమనుపాలాయ
యోగసంపత్కరాయ
అష్టార్ణమనుగమ్యాయ
పూర్ణానంద వపుష్మతే
ద్వాదశాక్షర మంత్రస్థాయ
ఆత్మసాయుజ్యదాయినే
షోడశార్ణ మనుస్థాయ
సచ్చిదానంశాలినే
దత్తాత్రేయాయ
హరయే
కృష్ణాయాయ
ఉన్మత్తాయ
ఆనందదాయకాయ
దిగంబరమునయే
బాలాయాస్తునమో
పిశాచయతే
జ్ఞానసాగరాయ
అబ్రహ్మాయ
జన్మదోషౌఘప్రణాశాయ
సర్వోపకారిణే
మోక్షదాయినే
రూపిణే

భగవతే
ఓం దత్తాత్రేయాయ నమః
స్మృతిమాత్ర సంతుష్టాయ
మహాభయ నివారిణే
మహాజ్ఞానప్రదాయాయ
చిదానందాత్మనే
బాలోన్మత్త పిశాచాది వేషాయ
మహాయోగినే
అవధూతాయ
అనసూయాయ
ఆనందదాయ
అత్రిపుత్రాయ
సర్వకామఫలప్రదాయ
ప్రణవాక్షర వేద్యాయ
భవబంధవిమోచనాయ
హ్రీం బీజాక్షర పాలాయ
సర్వైశ్వర్య ప్రదాయినే
క్రోంబీజ జపతుష్టాయ
సాధ్యాయాకర్షణాయ
సౌర్బీజప్రీతిమనసే
మనస్సంక్షోభహారిణే
ఐంబీజపరితుష్టాయ వాక్ప్రదాయ
క్లీంబీజ సముపాస్యాయ
త్రిజగద్వశ్యకారిణే
శ్రీముపాసన తుష్టాయ
మహాసంపత్ప్రదాయ
గ్లాం అక్షరసువేద్యాయ
భూసామ్రాజ్యదాయినే
ద్రాంబీజాక్షర వాసాయ మహతే
చిరంజీవినే
నానాబీజాక్షరోపాస్యాయ
నానాశక్తియుతే
సమస్తగుణ సంపన్నాయ
అంతశ్శత్రువిదారిణే
భూతగ్రహోచ్చాటనాయై
సర్వవ్యాధిహరాయ
పరాభిచార శమనాయ
ఆదివ్యాధి నివారిణే

ఓం దుఃఖత్రయ హరయాస్తు
-దారిద్ర్య విదారిణే నమః
దేహదార్ఢ్యాభిషోషకాయ
చిత్తసంపోషకారిణే
సర్వమంత్ర స్వరూపాయ
సర్వమంత్ర స్వరూపిణే
సర్వతంత్రాత్మికాయ
సర్వపల్లవరూపిణ్యై
శివాయోపనిషద్వేద్యాయ
దత్తాయ
భగవతేస్తు దత్తాత్రేయాయ
మహాగంభీరరూపాయ
వైకుంఠవాసినే
శంఖచక్రగదాశూలధారిణే
వేణువాదినే
దుష్టసంహారకాయ
శిష్టసంపాలకాయ
నారాయణాయాస్త్ర ధరాయ
చిద్రూపిణే
ప్రజ్ఞారూపాయ
ఆనందరూపిణే
బ్రహ్మరూపిణే
మహావాక్య ప్రబోధాయ
తత్త్వాయ
సచ్చిదానందాయ
సకలకర్మనిర్మితాయ
సచ్చిదానందరూపాయ
సకలసంచారాయ
సకలదేవతావశీకరణాయ
కుటుంబావృద్ధిదాయ
గూఢపానక తోషితాయ
పంచకర్ణాయ
సుప్రీతయే
కందఫలాదినే
సమస్సద్గురవే
శ్రీ దత్తాత్రేయాయ నమః

## శ్రీ దత్తాత్రేయ ధ్యానమ్

**ఓం శ్రీ సాయి దత్తాత్రేయాయ నమః (3సార్లు)**

ఓం మాలాకమండల రధఃకరపద్మయుగ్మే మధ్యస్థపాణి యుగళే దమరుత్రిశూలే
యస్యస్త ఊర్ధ్వకరయో శ్శుభశంఖ చక్రే వందే తమత్రివరదం భుజషట్కయుక్తమ్

## శ్రీ దత్తాత్రేయ నామావళి

ఓం శ్రీ సాయివరదః కార్తవీర్యాది రాజరాజ్యప్రదః ।
అనఘః । విశ్వశ్లాఘ్యః । అమితాచారః । దత్తాత్రేయః ।
మునీశ్వరః । పరాశక్తి పదాశ్లిష్టః ।
యోగానందః । సదోన్మదః । సమస్తవైరి తేజోహృత్ః ।
ఓం దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానంద దాయక
దిగంబరమునే బాల పిశాచ జ్ఞానసాగర॥
దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా । (5 మార్లు)

## దత్త స్తవము

ఓం దత్తాత్రేయం మహాత్మానం । వరదం భక్తవత్సలం
ప్రపన్నార్తిహరం వందే । స్మర్తృగామీ సనోవతు
దీనబంధుం కృపాసింధుం । సర్వకారణ కారణం
సర్వరక్షాకరం వందే । స్మర్తృగామీ సనోవతు
శరణాగత దీనార్తం । పరిత్రాణ పరాయణం
నారాయణం విభుం వందే । స్మర్తృగామీ సనోవతు
సర్వానర్థహరందేవం । సర్వ మంగళ మంగళం
సర్వక్లేశహరం వందే । స్మర్తృగామీ సనోవతు
బ్రహ్మణ్యం ధర్మతత్వజ్ఞం । భక్తికీర్తి వివర్ధనం
భక్తాభీష్టప్రదం వందే । స్మర్తృగామీ సనోవతు
శోషణం పాప పంకస్య । దీపనం జ్ఞానతేజసః ।
తాప ప్రశమనం వందే । స్మర్తృగామీ సనోవతు
సర్వరోగ ప్రశమనం సర్వపీడా నివారణం
అపదుద్ధరణం వందే । స్మర్తృగామీ సనోవతు
జన్మసంసార బంధఘ్నం । సర్వరూపానంద దాయకం







నిశ్శ్రేయసపదం వందే । స్మర్తృగామీ సనోవతు
జయలాభ యశఃకామ । దాతుర్దత్తస్యయస్త్వయం
భోగమోక్ష ప్రదస్యేమం । ప్రపఠేత్ సకృతీభవేత్
ఓం శ్రీ సాయి దత్తాత్రేయ (3సార్లు)

## స్థిరచిత్తమును ప్రసాదించు శ్రీ దత్త స్తోత్రమ్

ఓం అనసూయాత్రి సంభూతా, దత్తాత్రేయ మహామతే
సర్వదేవాధి దేవత్వం, మమచిత్తం స్థిరీకురు ॥
శరణాగత దీనార్త, తారకాఖిల కారక
సర్వబాలకదేవత్వం, మమచిత్తం స్థిరీ కురు॥
సర్వమంగళ మాంగళ్య, సర్వాధివ్యాధి భేషజ
సర్వ సంకట హారిన్త్వం, మమచిత్తం స్థిరీకురు ॥
స్మర్తృగామీ స్వభక్తానాం, కామదోరిపు నాశనః
భుక్తిముక్తిప్రదః సత్వం, మమచిత్తం స్థిరీకురు॥
సర్వపాపక్షయకరః, తాపదైన్యనివారణః ॥
యోఽభీష్టప్రదః సత్వం మమ చిత్తం స్థిరీకురు ॥
య ఏతత్ ప్రయతఃశ్లోకపంచకం పఠేత్ సుధీః
స్థిరచిత్తః సభగవత్ కృపాపాత్రం భవిష్యతి ॥
శ్రీ దత్తాత్రేయ స్వరూప శ్రీ సచ్చిదానంద సమర్థ సద్గురు
శ్రీ సాయినాథ మహరాజ్‌కీ జై

# అంకితం



ఓం దత్తాత్రేయ హరేకృష్ణ
ఉన్మత్తానంద దాయక ।
దిగంబరమునే
బాల పిశాచ జ్ఞానసాగర ॥

షిర్డి నుండి 120 కి.మీ. దూరములో వున్న పైటాన్ నవనాథుల కర్మభూమి పురాతన క్షేత్రము లోని కనీఫ్ నాథునికి (సమాధి మందిరము) అంకితమిస్తూ.....

మీ అభిమాన రచయిత
**ఇసుకపల్లి సంజీవశర్మ**
చందలూరు

E/Srinivas/Nava Nadha Charitra





**శ్రీ దత్త మహరాజ్**

**శుభాశీస్సులతో...**



శ్రీమతి / శ్రీ------------------------------------------------

గారికి--------------------------------------------సందర్భముగా

**"నవనాధ చరిత్ర"** అను పుస్తక రత్నమును బహుకరించడమైనది.

సంతకం.

(మీ మీ ఆప్తమిత్రునికి / బంధువునకు మీ కానుకగా
ఈ పుస్తకమును ఇవ్వదలిస్తే ఈ పేజీని ఉపయోగించండి.)



## విషయసూచిక

ఓం శ్రీరాములు-శ్రీపాద శ్రీవల్లభాయ నమః

## ఇష్టదేవతా ప్రార్థన

**శ్లో॥ మత్స్యేంద్ర గోరక్షజాలంధరాద్యా గహనీ కానీఫా చేరంగినాధాః**
**భర్తరి చర్పటనాగనాథా భూమ్యాంబభూవుః నవనాథ సిద్ధాః**

శ్రీ మన్మహాగణాదిపతయే నమః

ప్రభూ! వినాయకా! గౌరీనందనా! ముక్కోటి దేవతలు నీవు విఘ్ననివాకుడవనియు ఇష్టార్థములను ప్రసాదించువాడవనియు తొలుదొలుత నిన్ను మనసార పూజించి కార్యాచరణమునకు కంకణము గట్టుకొనెదరు. ఆ పూజాఫలితముగ నీ పాదముల నాశ్రయించిన వారి సర్వాభీష్టములు సిద్ధించుచున్నవి. నా జాతక ప్రభావ మదెట్టిదో నేను ఏ పనిచేయుటకుపక్రమించినను వేయి విఘ్నములు లొక్కుమ్మడిగ శ్రావణ మేఘమువలె చుట్టుముట్టి అడ్డుకొనుట పరిపాటిగ నున్నది. అయినను ఒక్క విశేషమేమన నా రచనా వ్యాసంగముల యందు మాత్రమే నీ శూర్పకర్ణములను విసరుచు విఘ్నములను చెల్లాచెదరుగావించి అవిఘ్నమస్తు - శుభమస్తు అని నన్నాశీర్వదించుట నా సుకృత విశేషము. నీ పాదారవిందములకు నా నమస్కారములు.

జననీ సరస్వతీదేవీ! శిరీష కుసుమ పేశలమగు నీ పద సరసీరుహములకు శతకోటి ప్రణామములు. తల్లీ! దయాకల్పవల్లీ వీణాపుస్తకపాణివగు నిన్నెల్ల వేళల స్మరించు వారలుసంగీత సాహిత్య శిరోమణులై రాజాధిరాజులచే సత్కారము లందుకొని మన్నన చెందుట వింతగానేరదు. పాలను నీటి నుండి వేరు చేయగల నైపుణ్యము నీవాహనమగు హంసకెట్లు అలవడియున్నదో అట్లు నిన్ను ప్రవిమల చిత్తమున 'ఐం' బీజ సంపుటీ కరణముతో నీదగు మహామంత్రమును సదాజపము సేయు పరమహంసల జ్ఞానదృష్టికి ఈ ప్రపంచము మాయ మిధ్యయని గోచరించి తెరవలె తొలగి ఆ బ్రహ్మాస్త్ర పర్యంతము బ్రహ్మమయమై భాషింపగలదు. అట్టి సుకృతాత్ముల కట్టెదుట మందస్మిత స్ఫురితముగ్ధ ముఖారవిందమున త్రిలోకైక ప్రపూజ్యుడు,



జగద్గురువగు దత్తభగవానుడు లాస్యమొనరించుచు లీలలను ప్రదర్శించుట ఒక అబ్బురము కానేరదు.

నవనాథ చరితము రేఖామాత్రముగా వచనమున వ్రాయుటకు పూనిక వహించుట కుంటివాడు పర్వత శిఖరాగ్రము పైకూర్చొనుటకు సేయు ప్రయత్నము వంటిదనియు అది నా శక్తికి బుద్ధికి మించిన పనియని తెలియకపోలేదు. సరికానిమ్ము. అయినను అమ్మరో! నాకొక ప్రగాఢ విశ్వాసము మొక్కవోవకున్నది. చదువుల రాణివి, వాణివి, శారదాదేవివి, సకల విద్యా ప్రదాయినివగు నీ చరణ కమలములు నాకు పట్టుగొమ్మ వంటివి. కరుణామయివి నీవు. నీ పాదార్చకుడనగు నేను కలము చేబట్టిన కుంటివాని కడకు గోదావరి ప్రవహించునట్లు ఎనలేని నీ కృపారసము వెల్లువలై ప్రవహించి నన్ననుగ్రహింపగలదను పరిపూర్ణ విశ్వాసము నా హృదయ మందిరమున లెస్సగ పాదుకొనియున్నది. మాతరో! మనలో మాట నేను నిమిత్తమాత్రుడనే! సర్వము నీ యధీనము. పదజాలమునకు ఆ పాత రమ్యతను గూర్పుము. రసవన్మనోహర భావములను రచన యందు గుబాళింపజేయుము. నా యీకృతిని దత్తప్రభువునకు ప్రీతినొసగజేయుము. పండిత పామరులకు ఆమోదయోగ్యము గావింపుము. రచన కుపక్రమింప నాకిక నెలవొసంగుము.

హయగ్రీవావతారమున వెలసిన శ్రీమన్నారాయణునకు పరమయోగి పుంగవులకు కందర్పకోటి శతసుందర దివ్యమంగళ విగ్రహుడై దక్షిణామూర్తి రూపమున ఆత్మతత్త్వమును అద్దము పట్టినట్లు చిన్ముద్రను దాల్చి వివరించిన పరమ శివునకు పరశ్శతనమోవాకములు.

జగద్గురువు లోకైక ప్రపూజ్యులగు కంచి పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ సార్వభౌముల పరమపావన పాదాబ్జములకు శతకోటి ప్రణామములు. ప్రభూ! మందబుద్ధినగు నన్ను కరుణించిన దయా సముద్రువడు నీవు. నీపాద ధూళిపై నాకుగల ఎనలేని భక్తి, అకుంఠిత విశ్వాసము రచనా రూపమున ప్రవహించు చున్నది. ప్రభూ! నేను ప్రార్థించి యర్థించినది నీవు ప్రసాదించినదీ కవిత్వ సంపదనేకదా!! ప్రభూ పరంజ్యోతి స్వరూపా! నిన్ను మదినెంచి కలమును చేబట్టిన కథాఘట్టము లన్నియు సరళముగ సాగిపోగలవు. ఆ సత్కీర్తినీ యదియే !! నీవొకటి నాత సాంప్రదాయమునకు మూలకందమైన శ్రీదత్తభగవానుడింకొకరను వారలు బుద్ధి జాడ్య జనితోన్మాదులు కదా !





# నవనాధ చరిత్ర

## నవనారాయణుల వృత్తాంతము

స్వాయంభువు అను మనువునకు ప్రియ వ్రతుడను పుత్రుడు దయించెను. ఆత్మారాముడు పరమభాగవతోత్తముడగు ప్రియవ్రతుడు విశ్వప్రజాపతి కూతురగు బర్హిష్మతిని పెండ్లియాడెను. ఆయనకు పదిమంది కుమారులు కలిగిరి. ప్రియవ్రతుడు చీకటి రాత్రులన్నియు పగటి వేళలుగ రూపొందించ నెంచి రధారూఢుడై రెండవ సూర్యునివలె ప్రకాశించుచు తన రధమును నడిపింప రధచక్రముల ఒత్తిడికి సప్తద్వీపములు సప్త సముద్రము లేర్పడిన వనెదరు.

ప్రియవ్రతుని పెద్దకుమారుడు అగ్నీధ్రుడు. ఆయన సంతానాపేక్షచే బ్రహ్మను గూర్చి తపమొనరింప చతుర్ముఖుడు సత్యలోకమున ఆస్థాన గాయకురాలైన పూర్వచిత్తియను కోమలాంగిని తపోవనభూమికి పంపినాడు. ఆ చంచచ్చంచలాతన్వి తనూ విలాసమునకు రూపలావణ్యవయో విలాసము లనుగాంచి అగ్నీధ్రుడు ప్రణవో పాసనకు నీళ్లు వదలి ప్రణయ మంత్రము లను పఠించుచు ఆమె దరిజేరెను. ఇరువురొకటిగనైరి. అద్దాన వారికి





తొమ్మండ్రుగురు పుత్రులుదయించిరి. వారిలో పెద్దవాడు నాభి. ఆయన మేరువు పుత్రిక యగు మేరుదేవిని పెండ్లియాడినాడు. నాభి శ్రీహరిని ప్రార్థించి ప్రసన్నుని గావించుకొని "ప్రభూ! నీవంటి పుత్రుని నాకు ప్రసాదింపుమని ప్రార్థింప శ్రీమన్నారాయణుడు" వత్సా! నా వంటి వాడను నేనే యగుదును. అయినను నీ కోరిక యీడేరగలదని తెలిపి శ్రీహరి మేరుదేవి గర్భమున వెలసెను. ఋషభుడను పేరున లోకాన ప్రపూజ్యుడై వర్థిల్లెను. ఋషభ చక్రవర్తి భార్య జయంతి. ఆ పుణ్య దంపతులకు వేదశాస్త్ర పండితులగు నూర్గురు పుత్రు లుదయించిరి. వారిలో పెద్దవాడు భరతుడు. భరతుడు తండ్రి తదనంతరము సింహాస నము నలంకరించినాడు. ఆ భరతుని పరిపాలనా యుగము నుండి మన భూభాగము నకు భరతవర్షమని పేరొదవినది.

భరతుడు తన రాజ్యమును కుమారుడైన సుమతికి అప్పజెప్పి గండకీనదీ తీరమున పులహాశ్రమమున తపము సేయుచుండెను. నిండు చూలాలుగనున్న హరిణ మొకటి గండకీ నదీ జలమును త్రావ వచ్చినది. సింహగర్జన దాని చెవినిబడినది. ప్రాణభీతిచే నది కుప్పించి దుముకుటలో దాని గర్భమున నున్న జింకపిల్ల నది యందుపడినది. ఆ హరిణము నదియందున్న చట్రాతిపై బడి ప్రాణములను గోల్పోయినది-హృదయ విదారకమగు నా సన్నివేశము భరతుని మనస్సును కలవర పరచినది. దిక్కులేక నీటియందు బడి కొట్టు మిట్టాడుచున్న జింకపిల్లకు భరతుడు దిక్కు మ్రొక్కు ఆయెను. మమకారమను సుడిగుండమున పడిన భరతునకు జింకపిల్ల తోడిదే లోకమైనది. ప్రాణావసానసమయము నందైనను భరతుడు భగవంతుని మది నెంచక తన జింకపిల్లపై దృష్టిని నిలిపి అసువులను బాసినాడు. ఆ కారణమున మరుజన్మము నందు లేడియై పుట్టినను జన్మాంతరవాసనా విశేషమున శ్రీహరి నేమరక దలంచుచు పూర్వజన్మ స్మృతి గలిగియుండెను. జన్మమారినది. మరుజన్మ మున సదాచార సంపన్నులగు భూసురుల ఇంట జన్మించి ప్రాపంచిక వ్యవహారము లకు దూరుడై అవధూత శిరోమణిగ పురాణ ప్రశస్తిని గాంచియున్నాడు.

ఇక ఋషభ సంతానమునందు మిగిలినవారు తొంబది తొమ్మండ్రు గురు, అందు నవఖండములకు తొమ్మిది మంది అధిపతులైరి. ఎనుబది ఒక్కరు కర్మమార్గ ప్రవర్తకులై వెలసిరి.

మిగిలినవారు తొమ్మిదిమంది సనక సనందన సనత్కుమార సనత్సు జాతుల వలె సచ్చిదానంద స్వరూపులు. శ్రీహరి సాయుజ్యమును ప్రసాదింప గల భాగవత ధర్మమును పుడమిపై విస్తరిల్ల జేసిన మహామహిమోపేతులు. కాలినడకతో పయనము సేయుచునే) దుస్తరమగు సంసారమగు మహా సముద్రపు టావలి దరిజేర్చునది భాగవతధర్మము-ఆ భాగవత ధర్మమును బోధింపుమని శ్రీకృష్ణభగవానుని తండ్రియగు వసుదేవుడు నారద మునీంద్రుని యడిగినాడు.

అట్టి భాగవత ధర్మము నిలపై ప్రవర్తిల్లజేసిన సంస్మరణీయులు 1. కవి 2. హరి 3. అంతరిక్షుడు 4. ప్రబుద్ధుడు 5. పిప్పలాయనుడు 6. అవిర్హోత్రుడు 7. ద్రుమిళుడు 8. ఛమనుడు 9. కరభాజనుడు. వీరి నామసంకీర్తనమున జనన మరణములను విషవలయము నుండి మానవుడు విముక్తుడగును. ముక్తి కరతలామలకమై యొప్పునని, చిదాకాశమునందు సంపూర్ణ పూర్ణిమాచంద్రబింబము వలె ప్రకాశించుచు యోగమను జ్ఞానమునకు మధ్యందినమార్తాండునివలె తేజరిల్లు శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుతో తెలిపియున్నాడు. త్రిలోకైక ప్రపూజ్యులు పుణ్యమూర్తులగు నవనారాయణుల పరమహంస స్థితి మిక్కిలి పొగడదగియున్నవి. నవ నారాయణులను స్మరించినంత పాతకోపపాతకములు డుల్లిపోవును.

ఒక పరి మిథిలాపతి యగు జనకమహారాజు కల్పోక్త విధానముగ యజ్ఞము సలుపుచుండ మహర్షులెల్లరా యాగమును జూడనేగిరి. పూర్ణా హుతి సమయమున నవనారాయణులా యజ్ఞవాటిక యందు ప్రవేశించిరి. దివ్యతేజస్సంపన్నులై వెలుగు నవ నారాయణులను జూచినంతనే జనకమహారాజు పరుగులు తీసినట్లు వేవేగ వెడలి వారి దివ్య చరణార విందములపై వ్రాలి అమందానందమున అత్యంతాదరమున సత్కరించి" మహాత్ములారా! జ్ఞానదృష్టితో మిమ్మగాంచిన వారలకు మీరు పరమేశ్వర స్వరూపులు. దేహభావముతో చూచువారలకు మీరు భాగవత శిరోమణులు. భక్తి మార్గములు తొమ్మిది యున్నవి. నవవిధ భక్తి మార్గములు నవ నారాయణులగు మీయందు రూపకల్పనముగావించుకొని యున్నవి. దేహభావమును పరిపూర్ణముగ వదలి ఆత్మయందు దృష్టిని మరలించిన వారలకే మీ వంటి మహనీయుల సందర్శన భాగ్యములభింపగలదు.





మహాపురుష సందర్శనము అలవియైనది కాదు. మీబోటి మహనీయుల చెంత జేరిన చాలును. దీపము కడనుంచిన కర్పూరమువలె పెక్కు జన్మల యందొనరించిన పాపరాసులు తెప్పపాటు కాలమున నశించి పోగలవు. ఆ సుకృతము నేటికి నాకు లభించినది" యని మహదానంద భాష్పము లొలకించెను.

యజ్ఞము ముగిసినంతనే జనకమహారాజు నవనారాయణులను మణులు తాపిన బంగారు పీఠములపై సుఖాసీనులను గావించి చేతులు జోడించి "మహాత్ము లారా! చిరకాలము నుండియు నేను తెలిసికొనుటకై చింతనజేయు విషయములను విన్న వించెద నాలకింపుడు."

1. భాగవత ధర్మమననేమి? 2. భగవద్భక్తుల తీరు తెన్నులెట్లుండును 3. మాయాస్వరూప స్వభావములు లెట్లుండగలవు 4. మాయకు తరుణో పాయమేమి? 5. పరబ్రహ్మమన నేమి? 6. ఆ స్థితి యెట్లుండును? 7. కర్మసిద్ధాంతము విధానమేమి? 8. భగవద్భక్తులయ్యును కొన్ని సమయ సందర్భముల యందు అధోగతి పాలగుటకు కారణమేమి? అవతార ప్రయోజనము వివరణ గూర్చి నాకు సుబోధకమగునట్లు వివరింప ప్రార్థనము.

(పై ప్రశ్నలకు విపులముగ నవనారాయణులు జనక మహారాజునకు సమాధానము లొసగియున్నారు. ఈ విషయము పదునెనిమిదివేల ఏడు వందల తొంబది ఎనిమిది 18798 ఓవీలతో ఒప్పిదమైన ఏకనాథ భాగవతము నందు వివరింపబడియున్నది. గ్రంథవిస్తరణ భీతిచే వ్రాయుట మానినాను)

## నవనాధ అవతార ప్రశంస

శ్రీకృష్ణ భగవానుడు ద్వాపరయుగము ముగిసి కలియుగము ప్రారంభమగు సమయమున ద్వారకాపురము నందు నిండు సభయందు కొలువు దీరియుండెను. వాసుదేవుని చెంత ఉద్ధవుడు అక్రూరుడు మున్నగు భక్తులుండిరి. భవితవ్యమును గురించి జనార్ధనుడొకించుక యోచించి ఋషభకుటుంబమునకు చెందిన నవనారాయణులను స్మరించెను. ఆ క్షణము నందే నిండు పేరోలగమున నున్న గోవిందుని సన్నిధిని వారు చేరిరి. నవనారాయణులు అవధూత శిరోమణులు. దిగంబరులు, సిద్ధ సంకల్పులు. అత్యంత మహిమోపేతులు.

నవనారాయణులను చూచినంతనే దేవకీ నందనుడు కనత్కనక మణిమయ సింహాసనము నుండి దిగ్గునలేచి వారి కెదురేగి సగౌరవమున వారిని స్వర్ణపీఠములపై కూర్చుండబెట్టి అర్ఘ్య పాద్యాది సత్క్రియా కలాపము లచే పూజించినాడు. నవనారాయణులు శ్రీకృష్ణభగవానునితో “వసుదేవ కుమారా! యోగీశ్వరులు, మునీశ్వరులు, తపశ్చక్రవర్తులు నిన్నెల్ల వేళల నేమరక మది దలచి ధన్యతగాంచు చున్నారు. అట్టిపట్ల నీవు మమ్ములను నీమది దలచుటచే మేము నీచే బహుమానము అందుకొనిన వారమైతిమి. మావలన నెరవేరదగిన కార్యమేదైయున్నదో దయచేసి సెలవిమ్మనిరి.

అందులకు యశోదానంద వర్ధనుడు “మహాత్ములారా! త్రికాలజ్ఞులగు మీకు తెలియని దేమున్నది? కలియుగము ముక్కుజూపినది. యుగధర్మము ననుసరించి భూప్రజలెల్లరు దురాచారులై అసద్వర్తనులై అవినీతికి పాల్పడుదరు. లజ్జయే భూషణముగ నుండదగిన స్త్రీలు బిడియము భయమును వదలి చీకటి తప్పుసేయుట యందు నేర్పుగలిగి యుందురు. సదాచారము కలికమునకైన నుండజాలదు. విప్రులు శూద్రాన్నమును కుడుపుచు కులభ్రష్టులగుదురు. ఒక్కమాటగ తెలుపవలయుననిన ధర్మము అడుగంటును. అధర్మము ప్రబలి మితిమీరిపోగలదు. యజ్ఞ యాగముల పేరెత్తు వారుండకుందురు. అద్దాన వర్షాభావమేర్పడ క్షామదేవత నేల నాలుగు చెరగుల విలయ తాండవమాడును. జారులు చోరులు నానాటికి హెచ్చిపోవుదురు. వెలది, జూదము, పానము, మొదలగు సప్తవ్యసనములు విశృంఖల వీరవిహార మొనరించును. భక్తిజ్ఞానములకు నిలువ నీడ







లేకుండును. కపటవర్తనము గలవారు జ్ఞానులమని ప్రజలను వంచించు దురు. వర్ణసంకరమేర్పడును. ధర్మమను పదము నుచ్చరించువారు లేకుందురు.

ధర్మమునకు హాని వాటిల్లినపుడు-దుష్టులు ప్రబలి సజ్జనులను పీడించినపుడు నేనవతరించి ప్రపంచము నుద్ధరించుట విధాయకమై యున్నది. ఇది ఒకరివలన నెరవేరునదికాదు. కలియుగమున ధర్మ సంస్థాపనమునకై మీరునునాకు సహాయముగ నవతరింపవలసియున్నది. “అనవిని నవనారాయణులు “దేవదేవా! యదుకుల భూషణా ! కృష్ణా ! నీకు సహాయముగ నుండుటకై మేము ఏయే అవతారముల నేవిధముగ దాల్చ వలయునో సెలవిమ్మని”కోరిరి. అందులకు కృష్ణుడిట్లు తెలుపుచున్నాడు.

మీలో కవి యనునతడు మత్స్యేంద్రుడను పేరున జన్మింపవలయును. హరి యనునతడు గోరక్షుడను పేరు దాల్చి మత్స్యేంద్రునకు శిష్యుడై వర్తిల్లవలయును. మూడవ వాడగు అంతరిక్షుడు జాలంధరుడను పేరునను, ప్రబుద్ధుడు కానీఫాయను పేరునను వెలయువలయును. కానీఫా జాలంధరు నకు శిష్యుడై యుండగలడు. పిప్పలాయనుడు చర్పటనాథుని గను; అవిర్హోత్రుడు నాగేశనాధుడను పేరునను ద్రుమిళుడు భర్తరీనాధుడను పేరునను, చమనుడు రేవణనాధుడను పేరునను కరభాజనుడు గహనీ నాధుడనుపేరున నవతరించవలయును.

కలియుగమున ధర్మసంస్థాపనార్థమై మనము పదిమందిమి కాక మహాను భావులు మరికొందరు పుట్టవలయును. వాల్మీకి మహర్షి తులసీ దాసుగను, అటులనే శుకయోగీంద్రుడు కబీరు అను భక్తునిగను, వ్యాస భగవానుడు జయదేవునిగను, నా పరమభక్తుడగు ఉద్ధవుడు నామ దేవుగను, జాంబవంతుడు నరహరియను భక్తుని గను నాసోదరుడగు బలరాముడు పుండరీకుడుగను, జన్మమెత్తవలసి యున్నవి. నా యీ కృష్ణావతారము ముగిసినపిదప నేను జ్ఞానదేవుగను, నాతోబాటు శివుడు నివృత్తి నాధునిగను బ్రహ్మదేవుడు సోపాన దేవునిగను, యోగమాయ ముక్తాబాయిగ పుట్ట వలయును. రామభక్తాగ్రేసరుడగు హనుమంతుడు సమర్థరామదాసుగ వెలయగలడు. కుబ్జయనుదాసి జానాబాయియను పేరున జన్మించును.

ఇట్లు మనమందరము పుడమిపై వెలసి భక్తిమార్గమును పూలబాటగ రూపొందించవలయును.

నవనాధులు శ్రీకృష్ణుని ఆదేశమును విని “ప్రభూ! నవనారాయణుల మగు మేము ఎవరెవరెచట జన్మించవలయునో సెలవిమ్మనిరి. అందులకు శ్రీకృష్ణుడిట్లు తెలుపుచున్నాడు.

సృష్టి ప్రారంభసమయమున బ్రహ్మదేవుని వీర్యము స్ఖలనమగుట కారణమున నా అమోఘమగు వీర్య ప్రభావమును ఋషులనేకులు పెక్కుతావుల యందు జనన మొందుదురని వ్యాసభగవానుడు భవిష్యత్పురాణ మున తెలిపియుండుట మీకు తెలియనిదికాదు.

అటులనే ఉపరిచరుడను వసువు, ముల్లోకములను మురిపించు మోహనాంగి యగు ఊర్వశినిగాంచి తహతహలాడ అతని వీర్యము యమునా నదీజలములయందు పతనమైనంతనే చేపయొకటి నీటితో బాటు వసువీర్యమును మ్రింగినంత నదిచూలు దాల్చును. మీలో మొదటివాడు కవి చేప కడుపునబుట్టి మత్స్యేంద్రుడను పేరున ఖ్యాతి నార్జించును. శివుని ఫాలనేత్రమున దహింపబడిన మన్మధుడు బూడిద ప్రోవు నందు సూక్ష్మ రూపమున నుండి-బృహద్రుడనురాజు యజ్ఞము సేయువేళన యజ్ఞ కుండము నుండి మీలో అంతరిక్షుడను నతడు వెలయగలడు. మన్మధుని ఆత్మ నాతని యందు జీవరూపము దాల్చ జాలంధరుడను పేరున నాతడు వెలిసి మహా తేజశ్శాలియై దిగంత యశోవిరాజితుడు కాగలడు. రేవానది (నర్మదా) యందు బ్రహ్మవీర్యము నందు కొద్దిమాత్రము పతనమైనందున చమసుడను నతడా అమోఘ వీర్యప్రభావమున వెలసి రేవణసిద్ధుడని పేరుగాంచును.

బ్రహ్మవీర్యము నందొకించుక పతనమైనపుడది కుమార్తె యగు పద్మిని యను నాగసర్పము శిరముపై బడ నదితన ఆహారమని మ్రింగును. వీర్య ప్రభావమున నా సర్పము చూలు దాల్చును. ఆస్తీకమహర్షి యా విషయ మును నెఱిగి జనమేజేయ మహారాజొనరించు సర్పయాగమున నాగసర్పము నశింపకుండునట్లు దానినొక మఱ్ఱిచెట్టు తొర్రలో దాచి నవమాసములు పూర్తియైనంత పాము గ్రుడ్డును చెట్టునం దుంచి నాగసర్పమును స్వస్థాన మును చేర్చును. ఆ గర్భస్థపిండము నుండి అవిర్హోత్రుడను నతని ఆత్మజీవ రూపమును దాల్చి వటసిద్ధ నాగనాధుడని ప్రసిద్ధి గాంచును.

మత్స్యేంద్రుడు దేశాటనము సేయుచు సంతాన హీనురాలగు నొక గృహిణికి భస్మము నభిమంత్రించి యొసగును. ఆ గేస్తురాలు అమ్మలక్కల



మాటలచే మోసపోయి యా పవిత్ర భస్మమునొక ఆవుపేడ పేర్చు దిబ్బలో పడవైచెను. పండ్రెండేండ్ల తరువాత నాదిబ్బ యందుండి బాలుడు వెలువడి గోరక్షకుడను పేరున మీలో నొకరగు హరి యావిర్భవించును. శివగౌరీ కళ్యాణమహోత్సవమున పౌరోహిత్యము వహించిన బ్రహ్మదేవుడు త్రిపురసుందరియగు పార్వతిని జూడ మహాకారణాంతరమున బ్రహ్మవీర్యము స్ఖలనమైనది. సభ్యతను పాటింప నెంచి బ్రహ్మతన రేతస్సును కాలిమడిమతో రుద్దనది. ఆరువేల విభాగములై యుందుండి అరువది వేల వాలఖిల్యు లుదయించిరి. మిగిలినది కసవుగ నూడ్చబడినది. క్రమక్రమముగ గంగ యందు కలిసి నదీతీరమున నున్న రెల్లు గడ్డిలో చిక్కుకొని యందుండి చర్పటనాధుడు వెలువడును. చర్పటనాధుని యందు పిప్పలాయనుని ఆత్మ జీవరూపమున వెలువడ నాతనికీర్తి దశదిశలకెగ బ్రాకును. కౌలికుడను మహర్షి తన పర్ణశాల నుండి భిక్షాటన కేగుచు తన భిక్షాపాత్ర పర్ణశాల ముందుంచును. సూర్యుని తేజస్సు ఆ భిక్షాపాత్ర యందు చేరినది. ముని గ్రహించి యా పాత్రను భద్రపరచును. అందుండి ద్రుమీళుడను మీలో నొకడు భర్తరీ నాధుడను పేరున వెలయగలడు.

హిమవత్పర్వతము నందలి కీకారణ్యమున నొక గజము నిద్రించు చుండును. సరస్వతీదేవిని జూచి బ్రహ్మదేవుడు మరులుగొన వాణీపతి రేతస్సు స్ఖలనమొంది నిద్రించుచున్న ఏనుగుచెవి యందు చేరును. అందు ప్రబుద్ధుడను మీలోనొకడుగనున్న యాతని ఆత్మజీవదశనొందును. కర్ణము నుండి వెలువడినందున అతడు కర్ణకానీఫా యని నవనాధులలో నొకడై ప్రసిద్ధి వహించును.

గోరక్షుడు సంజీవినీ మంత్ర జపముసేయుచు నొక మట్టి బొమ్మను చేయ సంజీవినీ మంత్రజపఫలితముగ నా మట్టి బొమ్మకు ప్రాణ ప్రతిష్ఠ జరుగును. కరభాజనుని ఆత్మజీవరూపము నొంది గహనీ నాధుడను పేరున ప్రఖ్యాతి గాంచును.

నవనాధుల భవిష్యదవతార వృత్తాంతమున శ్రీకృష్ణభగవానుడు వారికి విశదీకరించి తెలిపెను. నవనాధులు శ్రీకృష్ణభగవానునకు నమస్కరించి ఆయా అవతారములను దాల్ప సెలవుగైకొని మందర పర్వతమును గూర్చి పయనము సలిపిరి. మందర పర్వత గుహలయందు తమ శరీరములను భద్రపరచి సమాధుల నేర్పరచి కర్తవ్యమును నిర్వహింప పూనికవహించిరి.

## మత్స్యేంద్రనాధ చరిత్ర

తపస్సమాధినుండి శివుడు మేల్కాంచి రజతా చలమున పంచ బ్రహ్మషడంగ బీజసహిత ప్రాసాద పంచాక్షరీ సహిత మంత్రజప పరాయణుల వంక దయార్ద్ర దృష్టిని ప్రసరింపజేయు చుండెను. గలగల ధ్వనులచే గంగాభవాని కపర్ధి జటా జూటమున హొయలొలికించు చుండెను. అందాల జాబిలి సిగలోపువ్వుగ చూడ ముచ్చట గొలుపు చుండెను. కైలాసవాసులెల్లరా దేవ దేవుని మహదానంద మతి శయింప ఉచ్చైర్నాదమున "నమఃపార్వతీపతే హరహర మహాదేవ" యని సభక్తికముగ చేతులు జోడించి నోరార నుడువుచుండిరి.



భక్తాభీష్ట ప్రదాయిని, ఆశ్రిత కల్పవల్లియగు పార్వతీదేవి శివుని వామభాగము నలంకరించి యుండినది. సర్వమంగళ తన మనమున నున్న కోరికను సర్వేశ్వరునకు విప్పిచెప్పుటకు మారు చిరునగవు లొలికించుచు మిన్నకుండినది. గిరికుమారిముఖ పద్మమున దోచు మందహాసరోచిస్సులు పినాకపాణికి ప్రీతికరముగ నుండెను. "ప్రాణేశ్వరీ! నీ మనమున నేదో కోరిక మిగిలియున్నటులున్నది. నన్నడుగుటకు మారు చిలిపిగ చిరు నగవులు చిందుచు మౌనముద్ర దాల్పనేల?" యని భక్తవ శంకరుడు నగరాజ తనయతో పలికెను. అందులకు హైమవతి "ప్రాణేశ్వరా! ముక్కోటి దేవతలకు సార్వభౌముడవు. నిన్ను మించిన దేవుడీ రేడు జగముల యందు లేడనుట ప్రసిద్ధముగ నున్నది–తపోధనుల కొంగున వరములను మూటగట్టి యిచ్చు భక్తవ శంకరుడవు నీవు. అట్లయ్యును తపశ్చక్రవర్తి వలె సర్వకాల సర్వావస్థల యందు నీవేదో నామస్మరణ అవిరళముగ సలుపుచునే యుందువు. ఆ పావన శుభనామ మెయ్యదియో నీ అర్ధాంగి నగు నాకు ఉపదేశమొసగుమని" ఇమ్ముగ పలికినది.

అందులకు చంద్రమౌళీశ్వరుడు "పార్వతీ! భక్తులేది యడిగినను లేదు–కాదనక ప్రసాదించుట నా స్వభావము కదా!! ఇక నీ కోరికను మన్నింప కుందునని యెంచి మౌనముద్ర దాల్చి యుంటివి కాబోలు"నని గల గల నవ్వెను. పార్వతీ దేవి నునుసిగ్గుచే శిరము వాల్చినది. మరల





శివుడామెతో "హృదయేశ్వరీ ! నీ కడ దాపరికమేల? మంత్రోపదేశ మొసగుటకు ఏకాంత ప్రదేశము అనువైనది. నంది వాహనము నధి రోహింపుము. నీవెంట నేనును వచ్చువాడను." అని ఉమా మహేశ్వరులు భూలోక విహారమున కేగుదెంచి యమునా నదీ తీరమును జేరి ఇసుక తిన్నెలపై నిరువురు సుఖాసీనులైరి–పరమేశ్వరుడు పార్వతీదేవికి పూర్వోత్త రాంగన్యాస సహితముగ రామ తారకమంత్రము నుపదేశమొసగి బీజాక్షరముల ప్రభావమును మంత్రాక్షరముల మహిమాతిశయమును విపులముగ వివరించెను. తదుపరి మంత్రోపదేశము నొందిన ఫలితముగ ఆమె అనుభవమేమని శివుడు ప్రశ్నించెను.

"ఓం నమశ్శివాయ – శివాయ గురవేనమః మహాదేవా! బంగారము కన్నను ఆభరణములు వేఱు కానటుల – మట్టి కన్నను పాత్రలు వేఱుకానటుల అలఘుస్థావర జంగమాత్మకమగు యీ ప్రపంచ మంతయు పరబ్రహ్మస్వరూపముగ నాకంటికి కన్పట్టుచు ప్రకాశించుచున్నది." అని యమునా నదీ జలముల నుండి శివున కొక శిశువు పలుకులు వినబడినవి – శివుడు ఆశ్చర్యమగ్నమానసుడై యమునా నదీ జలముల నుండి ఇట్టి వింత పలుకులు వినబడుట యేమని దివ్యదృష్టిని సారించినాడు. ఆ శిశువు అనుపూర్వికముగ చంద్రశేఖరునకిట్లు తెలిసినది.

ఒక సమయమున ఉపరి చరవసువు సురలోక సుందరీమణులలో ఆటపాటల యందును అంద చందములయందును సాటిలేని మేటి అమర వేశ్యయగు ఊర్వశిని కన్నుల పండువుగ చూచినాడు. ముల్లోకముల నుఱ్ఱూతలూగించు ఆ నవ లావణ్య వయోవిలాసిని మెఱుపుతీగ వంటిమేని లావణ్యమునకు సౌందర్యమునకు సౌకుమార్యమునకు ఉపరి చరవసువు ముగ్ధుడై మురిసి మురిసి ముచ్చట నొంది మోహాపరవశుడాయెను. పూవిలుకాని ఆరడికి తాళజాలక తహతహనొంద వసువు వీర్యము స్ఖలన మొంది యమునానదీ జలముల యందు పతనమైనది. అమోఘమగు ఆ వీర్యము నందు నవనారాయణులలో నొకరగు "కవి" జీవాత్మయందు చేరినది. చేపయొకటి ఆ వీర్యమును ఆహారమని యెంచి మ్రింగినది. తొమ్మిది నెలలుపూర్తిగ నిండి చేపకడుపున నున్న శిశువు పలికిన అమృతపు జల్లులవంటి పలుకులవి యని శిశువునకు విస్పష్టముగ విదితమైనది. శివుడు చేప కడుపున నున్న శిశువుతో "వత్సా! నీవు గొప్ప అదృష్టశాలివి.

నావలన తారకమంత్రమును నీవు వినియున్నావు. నీవు భూలోకమున ప్రజలను సముద్ధరింప సర్వసమర్థుడవగుట నిశ్చయము. నీవు చేపకడుపు నుండి వెలువడిన పిదప బదరికాశ్రమమును చేరగలవు. అచట నీకు శ్రీదత్త భగవానుని దివ్యానుగ్రహము లభింపనున్నది. దత్తగురుదేవుని వలన నీకు మంత్రోపదేశము లభింపగలదు. స్వస్త్యస్తు "అని పరమ శివుడాశీర్వదించి వృషభ వాహనారూఢుడై పార్వతీ సమేతముగ వెండి కొండను చేరెను.

చేపకడుపుననున్న ఆ శిశువు తారకమంత్రము నవిరళముగ జపము సేయు చుండెను. నెలలు నిండినంతనే చేప ప్రసవించింది. గర్భస్థ శిశువును యమునా నది యొడ్డున జేర్చి చేప నీటియందు చేరినది. కొంగలు కొన్ని వచ్చి ఆ గ్రుడ్డును ముక్కుతో పొడువగా ఆ గ్రుడ్డు విచ్చిపోయినది. అందున్న దివ్యతేజోవిరాజితుడగు బాలునిజూచి కొంగలు బెదరి పారిపోయినవి.

నది యొడ్డున ఉదయార్కుని వలె తేజరిల్లుచున్న ఆ బాలుని "కామికుడు" అను బెస్తవాడు చూచినాడు. వృత్తిధర్మముగ చేపలను పట్టుటకై యమునానదీ తీరమునకు వచ్చిన ఆ బెస్తవాడు బాలునిజూచి సంభ్రమాశ్చర్య చకితుడై ఎవరో యీ అందాల బాలుని నదియొడ్డున దిగవిడచిపోయిరి గదాయని చింతిల్లు చుండెను. బాలుడేడ్వసాగెను. అయ్యో! బాలుడు క్రూరమృగముల వాతబడునేమో గదాయని జాలినొందు చుండ అంతరిక్షము నుండి దేవతలు ఆకాశవాణిగ "కామికుడా! ఈ బాలుడు అవతారపురుడు. నవనారాయణులలో నొకడగు కవి యనునతడు. చేప కడుపు నుండి వెలువడియున్నాడు. మత్స్యము కడుపు నుండి వెలువడిన యీ బాలుడు మత్స్యేంద్రుడను పావన శుభనామ ధేయమున జగన్నుతి కెక్కును. ప్రపంచమునుద్ధరించు మహామహితాత్ముడు కాగలడు. సంశయింపక నీవీ బాలుని మీ యింటికి గొనిపొమ్మని" పలికినది.

కామికుడా బాలుని తమ యింటికి గొనిపోయి భార్యయగు శారద్వతతో జరిగిన వృత్తాంతమును వివరించి ఆమె చేతి యందిడెను. సంతోష మతిశయింప ఆమె బాలుని మక్కువమీర అక్కునజేర్చి చెక్కిలి ముద్దాడినది. ఆ బాలుని బెస్తవనిత తన వక్షస్థలమున జేర్చుకొని నంతనే బాలింతకువలె స్తన్యమవ్వారిగ పెంపెసలార దొడగెను. సంతానము లేక సంతాపము నొందుచున్న ఆ బెస్తదంపతులకు భగవంతుడా బాలుని ప్రసాదించినాడని నిర్భరానందిదమున తేలియాడిరి. ఉదయాస్తమయ వేళల





బాలునకు వేడినీళ్ల స్నానము జేయించుచు చనుబాలిచ్చుచు ఉయ్యల యందుజేర్చి జోలపాటలు పాడుచు కన్నతల్లి కన్నమిన్నగ గారాబముతో శారద్వత పెంచి పోషించుచుండెను. తప్పటడుగులు వేసి నడయాడుట నేర్చిన ఆ బాలుడు తెప్పపాటు కాలము కానరాకున్న "మత్స్యేంద్రా! మత్స్యేంద్రా! యని ఎలుగెత్తి పిలువ నా బాలుడు నవ్వులొలికించుచు పరుగిడి వచ్చినంతనే ఆమె గ్రుచ్చికౌగిలించి ముద్దాడుచుండెను. ఇట్లు ఐదు సంవత్సరములు జరిగినవి.

తండ్రియగు కామికుడు సహితము ఆ బాలుని విడచి క్షణమైన నుండజాలక చేపలు పట్టుటకై వలను, వెదురుబుట్టను గైకొని నది కడగేగుచు నొక దినము బాలుని వెంట గొనిపోయెను. నది యొడ్డున బాలుని కూర్చుండుమని తెలిపి కామికుడు నీటిలో వలయొడ్డి చేపలను బట్టి మత్స్యేంద్రుని కడజేర్చి వానిని ఏరి వెదురుబుట్టలో పడవైచుమని మరల చేపల వేటకై నీటిలోనికేగెను.

మత్స్యేంద్రుడు భూమిపై విలవిల తన్నుకొను చేపల దురవస్థను జూచి జాలినొంది తనలో "చేపకడుపున పుట్టిన వాడను నేను. ఇవి నాకు దగ్గరిచుట్టములు. బుట్టలోవేసినవి తమ ప్రాణములను గోల్పోవును. మనకెట్లో సమస్త జీవరాసులకు ప్రాణములపై ప్రీతిమిక్కుటముకదా! నోటి రుచికి కడుపు నింపుకొనుటకు ప్రాణిహింస సేయుట అనర్థదాయకమని" తలచి ఒక్కొక్కటిగ చేపల నన్నింటిని యమునా నది యందు చేర్చెను. బాలుని చర్యలను కామికుడొక కంట కనిపెట్టినాడు. కోపము రెచ్చినది. వేవేగ నదీతీరమునకువచ్చి "నేను చెప్పినదేమి? నీవు చేయునదేమి? నేను శ్రమకోర్చి పట్టిన చేపలను నీవు నీటిలో వదలిన నికమనకు కూడు లభింపదని తెలియదా ఏమని గద్దించి" బాలుని చెంప పై నొక దెబ్బవేసెను.

జానెడు పొట్టకు పట్టెడన్నము పెట్టు సతీమ తల్లులెచట లేకున్నారు. మనకడుపు నింపుకొనుటకు ముప్పొద్దుల జీవహింస సేయనేల" యని మది నెంచి కామికుని కంటబడకుండ నదీతీరమున నున్నచెట్ల దాపున బయలుదేరి ఉత్తరపు దిక్కును గూర్చి వెడలెను. మత్స్యేంద్రుడు చివరకు బదరికాశ్రమమును చేరెను. అచట పండ్రెండేండ్లు ఒంటి కాలిపై నిలిచి తిండి తీర్థములను మాని పవనాంధసుడై తనదృష్టిని సవితృ మండలాంతర్వర్తి యగు సూర్యనారాయణునిపై నిలిపి ఘోరతప మాచరించెను. మత్స్యేంద్రుని

శరీరమునందలి రక్తమాంసములు క్షీణించినవి. ఎముకలతో బాటు చర్మము మిగిలినది. అయినను తపము నిర్విఘ్నముగా సాగుచునే యుండినది.

ఇట్లుండనొక దినము దత్తాత్రేయుడు శివుని సందర్శింప బదరి కావనమునకేగి "దేవాది దేవా! మహాదేవా! స్మరహరా ! నాగభూషనా కైలాసనాధా ! వృషభవాహనా! త్రిపురాంతకా ! శూలపాణీ ! త్రిలోచనా ! పంచవక్త్రా ! భస్మోద్ధూళిత సర్వాంగా ! పార్వతీ మనోహరా !! జయజయ యని స్తుతించెను. శివుడాస్తోత్రమునకు సంతసించి దత్తాత్రేయుని మ్రోల నిలిచెను. పరస్పరానురాగమున నొకరి నొకరు కౌగిలించు కొనిరి. ఉభయ కుశలోపరి సంప్రతింపులు చిరునగవులతో ముగిసినవి. దత్తభగవానుడు "మహేశ్వరా! మీ బదరికావనమందలి వనములను జూడ నాకు వేడుక బొడమిన దన శివుడు సంతసించి దత్తాత్రేయుని వెంట నిడుకొని వనవిహారమునకై బయలుదేరెను. వారు మత్స్యేంద్రుడు తపమొనరించు చున్న తావును జేరిరి. ఆ తాపసోత్తముని శరీరము పూర్తిగ శుష్కించి శల్యావశిష్టముగ నుండినది. తలవెంట్రుకలన్నియు జడలు గట్టినవి. గోళ్ళు వంకరలు తిరిగినవి. అయినను నోటి నుండి మంత్రోచ్ఛారణ జరుగు చుండినది. దత్తభగవానుడు శివునితో తపమొనరించుచున్న ఆ బాలుడెవరని యడుగ శివుడు తనకు తెలియదని తెలిపి అత్రినందనునితో నాతపస్వి విషయమేమో కనుగొని రమ్మనెను.

దత్తాత్రేయుడా తపోధనుని కట్టెదుట నిలిచి "వత్సా! నీ నియమ నిష్ఠలకు తపశ్చర్యలకు నేను సంతసించితినని" తెలిపెను. అందులకా తాపసోత్తముడు, "మహాత్మా! తామెవరు? ద్వాదశాబ్దములుగ నేనిందు తపమాచరించు చుండ మానవుల పొలకువయే యీ పరిసరములయందు లేకున్నది. నన్ననుగ్రహించి సముద్ధరింప మానవ రూపముననేతెంచిన దివ్యపురుషుడవు నీవని నా అంతరాత్మ ప్రబోధ మొనరించుచున్నది. నమాంసిభూయాంసి" యని చేతులు జోడించి నమస్కరించెను. అందులకు దత్తభగవానుడు "తపోధనా! అనసూయానంద వర్ధనుడగు దత్తదేవుడను నేనని తెలిపెను. మత్స్యేంద్రుడు తన ఉపాస్యదైవము సాక్షాత్కరించినంతనే బ్రహ్మానంద భరితుడై నిలువెల్ల పులకింప పాదములపై వ్రాలి ఆనంద బాష్పములచే దత్త భగవానుని చరణారాజీవముల నభిషేకించెను లేచి నిలిచి మోము వాచిన యట్లు దత్త ప్రభువు వంక ఎగదిగ జూచుచు భక్తి







పారవశ్యమున శ్రీ గురుదత్తా – జయగురుదత్తా–దత్త గురుదేవ; గురుదేవదత్త యనుచు తెలియని ఆనందమున మైమరచి దత్తదేవునిట్లు ప్రశ్నించెను. ప్రభూ! నీవు త్రిమూర్తి స్వరూపుడవు. గురుపరబ్రహ్మామూర్తివి. నావంటి దీనులను బ్రోచి సంరక్షించుటయే నీపనిగ ఇలపై సంచరించువాడవు. భక్తులు నిన్ను స్మరించినంతనే సంతసము నొందెదవని స్మరణమాత్ర సంతుష్టుడవని నిన్నుకొని యాడుదురు. ఆపదవేళల నిన్నుపిలుచుటయే తడవుగ నీవు వారిచెంత జేరి ఇడుముల బాపువాడవగుటచే స్మర్తృగామి యని మీదు మిక్కిలి నిన్ను కొనియాడుదురు. అయినను నిన్ను పండ్రెండు ఏళ్ళు స్మరించుచునే యున్నాను నన్ను ఉపేక్షించుటకు కారణమేమని యడిగెను.

దత్తభగవానుడు పరమాదరమున భక్తుని శిరమును నిమిరెను. ఆ తపోధనుని శరీరము రక్తమాంసములచే పరిపుష్టి నొందినది. "వత్సా! మత్స్యేంద్రా, నీవు నన్నడిగినది సముచితముగనేయున్నది. అయినను ఆపద్ధర్మముగ నీవు నన్ను స్మరించిన వాడవుకాదు గదా ! భూప్రజల ఆపదల నన్నింటిని తుంగలో ద్రొక్కి సుఖములను వారికి భద్రముగ మూటగట్టి యిచ్చు మహిమను సముపార్జింప నన్ను స్మరించిన వాడవు నీవౌదువు కదా ! అయినను దేనికైనను కర్మపరి పక్వమై కాలము కలిసి రావలయును కదా" యని మత్స్యేంద్రుని శిరముపై దత్తభగవానుడు తన వరద హస్తము నుంచి కుడిచెవిలో మంత్రోపదేశము నొసగెను. మత్స్యేంద్రుని హృదయమున జ్ఞానభాస్కరుడు వేయి కిరణములచే ప్రకాశింప దొడగెను. అపుడు భక్తుని జ్ఞానపరిపక్వస్థితిని తెలియగోరి అత్రినందనుడు "వత్సా! భగవంతుడు నీ కెచట గన్పట్టుచున్నాడని ప్రశ్నించెను. అందులకు మత్స్యేంద్రుడు "దేవ దేవోత్తమా ! సద్గురుసార్వభౌమా ! సూది మోపుటకే సందులేనట్లు భగవంతుడీ అనంత విశాలవిశ్వము నందతటను నిండి నిబిడీకృతముగ వ్యాపించి యున్నాడు. నింగియందును నీటియందును నిప్పు నందును గిరుల యందును తరువుల యందును తుదకు ఎండు కట్టెల యందును నాక భగవంతుడు కన్నులకు గట్టినట్లు కాన్పించు చున్నాడని" సమాధానము నొసగెను.

దత్తాత్రేయుడు మెచ్చి తలలూపి సంతసమున మత్స్యేంద్రుని శివుని సన్నిధానమునకు గొనిపోయెను. ఆ తపోధనుని గాంచినంతనే కవి నారాయణుడే రూపమున నవతరించి యున్నాడని శివుడత్యాదరమున కౌగిట జేర్చుకొని దత్తదేవునితో నిట్లనెను.

"అత్రి నందనా ! ఈ నీశిష్యుని యోగ విద్యయందు నిష్ణాతుని గావించి సిద్ధులనన్నింటిని ప్రసాదింపుము. అద్దాన నీతడు ప్రపంచమున కెనలేని మేలుగూర్చు" ననెను. శివుని యాదేశము దత్తభగవానునకు ప్రీతిని గొలిపినది. అత్రినందనుడు మత్స్యేంద్రునకు సప్తకోటి మహామంత్రములను, సమస్త సిద్ధులను ఉపదేశము నొసగి ధారాదత్తముగావించి శాపానుగ్రహ సామర్థ్యమును కల్పించెను. ప్రయోగ ఉపసంహార విధానముగ నాగాస్త్రము, వాతాస్త్రము, ఆగ్నేయాస్త్రము, ఆగ్నేయాస్త్రమాదిగ సమస్తాస్త్ర ములను ప్రసాదించి అస్త్రవిద్యయందు అసమాన పండితుని జేసెను. నాథ సంప్రాదాయ మునకు తగినరీతిగ చెవులకు బెజ్జములతోపాటు చేతి యందొక దండము, మరియొక చేతియందు ఏక తారను చేతికొసగి చంకకొక జోలెను తగిలించి నిండుమనమున నాశీర్వదించి దత్తదేవుడు తన దారిని తాబోయెను.

మత్స్యేంద్రుడు శివునకు ప్రణామములు చెల్లించి శివాజ్ఞను శిర సావహించి తీర్థక్షేత్రములను సందర్శించుచు నాసికాక్షేత్రమునకు సమీపమున నున్న సప్తశృంగ క్షేత్రమును చేరెను. సప్తశృంగియందు క్షేత్రాధిదేవతను భక్తిభావము పెల్లుబుక స్తోత్రపాఠములచే మెప్పించి లోకోపకారార్థము 'శాబరి' యను మంత్రశాస్త్రమును రచించెను. ముక్కోటిదేవతలను వశీకర ణము గావించుకొని వారి వలన వరములను పొందుటకై సప్తాహదీక్షగ సప్తశృంగి దేవతను శక్తిబీజాక్షర సంపుటీ కరణముగ మంత్రానుష్ఠాన మొనరించెను. ఆ తపము సప్తశృంగి దేవతకు ప్రీతినొసగి వరమేమి కావలయునని యాతని నడిగినది.

అందులకు మత్స్యేంద్రుడు "జననీ! లోకమాతా! నేను లోకోపకా రార్థము శాబరియను మంత్రశాస్త్రమును రచించియున్నాను. దేవతలందరు నన్నునుగ్రహింప గోరుదును. నాకిందులకేదైన మార్గమును చూపుమని ప్రార్థించెను. అందులకు చండికాపరమేశ్వరి "వత్సా! నీకోరిక అవశ్యము నీడేరగలదు" అని అభయ మొసగి యాతని చేతిని పట్టుకొని మార్తాండ పర్వతమునకు గొనిపోయెను. అచటనున్న నాగాశ్వత్థవృక్షము కడచేర్చినది. ఆ దేవాతావృక్షము కానవచ్చియు కానరాకుండును. బీజాక్షరముల సంపుటీకరణముతో మంత్రానుష్ఠాన మొనరించిన వారలకు ఆ వృక్షముతో బాటు తరుశాఖలపైనున్న కాళీమాత, వీరభద్రుడు, సూర్యుడు, అష్టభైరవులు,





లక్ష్మీమున్నగు దేవతలు శంఖిణి, యక్షిణి మున్నగు వారెల్లరగుపడుదురు. సప్తశృంగి దేవత నాగాశ్వత్థవృక్షమహిమను మత్స్యేంద్రునితో వివరించి "వత్సా ! నీవీవృక్షశాఖలపై నున్న దేవతలను చూడనెంచిన నేను తెలుపు నట్లు చేయుము.

బ్రహ్మగిరియను పేరున నొక పర్వతము కలదు. ఆ గిరిని అంజన పర్వతమని కూడ వ్యవహరించుదురు. అంజన పర్వతము నుండి దక్షిణ దెసగ నొక నది ప్రవహించును. ఆ నదీ తీరమున కాళీమాత ఆలయ మున్నది. కాళికాదేవిని సందర్శించి నమస్కరించి మరల నది వెంట దక్షిణపు దెసగనే పయనింపుము. నదీ తీరమున కొన్ని కుంటలు (చిన్న చెఱువులు) నీ కగుపడును. అపుడు నీవొక ఎండిపోయిన చెట్టు వేరు నొకదానిని చేతబట్టుకొని ఒక్కొక్క కుంటయందు ముంచుము. ఒక కుంట యందా ఎండిపోయిన చెట్టువేరును ముంచినంతనే నవనవలాడుచు చిగురించును. అప్పుడు నీవా కుంటయందు స్నానమాచరించి నీరు ద్రావుము. నీరు త్రావి నంతనే నీవు సొమ్మసిల్లిపడిపోవుదువు. అయినను అధైర్యము నొందక సూర్యభగవానుని ధ్యానించి సూర్యనారాయణుని నామములను స్మరింపుము. సూర్యభగవానుడు సంతసించి నీకు స్వస్థత గూర్చును. అంతియేకాదు, ఆయన తన వరద హస్తము నీశిరముజేర్చి నిన్ననుగ్రహించును. నీవు కుంట యందలి నీటిని కమండలువు నందు గైకొని సూర్యుని నామములను పఠించుచు తిరిగి నాగాశ్వత్థ వృక్షము కడజేరి వృక్షమూలమును కమండలోదకముచే తడుపుము. తత్ఫలితముగ నీశ్రమ ఫలించి నాగాశ్వత్థ వృక్షముపై నున్న దేవతలు నీ కగుపడి నీవు కోరిన వరముల నొసగుదురు" అని సెలవొసంగెను.

చండికాపరమేశ్వరి తెలిపిన విధముగ తుచ తప్పకుండా మత్స్యేంద్రుడు ఆదిత్య కుండము నుండి గొనివచ్చిన నీటితో నాగాశ్వత్థ మూలమును తడిపినంతనే ఆదిత్యుడు మత్స్యేంద్రుని కట్టెదుట నిలిచి "వత్సా ! నీ మనోభీప్సిత మీడేరగలదు. నీ మాటలన్నియు మహిమోపేతమగు మంత్రముల వలె ప్రభావమును చూపగల శక్తిని నీకు నేనొసగుచున్నానని" అనుగ్రహించి తన స్వస్థానమును చేరెను.

మత్స్యేంద్రుడచట ఏడునెలలు తపమొనరించి నాగాశ్వత్థవృక్షము నాశ్రయించిన దేవతలను వశీకరణము గావించుకొనెను. ఆ దేవతల

అనుగ్రహ విశేషమున శాబరీ మంత్రశాస్త్రమును రచించి యటచ నుండి పయనమై వెడలుచు బంగాళా దేశమును చేరెను. ఆ దేశమున నున్న చంద్రగిరియను పట్టణమును వశిష్ఠగోత్ర సంజనితుడగు విప్రుడు కలడు. ఆయన పేరు సర్వదయాళుడు. సార్థకనామదేయుడు. ఆయన భార్య సరస్వతి, రూపలావణ్య సద్గుణవతి. సంతానాపేక్షచే పెక్కునోములు నోచినది. అనేక వ్రతములాచరించినది. పుట్టలకు, చెట్లకు వారు పోసి ప్రదక్షిణములు సలిపినను ఫలితము శూన్యమైనది.

భవతీ భిక్షాందేహియని భిక్షను యాచించునట్లు "అలఖ్‌నిరంజన్" యని మత్స్యేంద్రుడా సర్వదయాళుని ఇంటి ముందునిలిచెను. సరస్వతి ఆ పలుకులను విని భిక్షకైవచ్చిన సాధువును ఇంటిలోనికి గొనిపోయి సగౌరవముగ సత్కరించినది. సంతాన హీనురాలనని కంట తడిపెట్టినది. ఆశీర్వదించి సంతాన ఫలితమును గూర్చుమని ప్రార్థించినది. మత్స్యేంద్రుడు సరస్వతిపై జాలినొంది తనజోలె నుండి యొకించుక భస్మము నొసగుచు "అమ్మా ! ఈ భస్మప్రభావమమోఘము. సూర్య భగవానుని తేజము నీ భస్మము నందుండునట్లు అభిమంత్రించి నీ కొసగుచున్నాను. నీవీ పవిత్ర భస్మమును నోటి యందిడుకొనుము. హరినారాయణుడే నీకడుపున నుదయించి జగదోద్ధారకుడై వెలయగలడు. పండ్రెండేండ్లు గడిచిన పిమ్మట నేను మరలివచ్చి నీ కుమారుని నాయంత వానిని చేయుదును" అని ఆమె యొసగిన భిక్షను స్వీకరించి వెడలిపోయెను.

సరస్వతి ఆ పవిత్ర భస్మమును పైటకొంగున భద్రపరచి పట్టరాని సంతసమున ఆ యింటి ఈ యింటి అమ్మలక్కలతో జరిగిన విషయమును పూస గ్రుచ్చినట్లు తెలిపినది. అదృష్టము కలిసి రానపుడు చేతి కందిన దివ్యఫలము నోటికందక నేల పాలగును కదా! గ్రహగతుల ప్రభావమంత బలీయమైనది. ఇరుగు పొరుగు అమ్మలు ఓసీ ! పిచ్చిదానా ! నీవెంత అమాయకురాలివి, భస్మము నొసగిన సాధువు హరినారాయణునినే నీకడుపున ఫలింపజేయు శక్తిమంతుడేయైన కడుపునింపు కొనుటకు నీ గడప ద్రొక్కి అన్నమోరామచంద్రా! యని యాచింపనేల? ఆ భస్మమును చెంతనుంచుకొన్నవారలు రాత్రివేళల కుక్కలుగ మారి ఆ దొంగ సాధువు లున్న విజన ప్రదేశము చేరినంతనే క్షుద్రమంత్రములచే కుక్కలుగ మారిన వారిని స్త్రీలను చేసి వారితో కూడి సుఖములనుభవించి తమవెంట నిడుకొని పోవుదురు. అయ్యయ్యో! ఎంతపని జరిగినది. నీ అదృష్టము మంచి దగుటచే







నలుగురి చెవిని బడవైచితివని సరస్వతి మనస్సును పాడొనరించిరి. సరస్వతి కాలుసేతులు గడగడలాడి తన కొంగున నున్న భస్మమును తమ ఇంటనున్న ఆవు పేడను వేయు దిబ్బయందు వేసినది. భాగ్యవంతుని భంగపరచువారు గర్భదరిద్రుని బాగుపరచువారెవరు?

మత్స్యేంద్రుడు చంద్రగిరి నుండి దేశ పర్యటన సలుపుచు జగన్నాథ మును సందర్శించి యట నుండి సముద్రతీరమున నున్న రామేశ్వరమును చేరెను. మత్స్యేం ద్రుడు సముద్రస్నానమునకై వెడల నచట హనుమంతుడు బక్కజిక్కిన శతవృద్ధుని వలెనుండి ఒక వంక వర్షము గురియుచుండ మట్టితో మిద్దెను నిర్మించు ప్రయత్నమున నుండెను. కోతివలెనున్న యా ముదుసలిని మత్స్యేంద్రుడు జూచి "ఓయీ! కోతిమొగమా! పై నుండి వర్షము కురియుచుండ మిద్దె గట్టుటయేమి? ఇంటిలో దొంగలుపడి దోచు కొనుచుండ దీపమును వెలిగించుటకు చమురు కోసము గాండ్లవాని యింటి కేగుట కొంప తగులబడుచుండ నీటికై బావిని త్రవ్వుటవలె నీ పనియున్నదనెను అందులకా వృద్ధుడు "ఓయీ! నీవెవడవు? మహామేధావి వలె నన్నధిక్షేపించుచున్నావన, "నాపేరు మత్స్యేంద్రుడు. మాది నాథ సంప్రదాయమన - నీ గురువెవరని ప్రశ్నింప - శ్రీదత్త భగవానుడని సమాధాన మొసగెను.

అందులకు ముసలివానివలె నున్న హనుమంతుడు "ఓహో, అటులనా? నేను కొంతకాలము హనుమంతుని సేవించినవాడను. హనుమంతుడే యోగీశ్వరు డనుట ప్రసిద్ధముగ నున్నది. ఆ హనుమంతుని అనుగ్రహమున కొద్దియో గొప్పయో యోగవిద్యను నేర్చియున్నాను నాయోగ విద్యా ప్రభావము నిపుడు ప్రదర్శించుదును. దానిని ఛేదించగలిగిన మంచిది. లేకున్న యోగియను బిరుదము నకు నీవు తగిన వాడవు కాజాలవని మత్స్యేంద్రునితో ముసలిరూపమున నున్న హనుమంతుడనెను.

"అయ్యా! మాటలతో పనియేమున్నది? నీ యోగ విద్యాపాటవమును ప్రదర్శింపుము. మా గురుదేవుని అనుగ్రహమున నీ విద్యను నేను ప్రతిఘటించగలనని మత్స్యేంద్రుడు తెలిపి-పూర్వమొక సమయమున చెట్టునీడన శ్రీరాముడు శయనించి యుండ హనుమంతుడా రామప్రభువును పరీక్షింప నెంచి గొప్పగొప్ప పర్వతములను రాములవారిపై బడవేయు చుండెను. రాములవారు పవళించియే విల్లంబులు చేదాల్చి హనుమంతుడు

వేయు పర్వతముల నవలీలగ నెగుర గొట్టుచుండెను. ఆ శ్రీరామ చంద్రుని వలె నీ యోగమహిమను సహితము నేను నా గురు దేవులగు దత్త భగవానుని దయవలన ప్రతిఘటించగలవాడనని మత్స్యేంద్రుడు ముదుసలి వానిగనున్న హనుమంతునితో నిర్లక్ష్యముగ పలికెను.

హనుమంతుడు రెచ్చిన కోపమున మహాపర్వతముల నేడింటి నొకపరి మత్స్యేంద్రునిపై వదలెను – వాత ప్రేరక మంత్రశక్తిచే ఆ ఏడు పర్వతములు దూది పింజలవలె దూరముగ బడునట్లు గావించెను. ఇట్లురువురి మధ్య ఘర్షణ చాలసేపు జరిగినది. హనుమంతునకు సహనము నశించి మహాపర్వతములను రెండింటిని రెండుచేతుల మత్స్యేంద్రునిపై బడవేయు ప్రయత్నమున నుండ వాతాకర్షణ మంత్ర ప్రయోగమున ఆ పర్వతములు రెండును హనుమంతుని చేతుల యందే నిలిచి పోవునట్లు ప్రత్యర్థిగావించెను. హనుమంతుని చేతులాడకుండినవి. వాయు సంచార ముడిగినది. చేతులెట్లో పాదములట్లు కదల్పజాలకుండెను. అయ్యా, నన్ను రక్షింపుమని కేకలిడెను. హనుమంతుడు కేకలిడినంతనే వాతాకర్షణ మంత్రము నుపసంహారము గావింప యధాప్రకారముగ దేహము నందు వాయు ప్రసరణము కలిగి నంతనే హనుమంతుడా రెండు పర్వతములను దూరముగ బడవైచెను.

హనుమంతుడు మత్స్యేంద్రుని సమీపించి "అయ్యా! నీ వింతటి యోగమహిమ లను–దివ్యశక్తుల నెట్లు సాధించితివి? ఏమీ నీ ప్రతిభయని ప్రశంసింప – నిది యంతయు నా గురుదేవులగు దత్తభగవానుని దివ్యానుగ్రహమేకాని నా ప్రతిభ యేమున్నదని సవినయముగ తెలిపెను. వాయుదేవుడా సమయమున వారిదరిజేరెను. మత్స్యేంద్రుడు వాయుదేవునకు హనుమంతునకు సభక్తికముగ నమస్కరించి మీ యిరువురి కృపనాపై ఎల్లవేళల నుండవలయునని ప్రార్థించెను. నీవు ఏకార్యము తలపెట్టినను మా సహాయము నీకు లభింపగలదని నాశీర్వదించి వరముల నొసగిరి.

మత్స్యేంద్రుడు హనుమంతునితో "అంజనానందనా, నాగాశ్వత్థమ వద్ద నేను తపమొనరించిన వేళల మీరును దేవతలతోబాటు నన్ననుగ్రహించి యున్నారు కదా! అటులయ్యును యీ వివాదమునకు హేతువేమని" సవినయముగ నడిగెను. అందులకు మారుతాత్మజుడు "మత్స్యేంద్రా! నీవు రామేశ్వర యాత్రకై వచ్చుట నేను గ్రహించితిని నీవు మంత్రపురశ్చరణ ఫలితముగ సాధించిన దేమియో పరీక్షింప నెంచి యీ వివాదమును





కల్పించితిని. భేష్!! లెస్స!! యని ప్రశంసించి హనుమంతుడు మరల మత్స్యేంద్రునితో నిట్లనెను.

"మత్స్యేంద్రా! నీవలన నాకు మహోపకారమొకటి కావలసియున్నది అది నన్ను గూర్చిన నీవు నెరవేర్చవలయును. అదెద్దియన – రావణుడు సీతాదేవి నపహరించి లంకయందు అశోకవనమున నుంచినాడు. నేను శ్రీరాముని పంపున సముద్రమును దాటి సీతను జూచి ఆమె క్షేమో దంతమునా నా ప్రభువునకు విన్నవిం చితిని. సుగ్రీవాది వానరులనెల్లరను కూడ దీసికొని దశరథనందనుడు దశకంఠుని పరిమార్చి విభీషణుని లంకకు సార్వభౌమునిగావించి అయోధ్యకు మరలివచ్చి పట్టాభిషిక్తుడగుట తెలియని వాడెవ్వడును లేడు. పట్టాభిషేకసమయమున సీతాదేవికి నాపై దయ గలిగినది. రామదూతగ నాకైంకర్యమును నేను నిర్వహించినది ఆమె మహోపకారముగ భావించినది. నాకేదైన ప్రసాదింపదలచినది. నాకు కావలసిన దొక్కటే యొకటి అది శ్రీరామానుగ్రహము. ఆ చల్లని తల్లి ఆజన్మబ్రహ్మచారినగు నేను గృహస్థాశ్రమమును స్వీకరించి దాంపత్య సౌఖ్యముల ననుభవించుట లెస్సగ నుండునని మది దలచినది. ఒక దినమున సీతామాత నన్ను చెంతకు పిలిచి యిట్లు తెలిపినది. హనుమా! నీకన్న నాకు ఆప్తులెవ్వరునులేరు. నాకొక కోరిక మిగిలియున్నది. నిరాకరింపక నిరాదరణ సేయక నాకోరిక నీడేర్చదనని ఒట్టు పెట్టుకొనిన నీ కావిషయమును తెలుపగలననినది. తల్లికోరిక నీడేర్చుట తనయుని వంతుకదా ! ఇక జగన్మాత కోరిక నీడేర్చుటకన్న నాకు కావలసినదేమున్నదని మారుమాటలాడక నేను ప్రమాణము చేసితిని. అపుడా మహామాత "హనుమా ! ఒంటరి జీవితమును గడుపుచు కాయగసురులచే కడుపు నింపుకొనుచు చెట్టుకొమ్మలపై నీవు బ్రహ్మచారిగ నుండుట నాకెందులకో తీరని బాధగనున్నది. నీవు సత్వరమే గృహస్థాశ్రమమును స్వీకరించి సుఖముల ననుభవించుట నా చిరకాల వాంఛిత మనినది. కాదుకూడదనక నీ వాగ్దానమును చెల్లింపుమనినది. నేను నిరుత్తరుడనైతిని. నామొగము వెలవెల బారినది. నేను చేయగలదేమున్నది. త్రిలోకైక ప్రపూజ్యుడగు శ్రీరాముని పాదపద్మముల చెంత జేరితిని. చింతాక్రాంతుడనైయున్న నన్ను శ్రీరామప్రభువుచూచి :

హనుమా! నీ ముఖమేలనో నేడు కళావిహీనముగ నున్నది. కారణ మేమి యని యడిగెను. అందులకు నేను మహాప్రభో! ఏమని తెలుప

గలవాడనని నా సందిగ్ధావస్థను అనుపూర్వికముగ వెల్లడించితిని. అందులకు శ్రీరామచంద్రుడు నాకిట్లు కర్తవ్యమును బోధించెను. "హనుమా! మించి పోయిన దావంతయునులేదు. నీవు చింతిల్ల వలసిన పనియే లేదు. కాలచక్రము తిరుగుచునే యుండును. కృతత్రేతా ద్వాపర కలియుగములు నాలుగు గడిచిన ఒక మహాయుగమగును. వేయు మహాయుగములు గడిచిన బ్రహ్మదేవునకొక దినము కాగలదు. ప్రతి త్రేతాయుగము నందు సీతారాములు, హనుమంతుడు, రావణ కుంభకర్ణులు పుట్టుచునే యుందురు. ఇప్పటికిట్లు ఎన్ని మహాయుగములు గడిచినవోకదా? ప్రారబ్ధము మూట గట్టుకొనకున్న జన్మమెత్తుట కెవ్వనికి అవకాశములేదు. ప్రారబ్ధమను భవింపక తీరునదికాదు. అనుభవించిన కాని ప్రారబ్ధము నశింపజాలదు. ఊర్ధ్వరేతస్కుడవు-అస్ఖలిత బ్రహ్మచారివగు నీవు స్త్రీరాజ్యమున ప్రవేశింపుము. ఆ స్త్రీ రాజ్యము నందు మొగవారు ప్రవేశించిన మరణము నొందగలరు. ఆ స్త్రీ రాజ్యమున నీవు ప్రవేశించి చెట్లపై కూర్చొని కోతులవలె "బుహో బుహో" యని అరచుము. స్త్రీ పురుషుల మేలుకలయిక లేకున్నను బుహో బుహో యను నీ పలుకులను విన్నంతనే మహిళా సామ్రాజ్యము నందలి స్త్రీలెల్లరు గర్భమునుదాల్చి సంతానవతులగుదురు. నీ బ్రహ్మచర్యనిష్ఠకు ఏమాత్రము భంగము వాటిల్లకుండును. ఈవిధానము ఉభయ తారకముగ నుండగలదు" అని శ్రీరామచంద్రుడు నాకు కర్తవ్యమును బోధించి నన్నూరడించి దుఃఖోపశమనము గావించినాడు. సీతాదేవి తెలిపినట్లు నన్నాచరించు మనినాడు.

రామాజ్ఞ మీరరానిదికదా? నా స్వామిపై భారము వైచినేను మహిళా సామ్రాజ్యమున ప్రవేశించితిని. ఆ రాజ్యమునేలు రాణి మేనక. నా నోట వెలువడిన బుహోయను రెండక్షరములు వినిన ఫలితముగ మేనక చూలుదాల్చినది. పంచేంద్రియ పార్వణ మొనరించు సురత సౌఖ్యము ననుభవిపంకయే గర్భవతి యయ్యును మేనక తృప్తినొందక దాంపత్య సుఖముల ననుభవింపదలచి ఆమె యొక యజ్ఞము సలిపినది. తన శరీరమాంసము (హనుమంతుని) నన్ను గూర్చి యాగాగ్ని యందు వ్రేల్చినది. మేనక నియమనిష్ఠలకు మెచ్చి ఆమె ఎదుట నిజరూపమున దర్శన మొసగితిని. ఆమె కోరక కోరక తన తియ్యని కోరిక నీడేర్చుమని వరముగ నన్నుకోరినది.







తల్లి గర్భమున నుండి వెలువడినది మొదలు నాటికి నేటికి రేపటికిని నేను బ్రహ్మచర్యవ్రత నిష్ఠుడనగుటచే ఆమె కోరిక నీడేర్పజాలక, శరీర రక్తమాంసములను హోమగుండమున వ్రేల్చిన దగుటచే ఆమెను సంతృప్తి నొందింపనేనిట్లు తెలిపితిని "మహారాణీ! నీకోరిక మన్నింప దగినదేయైనను నా వలన నీకు సుఖము లభింప జాలదు. అయినను నీ కోరిక నీడేర్చుటకై ఉభయ తారకముగ నొక విషయము తెలిపెదను వినుము. అన్ని విధముల నాతో సమానుడగు వాడు మత్స్యేంద్రుడను మహానుభావుడు కలడు. ఆయన నవనారాయణులలో తొలుదొలుత నెన్నదగినవాడు. నేడవనిపై నవతరించి యున్నాడు. ఆయన నీ కన్నివిధముల తగినవాడని నా మాటగ విశ్వసింపుము. నీ వాంఛిత మీడేరగలదని మేనకను సమాధాన పరచి యున్నాము. కావున కొంత కాలము నీవా మేనకతో గూడి సుఖములను భవింపుమనెను.

మత్స్యేంద్రుడు హనుమంతునితో నిట్లనెను. "వాయునందనా! నీవు బ్రహ్మచారివి. గృహస్థాశ్రమమును స్వీకరించుటకు బ్రహ్మచారులకు విహితమై యున్నది. నేనొక సన్యాసిని. సన్యాసమును సన్యసించి స్త్రీలతో తగులాటము గావించుకొనుట సన్యాసులకు తగినది కాదు. అదిలోక విరుద్ధముగా నుండు. మీదు మిక్కిలి మాది నాథసంప్రాదాయము. నేను మీ మాటను త్రోసి పుచ్చజాలక మేనకతో సాంగత్యమును కల్పించుకొనిన మా సంప్రదాయము వారెల్లరు రహస్యముగనో బహిరంగముగనో స్త్రీలను చెంత జేర్చుకొని తుచ్ఛసుఖములపాలై తమ కర్తవ్యమును విస్మరించి భ్రష్టులగుదురు. ఇంద్రుడు చంద్రుడువంటి వారలు స్త్రీ సుఖముల నభిలషించి అపకీర్తి పాలయినారు కదా ! స్త్రీల కెడముగ నుండి వారిని గౌరవించుట లెస్స. స్త్రీ సాంగత్యమున మునీశ్వరుల చిరకాల తపము మున్నీటి పాలయినది. మనము వినియున్నాముకదా! ఆంజనేయా! మహాప్రభో" ఒక్కమాట. నీకొక ధర్మము, నాకొక ధర్మమున్నదా? ఇరువురము బ్రహ్మచారులమేకదా!

అనవిని హనుమంతుడు మత్స్యేంద్రా! నా మాటను సాంతముగ వినుము. కాలచక్రమునందు ఇప్పటికెన్నియో మహాయుగములు గడిచినవి. ఇకముందు నిట్లే జరుగగలవు. ఆయా యుగముల యందు నీవును నేనును రాముడు కృష్ణుడును వెలసి తమ విధులను నిర్వర్తించుచునే యున్నాము. ధర్మమనునది ఎల్లరకును అవశ్యాచరనీయమెట్టులో ప్రారబ్ధము సహితము

అనుభవింపక తీరునదికాదు. విధి నిర్ణయమునకు మన మెల్లరము విధేయులము – విధి నిర్వహణమున దోష మాపాదించ జాలదుకదా!

నీవు ఉపరిచరవసువను మహనీయుని వీర్యమున పుట్టినవాడవు. నీకును మేనకకును మీననాధుడను మహానుభావుడదయించుట విధి నిర్ణయము. నాథ సంప్రాదాయము మీననాధుని వలన మూడుపువ్వులు ఆరు కాయలుగ ఇలపై వర్ధిల్లగలదు. ఇందులకు నీవును మేనకయు నిమిత్తమాత్రులే యగుదురు సుమా! భవితవ్యమెట్లో అట్లు కాగలదు.

హనుమంతుని పలుకులు మత్స్యేంద్రునకు ఆచరణ యోగ్యమని పించినది– హనుమంతుడు స్నేహభావమును ప్రకటించి అదృశ్యు డాయెను. మత్స్యేంద్రుడు రామేశ్వరము నుండి బయలుదేరి దేశపర్యటనము సలుపుచు హింగలాయను దివ్య క్షేత్రమును చేరెను. క్షేత్రాధి దేవత జ్వాలా ముఖి, మహాశక్తి స్వరూపిణి. శంఖిని, ఢంఖిని మున్నగు శక్తులు అష్టభైరవు లామె ద్వారపాలకులు. ఆలయమునకు ఒకవైపు మహా సముద్రము కలదు. మరియొక వైపు కాకులు దూరని కారడవులున్నవి. ముండ్ల పొదలతో క్రూరమృగములతో విషసర్పములతో నా ప్రదేశము నరసంచారమునకు వీలుగాకుండును. సూర్యకిరణములా సాంద్రారణ్యమున ప్రవేశించుటకు ప్రసరించు టకు వీలు లేకుండును. మత్స్యేంద్రుడా జ్వాలామణి సందర్శనము నకై వెడలెను.

దేవి ఆలయము సింహద్వారము ఏబది గజములు, ఎత్తుగ నుండును. రెండువందల గజములపొడవు వెడల్పుతో నున్నది. మహోన్నత ప్రాకార మున్నది. మత్స్యేంద్రుడు ద్వారము కడజేరినంతనే నాగాశ్వత్థము వద్ద తపమొనరించి తమవలన వరములను పొందిన వానిగ అష్టభైరవులు గుర్తెఱిగిరి, సన్యాసి వేషమున నున్న మత్స్యేంద్రుని గౌరవించి "స్వామీ! తామెవరు? ఎచట నుండి వచ్చితిరి – ఎచటి కేగుచున్నారని యడిగిరి.

అందులకా యతిపుంగవుడు తీర్థయాత్రా సందర్భమున జ్వాలాముఖీ దేవి సందర్శనార్థమై వచ్చిన వాడనని తెలిపెను. అందులకు ద్వారపాలకులు "స్వామీ! ఇచట నొక నియమముకలదు. దేవిదర్శనార్థమై వచ్చినవారు తమపాపపుణ్యములను ముందుగ మాకు వివరించవలయును. యోగ్యులగు యోగులను మేములోన ప్రవేశ పెట్టుదుము. మా అనుమతిలేనిది ఎంత వారికైనను అమ్మవారి సందర్శనము లభింప జాలదు. ఒకవేళమాతో



నబద్ధము లాడిలోనికేగిన తలుపులు తమంతతామే మూసికొని దేవి దర్శనమున కవరోధము కల్పించును. కావున నీ పాపపుణ్యములను ముందుగ మాకు వివరింపు"మనిరి.

అందులకు మత్స్యేంద్రుడు "ద్వారపాలకులారా! అహంకారపూరితులై నేను కర్తనని కార్యములు సలుపు వారలకు పాపపుణ్యముల ప్రసక్తి యున్నది. ఏ గొడవయునులేక ఏకనిరంజన్ అని సంచరించుమాకు పాపపుణ్యము లంటజాలవు. ఆకాశవీధిలో సూర్యసంచార మెట్లులనో భూమిపై మేమట్లు తిరుగాడు చుందుము. సూర్యుడు కర్మసాక్షియే కాని కర్మలతో సంబంధము లేనివాడు. మేమును నంతియే. లోకము పోకడనొక కంటచూచువారలమే. ఆత్మను మరచి దేహమేనేనని అజ్ఞాని చేయుపనులకు పాపపుణ్య విచక్షణ యున్నది. సర్వం ఖల్విదం బ్రహ్మ నేహనా నాస్తికించన – సర్వము బ్రహ్మ స్వరూపమే. బ్రహ్మము కాని దెద్దియును లేదను నిశ్చయ జ్ఞానమున దేహేంద్రియములతో నొక వేళ కర్మలాచరించినను బ్రహ్మవిదునకా పాప పుణ్యములంటజాల"వనెను.

అందులకా ద్వారపాలకులు "అయ్యా! నీమెట్ట వేదాంతమును మాకడ కట్టి పెట్టుము. కర్మఫలితముగ శరీరమును ధరించి సుఖదుఃఖములను భవించు దేహధారులకు నీవు తెలుపు సిద్ధాంతములు వర్తింపంజాలవు. అది యట్లుండనిమ్ము. నీకథ వివరించిలోనికేగెదవో వచ్చినదారి పట్టెదవో తేల్చుకొనుము. అధిక ప్రసంగము గావించిన శిక్షింపబడుదు"వనిరి.

అష్టభైరవులకు మత్స్యేంద్రునకు వాగ్వాదము మించి యుద్ధమునకు దారితీసినది. భైరవులు త్రిశూలములు – గండ్రగొడ్డండ్రు – ఖడ్గములు – అంకుశములు ధరించి యొక్కుమ్మడిగ మత్స్యేంద్రునిపై తలపడిరి – జయజయా గురుదేవదత్తయని మత్స్యేంద్రుడు జోలెలోని భస్మమును గ్రహించి తన నొసటదాల్చి, మిత్రావరుణులను అశ్వినీదేవతలను, గంధర్వులను, తననిదివరకు అనుగ్రహించిన వారలను నమస్కార పూర్వకముగ స్మరించి భస్మమును తనుచుట్టు చల్లుకొని అష్టభైరవులపై వెదజల్లెను.

మత్స్యేంద్రుని శరీరము వజ్రసన్నిభమైనది. భైరవులుపయోగించిన అస్త్ర శస్త్రములు సముద్రము నందు వాన కురిసినట్లయినది. ప్రపంచమున కేదో మహోపద్రవము వాటిల్లునట్లు పోరు పొసగినది. మత్స్యేంద్రుడు అణుమాత్రమైనను చలింపక వాతాస్త్ర పర్వతాస్త్ర, కామాస్త్ర–విరక్తాస్త్రములచే

భైరవులుపయోగించిన అస్త్రములను వమ్మొనరించెను. దత్తవరప్రసాది వాతాస్త్రమునుపయోగించి వాయు ప్రసరణము స్తంభింప భైరవులెనమండ్రుగురు చేష్టలుడిగిరి.

ఈ కోలాహలమును జ్వాలాముఖి చూచి చాముండాది శక్తులను లెక్కింప నలవిగాని యందరిని యుద్ధమున కుసిగొల్పినది. శక్తి పరివారమును జూచి మత్స్యేంద్రుడు జోలెయందలి విభూతిని గైకొని మోహనాస్త్రమును అభిమంత్రించి వారలపై చల్లినాడు. పోరాడవచ్చిన శక్తులకు పిచ్చి ఎత్తినట్లయినది. శరీరము పై ధ్యాసతొలగినది - కొందఱు పరుగులు తీసిరి. కొందఱు కహకహయినవ్విరి. కొందఱు బిచ్చుమెత్తుకొననేగిరి. కొందఱు తమనోటియందు ఈగలు ప్రవేశించినను జోపుకొన కుండ నుండిరి, మరి కొందఱు తమకట్టు వస్త్రముల నూడదీసి చెట్టుకొమ్మలకు గట్టిరి. ఆ చీరలను మత్స్యేంద్రుడు గాలిలో తేలియాడునట్లు చేసెను. దిగంబరులై తిరుగుచున్న శక్తుల ఎదుట తన మంత్రమహిమచే సిద్ధయోగి పురుష నెందరినో కల్పించి స్మరణాస్త్రముచే నాశక్తులకు తెలివిని కల్పించెను. పురుషుల ఎడ దిసమొలల నుండజాలక నాశక్తులు పరుగులు దీయుచు అష్టభైరవులు చేష్టలుడిగి యుండుటను జూచి యా విపత్కర పరిస్థితిని జ్వాలాముఖికి నివేదించిరి. వివస్త్రలై యున్న శక్తులను జూచి జ్వాలాముఖి నివ్వెరపోయినది. శక్తులెల్లరు జ్వాలాముఖిని సహితము నెందో దాగి ప్రాణములను కాపాడుకొనుమనిరి.

జ్వాలాముఖి జరిగిన దంతయును దివ్య దృష్టిచే జూచి ఉపరిచర వసువు వీర్యమున నుదయించిన కవినారాయణుని అవతారమైన మత్స్యేంద్రుడు తన సందర్శనార్థమై వచ్చినాడని గ్రహించినది. తన పరివారమునకు చీరలు రవికెలను ప్రసాదించినది. జ్వాలాముఖి స్వయముగ మత్స్యేంద్రుని సమీపించి పుత్రవాత్సల్య మును ప్రకటించి కౌగిటజేర్చి ఒడిలో కూర్చుండబెట్టుకొనినది-అష్టభైరవులకు స్వస్థతను గూర్చుమనినది-వారు తేరుకొనిరి. అష్టభైరవులు జ్వాలాముఖిని సందర్శించి “లోకమాతా! మునుపుమేము నాగాశ్వత్థమువద్ద మేమీయనకు దివ్యశక్తులను ప్రసాదించితిమి. ఆశక్తులనెంతవరకు స్వాధీన పరచుకొనినాడో యని నేడు మేము పరీక్షింప మా ఊహకు అతీతముగ నీయన సాధించియున్నాడని తెలిపిరి.

జ్వాలాముకి యాపలుకులను విని సంతసించి “వత్సా! నీ ప్రతాప





మును కొంతప్రదర్శించి నాకానందమును గూర్చుమని నది. మత్స్యేంద్రుడు జగదీశ్వరితో మేరేమి సేయుమనిన నేను నెరవేర్చగలనని సవినయముగ తెలిపెను. ఆమె తన ఎదుట నున్న గొప్ప పర్వతమును జూపి యాకాశమున కెగురునట్లొనరించి మరల యథాస్థానమున చేర్చుమనినది.

మత్స్యేంద్రుడు తనజోలెనుండి భస్మమును గొని వాయుమంత్రమును నభిమంత్రించి పర్వతముపై చల్లినంతనే పర్వతముభూమిపై నుండి పెకలించి నట్లు పైకెగసి ఆకాశమునందు గిరగిర తిరిగినది. జ్వాలాముకి యాపర్వతమును భూమిపై చేర్చ ప్రయత్నించినది. సాధ్యముకాలేదు. మత్స్యేంద్రుని భూమిపై నెప్పటివలె సంతసించి మత్స్యేంద్రునకు స్పర్శాస్త్రమును - విభక్తాస్త్రమును ప్రసాదించి మూడు దినములు తనవద్ద నుంచుకొనెను.

మత్స్యేంద్రుడు జ్వాలాముఖికడ సెలవు గైకొని తీర్థయాత్రలకేగుచు బారామల్హార్ యనుక్షేత్రమును గూర్చి వెడలుచు నొక గ్రామమునందలి దేవాలయమున శయనించెను. రెండు జాములు గడిచిన పిమ్మట మెలకువ జెంద కొఱివి దయ్యములు లెక్కింప నలవిగాయన్ని దివిటీలు పట్టుకొని ఆ ప్రాంతమున సంచరించుటను జూచినాడు. ఆ భూతములను సహితము తనవశము గావించుకొన నెంచెను. భూతములతో నేమి పని యున్నదని తలంచలేదు. తులసీదాసునకు శ్రీరామప్రభువు సందర్శనముకు దారిజూపినది భూతమేయని తలచినాడు. భూతములను స్వాధీనము గావించుకొనుట లెస్సయని యెంచెను.

పింగళాక్షేత్రమునందు జ్వాలాముఖి యొసగిన స్పరాస్త్రమును, భస్మమును చేగొని అభిమంత్రించి భూతముల నుద్దేశించి ఆకసమునందు వదలెను. భూతముల కధి నాయకుడైన భేతాళుడు కొలువుదీర కొఱవి దయ్యములు వెళ్లుట పరిపాటిట నుండినది. ఆనాడు ఎనిమిది కోట్ల భూతములు కొలువు కూటమునందు ప్రవేశించినవి. కాని యీ కొఱివి దయ్యములు విధిలేక వెళ్లజాల కుండినవి.

శరభతీరమునందలి యా కొఱివి దయ్యములు రాకుండుటకు కతమేమో తెలిసికొని రమ్మని భేతాళుడు ఐదుభూతములను పంపినాడు. ఆ ఐదు భూతము లెందెందో తిరిగి చివరకు బారామల్హార్ అను ప్రాంతమును చేరిన సిద్ధుని మంత్ర ప్రయోగమున కట్టుకదలజాలక పడియున్నవని తెలిసికొనినవి. భేతాళుని పంపున వచ్చిన యా యైదు భూతములు

పర్వతములు – గుహల యందు వెదకి చివరకు మత్స్యేంద్రుని దరిజేరిరి. ఆ సిద్ధపురుషుని నొసట నలంకరించిన సింధూరము బాల భానుని పగిది ప్రకాశించు చుండినది. శిరోజము లన్నియు జడలు కట్టినవి. చెవులకు కుండలములు ప్రకాశించుచున్నవి; గడ్డము, మీసములు, గోళ్లు, పెరిగి యున్నవి, కంకణములు చేతులు నలంకరించినవి. కన్నులు దీప్తి వంతముగ నున్నవి. ఆయన వేషభాసలను జూచి భూతములైదు "మహాత్మా! మాతోడి భూతములను భేతాళుని సందర్శనార్థమై మావెంట పిలుచుకొని రమ్మని మా ప్రభువు యానతి నొసగి యున్నాడు. కావున వానికి బంధవిమోచనమును కల్పింపుమని ప్రార్థించినవి. అపుడు మత్స్యేంద్రుడు నేను భూతగణములనన్నింటిని బంధించి యుండ మీరెట్లు స్వేచ్ఛగ తిరుగాడుచున్నారని పలికి ఆ భూతములకు విమోచనము కల్పించుటకు వీలు లేదని దిట్టముగ పలికెను.

అందులకా భూతములు "మహాశయా! నీ మేలు గోరి మేము తెలుపునది వినుము. భేతాళుడన సామాన్యుడాయేమి? సర్వశక్తి సమన్వితుడు. దేవదానవ గంధర్వుల నైనను పోరాటమున గెలుపొంద వచ్చును. కాని మా ప్రభువు నెదుట నిలుచుటకెవడు సాహసింపగలడు? ఆయనతో అకారణవైరము నేలకల్పించు కొనెదరు? అని తెలిపినవి – మత్స్యేంద్రుడు భూతములతో "మీ బెదరింపు మాటలిక కట్టిపెట్టి భేతాళుని కడకేగు" డనెను. ఐదు భూతములు జరిగిన వృత్తాంతము నంతయు పూసగ్రుచ్చినట్లు తమ ప్రభువునకు తెలిపిరి.

భేతాళుని కన్నులెఱ్ఱనైనవి. కోపమతిశయించినది. పంజాబు – ఘూర్జర – బంగాళ–కర్ణాటక మున్నగు దేశముల నుండి తనకడకు వచ్చిన భూతములను తమ నాయకులందఱిని మత్స్యేంద్రునితో యుద్ధమొనరింప తరలించెను. ఎనిమిదికోట్ల భూతములా మహనీయునితో పోరాడవచ్చినవి. మత్స్యేంద్రుడు అవగింజంతయైనను చలించక బెదరక జోలెయందలి విభూతిని తీసికొని తన ఇష్టదైవములను స్మరించి వారికెదురొడ్డి నిలిచెను. తనచుట్టు కొంత భస్మమును వజ్రాస్త్రమును పఠించి చల్లుకొనెను. తనపై భూతములు ప్రయోగించు శస్త్రాస్త్రములు సోకకుండ వజ్రాస్త్రముచే నభిమంత్రించిన భస్మమును తన శిరముపై నిడుకొనెను. కొంత భస్మమును తనకు పైభాగమున చల్లుకొనెను.







ఎనిమిదికోట్ల భూతములు మత్స్యేంద్రునిపై బాణ వర్షమును గురిపించిరి. అభిమంత్రిత భస్మ ప్రభావమున నాబాణము లాయనపై పడక గాలి కెగిరిపోవు చుండినవి. ఎనిమిదికోట్ల భూతములకు అధినాయకులు ఎనిమిది మంది మహావృక్షములను కుప్పలు తెప్పలుగ తమ ప్రత్యర్థిపై విసరిరి. ఆయన ఉపయోగించిన వజ్రాస్త్ర ప్రభావమున నవి ఇంటికి పై కప్పువలె నిలిచినవి. కోపావేశమున పిశాచములు ఎండు గడ్డి మోపుల నావృక్షములపైనిడి నిప్పంటించిరి. అగ్నిజ్వాలలు సప్తజిహ్వల విజృంభింప మత్స్యేంద్రుడు జలదాస్త్రములచే నా మంటలను చల్లార్చెను. స్పర్శాస్త్రముచే నాసిద్ధయోగి ఎనిమిది కోట్ల భూతములు భూమిపై కట్టుకదలక పడియుండునట్లు గావించెను. కాని భూతనాయకులు ఎనమండ్రుగురు తమ మంత్రశక్తి ప్రభావమున నేల పాలుగాక నిగ్రహించుకొని నిలచి యుండిరి. భూత నాయకులు తనపై బడనుండ వాసవాస్త్రముచేతనకు రక్షణ కల్పించు కొనినాడు. వారి మధ్య పోరు ఘోరముగ సాసగినది. మత్స్యేంద్రుడు భూతములతో పోరాడుటకై మధుకైటభులను శుంభని శుంభాదులను ఏడుగురను సృజించెను. వారెల్లరు పోరాడుచుండ మత్స్యేంద్రుడు వాసవ శక్తిని ప్రయోగింప భూతనాయకులు భూమి పాలయిరి. తదుపరి వాతాకర్షణ విద్యను ప్రయోగింప భూతనాయకుల శరీరమున వాయు ప్రసరణశక్తి స్తంభించి పోయినది. కట్టుకదల జాలరైరి. భూతనాయకులు మత్స్యేంద్రుని మహిమాతిశయ ప్రభావమును గుర్తెఱిగి తమకు భూతములకు ఘోరప్రమాదము వాటిల్లునని బుద్ధి గలిగి శరణు జొచ్చిరి ఇట్లు విన్నవించు కొనిరి."మహాప్రభో, మమ్ములను మట్టుబెట్టుట వలన నీకు కలుగు ప్రయోజన మేమున్నది? మా ప్రాణములను కాపాడుము. మేమెల్లరము నీకు విధేయులమై యుందుము. ఇక పై మీరే కార్యమునకు మమ్ములను నియోగించినను శిరసావహించి నెరవేర్చగలము. మీరు మమ్ములను మది తలచి నంత మీ చెంత ఱెప్పపాటు కాలమున చేరగలము. ఇందులకు వ్యతిరేకముగ మేము ఏమాత్రము ప్రవర్తించినను గోహత్య శిశుహత్య స్త్రీహత్యా మహాపాపములేకాక పంచమహాపాపముల నొడిగట్టిన వారల మగుదుమని కఠోరశపథములొనరించిరి.

మత్స్యేంద్రుడు తన యభీష్టము నెరవేర్చుటకై వాత ప్రేరకాస్త్రము నుపయోగించి ఎనిమిదికోట్ల భూతములను – వారి నాయకులనేకాక – అంతకు పూర్వము కదలక మెదలక పడియున్న కోటివిదయ్యములకు

విమోచనము కల్పించెను. భూతనాయకులు భూతగణములు మత్స్యేంద్రునకు జయ జయహోయని దిక్కులు పిక్కటిల్లునట్లు జేజేలు పలికిరి. మత్స్యేంద్రుడు భూతములన్నింటిని క్షేమముగ వెడలి రమ్మని ఆశీర్వచన రూపకముగ హస్తసంజ్ఞగావించెను.

భూతములన్నియు నేకగ్రీవముగ "మహాప్రభో! నీవు ప్రపంచమునకు మహోపకారమొనరింప నవతరించిన దివ్య పురుషుడవు - మమ్ములను గూర్చి నీవు మంత్రోచ్ఛారణ మెట్లొనరించిన మేమట్లు ప్రవర్తించుదు మనిరి.

మత్స్యేంద్రుడు భూతములతో నిట్లనెను. "మీవలన నాకొక కోరిక తప్పని సరిగ నెరవేరవలయును. అదెద్దియన మీకును నాకును జరిగిన యీ పోరాటమును గూర్చిన వృత్తాంతము నెవరు శ్రద్ధగ పఠించుదురో లేదా వినెదరో లేదా ఈ వృత్తాంతమును వివరించు గ్రంథమెవరిఇంట నుండునో అట్టి వారి నెన్నటికిని మీరు బాధింపకూడదు. కర్మవశమున వారికేమైన ఇడుములు దాపురించిన మీరు తొలగింపవలయును. భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ గణములు వారి యింటికి బహు దూరముగ నుండవలయును. నేను లోకోపకారమునకై శాబరీ మంత్ర శాస్త్రమును రచించుచున్నాను. ఆయామంత్ర ప్రయోగము యందు మిమ్ములను స్మరించి నంతనే మీరు తప్పక సహకరించి మంత్రశాస్త్రమునకు నిండు దనమును గూర్చవలయును" అని తెలిపెను.

ఆ భూతములన్నియు చిత్తము మీ ఆజ్ఞను అవశ్యము శిరసా వహించుదుమని తమ తమ నెలవుల కేగినవి.

మత్స్యేంద్రనాధుడు కుమారస్వామి క్షేత్రమును సందర్శించి కొంకణ దేశమున కూడాల్ ప్రాంతమున నున్న అడాల్ అను గ్రామమును చేరెను. ఆయూరి వెలుపల నొక కాళికాదేవి ఆలయముగలదు. ఆమె విగ్రహము మహోగ్రరూపమును దాల్చియుండును. శివుడు రాక్షస సంహారమునకై పెద్దకాలము కాళీశక్తిని ఆయుధముగ నుంచుకొని దానవ సంహార మొనరించెను. శివుడు తనకు తోడ్పడిన అస్త్రాధి దేవతను వరమడుగు మనినాడు. ఆమె ప్రభూ! యుద్ధము దీర్ఘకాలము పొసగినది. నిద్ర నాకు కఱవైనది. నన్ను మీ రెండు నిలిపిన నచట విశ్రాంతిగ నుండగలనని నది. అట్లు శివుడు కాళీమాతను అదూల్ గ్రామము వెలుపల ప్రతిష్ఠించినాడు.



మత్స్యేంద్రుడు కాళీ ఆలయమున ప్రవేశించి "తల్లీ! నేను శాబరీ విద్యయను మంత్రశాస్త్రమును రచించియున్నాను. ఆ మంత్ర శాస్త్రమునందు నీ నామోచ్ఛారణ మొనరించినంతనే నీవు తోడ్పడ వలయునని" ప్రార్థించెను. నిద్రాభంగమొనరించిన మత్స్యేంద్రునిపై కాళికాశక్తికి మితిమీరిన కోపము వచ్చినది. ఆ మంత్ర శాస్త్రవేత్తతో "ఓరీ! నేను దీర్ఘకాలము విశ్రాంతి నిద్రయనునది లేక మెలకువతో యుద్ధము చేసి కడుడస్సియున్నాను. నీవు నాకు నిద్రాభంగము సలిపితివి. మీదు మిక్కిలి నీ మంత్రము లకు వశ్యమై సహాయము సేయుమనుచుంటివా? పో, పోమ్మావలకు, నీవు నన్నడుగుట కాకి వచ్చి హంసను సేవింపుమని యడుగుచున్నటు లున్నదని" పెద్ద పెట్టునగర్జించి పలికినది.

అందులకు మత్స్యేంద్రుడు "అమ్మా! నీవు నన్ను మంచి నీళ్ళకన్న పలుచనగ చులకనచేసి మాటలాడుచున్నావు. సూర్యబింబము చూచుటకు చిన్నిదిగనే కన్పట్టినను దాని ప్రకాశము మేరలేనిది. నేను దత్తభగవానుని శిష్యుడను-నా గురుదేవుని కృపవలన నిన్ను స్వాధీనమొనరించుకొనెదను" అని దిట్టముగ పలుక "ఓరీ! చెవులకు చిల్లులు పొడుచుకొని కుండలముల నలంకరించుకొని మొగమున సింధూరమును దిద్దుకొని చేతులకు కంకణములు తగిలించుకొని యోగివేషమును దాల్చినంత మాత్రమున హద్దు పద్దు లెరుగక నోటికి వచ్చినట్లు ప్రేలుచుంటివా? నీ పుట్టు పూర్వోత్తరములు నాకు తెలియకున్నవా మేమి? నీవు చేపలు పట్టువాని కుమారుడవు కావా? నాటకము నందు భీముని వేషమును వేసినవాడు పదివేల ఏనుగులంత బలవంతుడనని భావించుట ఎట్టిదో, నీ పలుకుల తీరట్టులున్నది. కొతివిదయ్యము లను జయించితినని మిడిసి పడుచుంటివి కాబోలు. నేను శివుని చేతి అస్త్రమునని తెలిసికొనుము. నేను తీక్షణముగ జూచిన బ్రహ్మాండములు భస్మములు కాగలవు. నీవొక దోమతో సమానమని నేనెంచెదను. నీవు నా ముందెట్లు నిలువగలవని నిర్లక్ష్యముగ కాళికాదేవి పలికినది. అందులకు మత్స్యేంద్రుడు :

"అమ్మా! మాటలకేమి లెమ్ము చెట్టు ఆకసమును ముద్దిడుట కోయనునట్లు మహోన్నతముగ నున్నను పెనుగాలికి సమూలముగ విరిగి పడుటలేదా? నీ ప్రతాపము విజృంభణము అదే విధముగ నుండ గలదని" పలికినంతనే కాళీమాత సింహనాద మొనరించి రౌద్రసముప్పొంగ వీరావేశమున చిందులు ద్రొక్కినది. భూమి గడగడ లాడినది. బ్రహ్మాండము

బద్ధలయినదా యనిపించినది. ఆశక్తి స్వరూపిణి భద్రకాళీ అస్త్రమును ప్రయోగించెను. ఆ భీకర నినాదమునకు ప్రాణికోటి భయోత్కంపమున పరుగులు దీసినది. అష్టదిగ్గజములు అల్లల నాడినవి. భూమి ప్రకంపించినది. దేవతలు అకాల ప్రళయము వాటిల్లినదని భీతిల్లిరి. అపుడు కాళికాశక్తి "మత్స్యేంద్రా! నాతోడి పోరాటము కోరివితో తలగోకు కొనుట వంటిది సుమా! ఇక తెప్పపాటు కాలమున భస్మముగదువని" వికటాట్ట హాసమొనరించెను. కాళి తన ప్రత్యర్ధిపై శక్త్యాయుధము నుపయోగించినది.

మత్స్యేంద్రుడు "కాళీ! ఓ మహంకాళీ!! నీ బెదరింపు మాటలకు బెంబేలు పడువాడను కాను" అని తనజోలెలోని భస్మమును గైకొని ఆకాశమునందు చల్లెను. వాసవశక్తితో నభిమంత్రించిన ఆ భస్మముకాళి ప్రయోగించిన అస్త్రముపైకి కోటి సూర్య ప్రభాసమానముగ వెడలి ఎదుర్కొనినది. ఆ రెండు అస్త్రములు మేరు మందర పర్వతములు లొకదానితో నొకటి ఢీకొనునట్లుండినది. దేవతలా యుద్ధమును నింగి యందు నిలచిచూచు చుండిరి. భద్రాకాళి ప్రయోగించిన అస్త్రము వాసవశక్తి అస్త్రమును దిగమ్రింగి ప్రచండ వేగమున మత్స్యేంద్రునిపైకి వచ్చుచుండినది. మత్స్యేంద్రుడది గమనించి మరల భస్మమును గైకొని రుద్రమంత్రమును పఠించెను. ఆ మంత్ర పఠనమునకు ఏకాదశ రుద్రులేతెంచిరి. కాళికాదేవి యారుద్రులకు నమస్కరించ, ఏకాదశరుద్రులామె నాదరించిరి.

మత్స్యేంద్రుడు వెంటనే వజ్రాస్త్రమును ధూమాస్త్రమునుపయోగించెను. ధూమాస్త్రము భూమ్యాకాశముల మధ్య భాగమంతయు దట్టముగ పొగల లుము కొనినవి. చిమ్మచీకటులావరించినవి. వజ్రాస్త్రము కాళీమాతపై కెగసి వచ్చుచుండ ఆమె ఆ అస్త్రమును కాలితో ఒక తన్ను గట్టిగ తన్నినది. ఆమె కాలిదెబ్బకా అస్త్రము సహ్యపర్వము పైబటి విభాగముల్లై పర్వత శ్రేణులుగ రామేశ్వరము మొదలు ఘూర్జర దేశ పర్యంతము చెల్లాచెదురుగ పడినవి.

మత్స్యేంద్రుడు దత్తాత్రేయుని స్మరించి తనవద్దనున్న అస్త్రములలో అమోఘమగు వాతాకర్షణమను అస్త్రమును భస్మముచే నభిమంత్రించి కాళికాదేవిపై వదలెను. ఆ అస్త్రప్రభావమున ఆమె శరీరము నందు వాయు ప్రసరణము నిలిచి పోయినది. చేష్టలుడిగి ఆమె నేలపై వ్రాలినది. ఏమియును చేయుటకా మహాశక్తికి శక్తిచాలక శివునిస్మరించినది. కాళికాదేవి సంకటస్థితిని శివుడు దివ్యదృష్టిచే తిలకించి అయ్యది మత్స్యేంద్రుని వలన





జరిగినదని తెలిసికొని నందివాహనారూఢుడై యచ్చోటికప్పటి కప్పుడే వచ్చెను. మత్స్యేంద్రుని చేరదీసి "వత్సా! నా చేతియందలి కాళికాస్త్రమును జయించిన వాడవైతివి, భేష్!" యని ప్రశంసించెను. "దేవా! మహాదేవా!! ఇందునా ప్రతిభ యనునదేమున్నది? బదరికాశ్రమమున మీరును, దత్తభగవానులును నన్నాశీర్వదించి వరములొసగి అనుగ్రహించిన ఫలితమే కాని వేరొండులేదని" సవినయముగ విన్నవించుకొనెను. శివుడు సంతసించి కాళికాశక్తికి స్వస్థత గూర్పుమన మత్స్యేంద్రుడు శివుని యాజ్ఞను శిరసా వహించెను. కాళికాదేవి తొల్లింటి శక్తులను కూడగట్టుకొని తేజరిల్లినది. వారిరువురు శివునకనేక ప్రణామములర్పించిరి.

మత్స్యేంద్రుడు మహేశ్వరునితో "ప్రభూ! మీరు కాళికాదేవితో నాకొక కార్యమును సిద్ధింపజేయ వలయును. అదెద్దియన, మీదయ వలన నేను శాబరీ మంత్రశాస్త్రమును రచించితిని. ఆ మంత్ర శాస్త్రమున కాళికాదేవి యొక్క సహాయ సంపద మంత్రప్రయోగముల యందు ముఖ్యావసరమై యున్నది. కార్యసిద్ధికై ఆమెను పఠించినపుడా శక్తి స్వరూపిణి ప్రత్యక్షమై కార్య సాఫల్యమును గూర్పవలయునని ప్రార్థించెను. శివుడు "వత్సా! నాభక్తులొకటి యడిగిన ఒకటికి రెండు లేదనక ఇచ్చువాడను నేను. కాళికాశక్తితోబాటు నేనును నీ శాబరీమంత్ర ప్రయోగముల యందు ప్రత్యక్షముగ నుండి నెరవేర్చుదునని" ఆ భక్తుని చేతిలో చేయికలిపెను. శివుడు కాళికాదేవితో "కాళీ! నామాటమేరకు నీవు ఇంతకాలము నాచేతి యందు నిలిచి రాక్షస సంహార సమయముల యందు నాకు తోడ్పడి నటుల మత్స్యేంద్రుడు రచించిన మంత్రశాస్త్రమునందు నిన్ను పఠించినపుడెల్ల సహాయము సలుపుచుండు" మనెను. కాళి శివుని కడ ప్రమాణపూర్వకముగ సమ్మతించినది. మత్స్యేంద్రునికన్న కొడుకునువలె చేరదీసికొని అభయ మొసగి సహాయ పడుటకు సంసిద్ధముగ నుందునని వాగ్దాన మొనరించెను. శివుడు మత్స్యేంద్రుడు కాళీ సన్నిధానమున ముచ్చటగ మూడుదినము లుండిరి. అటుపిమ్మట శివుడు కైలాసమునకు నందివాహనారూఢుడై వెడలెను.

మత్స్యేంద్రుడు దేవి యాజ్ఞను బడసి ఉత్తర దిక్కుగ పయనము చేసి సముద్రతీరమున నున్న హరేశ్వర దేవస్థానమును చేరి గదా తీర్థమున స్నానమాడెను. అచటనున్న పర్వతమునకు ప్రదక్షిణలు సలిపెను. వీరభద్రుడు మానవరూపమును దాల్చి త్రిశూలము ఢమరుకము చేదాల్చి గదా తీర్థమున

స్నానమాడుటకై పోవు చుండెను. ఇరువురు త్రోవలో కలిసి కొని ఒకరికొకరు నమస్కారములు చేసికొనిరి. వీరభద్రుడు మత్స్యేంద్రుని "మీరెవరని" యడుగ సంప్రదాయము వేద విరుద్ధమైనది. దీనికి గురువెవరోఏమో తెలియదు. చెవులకు కుండలములు నొకచేత యోగదండము నింకొక చేత సితారా ధరించిన వారెల్లరు నాథ సంప్రదాయమునకు చెందిన వారమని ప్రజలను మోసగించుచున్నారు" అని చులకన చేసి మాటలాడెను. మరియు "మీరిక బుద్ధికలిగి మెలగుట లెస్స లేకున్న మిమ్ములను నేను కఠినముగ శిక్షించుదు"ననెను.

అందులకు మత్స్యేంద్రుడు "ఓయీ! ఎదుటివాని మనస్సును నొప్పించుట మహాపాతకము. అనర్థదాయకమని తెలియని పరమ మూర్ఖుడవు నీవు. అట్టి నీవంటి వారి మొగముచూచిన కలుగు దోషపరిహార్థము సచేల స్నానమాచరింపవలయును. నోరుమూసుకొని నీ దారిని బొమ్ము. లేకున్న నీవు శిక్షింపబడుదు"వనెను. వీరభద్రుడాగ్రహోదగ్రుడై మత్స్యేంద్రుని ప్రాణములను హరింప అర్థచంద్రాకార బాణము నుపయోగింప నుంకించెను. మత్స్యేంద్రుడపుడు "ఓరీ! తులువా! విల్లంబులు చేదాల్చి నాతో పోరాడవచ్చిన వారి ప్రాణమునపహరించిన నా యెదుట నీవు నిలుచుటయన యమ సదనమునకు పయనముగట్టి వచ్చుటయేసుమా!" యనెను. వీరభద్రుడు పకపకనవ్వి "నేనును నీకు కొంచెము అవకాశమును నొసగుచున్నాను. ప్రాణావసాన సమయమున రామనామమును ముమ్మారు స్మరింపుము"నెను. అందులకు మత్స్యేంద్రుడు "రామనామ ప్రభావము నీవంటి వారలకెట్లు తెలియగలదు. అది కైలాసనాథుడగు పరమశివునకు తెలియును ఆంజనేయునకు తెలియును. వాల్మీకిని తరింపజేసి మహర్షిని గావించిన ఆ రామ మంత్రమే నన్ను రక్షింపగలదు" అని తన జోలెలోని భస్మమును కొంచెము గ్రహించి వజ్రాస్త్రముచే నభిమంత్రించి తనచుట్టు చల్లుకొని భస్మమునొకించుక చేతియందుంచుకొని ధైర్యముగ వీరభద్రున కెదురొడ్డి నిలిచెను. వీరభద్రుని అర్థచంద్రాకార బాణమును గడ్డిపోచగ నెంచెను. ఆ బాణము మత్స్యేంద్రుని సంహరింప వచ్చియు వజ్రాస్త్రప్రభావము నడ్డుకొనజాలక తునాతునకలైనది. వీరభద్రునికోపము పరాకాష్ఠ నందుకొనినది. శక్తి అస్త్రమును నాగాస్త్రమును రెండింటిని ప్రయోగించెను. కోటి పిడుగు లొకపరిరాలినట్లు శక్త్యాయుధము భయంకర నినాదములు సలిపినది. భూమి కదలి యాడినది.





అకాల ప్రళయ మేదోముంచుకొని వచ్చినదని భూప్రజలు భీతిల్లిరి. మత్స్యేంద్రుడు తన రక్షణకై నిర్మించుకొనిన వజ్రాస్త్రమును ఛేదించి మించి పోవుచుండ నాగాస్త్రము సహితము మత్స్యేంద్రుని సంహరింప బుసలు గొట్టుచు వచ్చుచుండెను. మత్స్యేంద్రుడది గ్రహించి రుద్రాస్త్రమును గారుడాస్త్రము నుపయోగించెను. రుద్రాస్త్రము నుండి ఏకాదశరుద్రులుద్భవించిరి. ఏకాదశ రుద్రులకు శక్తి నమస్కరించినది. గరుడాస్త్రము నాగాస్త్రమును మ్రింగినది. వీరభద్రుని వాతాస్త్రమును మత్స్యేంద్రుని పర్వతాస్త్రమడ్డుకొనినది. వీరభద్రుడు వజ్రాస్త్రముచే పర్వతాస్త్రమును ముక్కలు ముక్కలుగావించినాడు. వీరభద్రుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రమును ఆయన ప్రత్యర్థి మేఘాస్త్రముచే వర్షమును కురిపించ మంటలు చల్లారినవి. వీరభద్రుని కామాస్త్రమునాతని ప్రత్యర్థి విరక్తి అస్త్రముచే వారించెను. వీరభద్రుడు మరల నాగాస్త్రమునుపయోగింప మత్స్యేంద్రుడు సంజీవినీ అస్త్రముచే నాగాస్త్రప్రభావమును వమ్మొనరించెను. వీరభద్రుడు దానవాస్త్రమును ప్రయోగింప రక్కసి మూకలు మత్స్యేంద్రునితో పోరాడ చుట్టుముట్టినవి. మత్స్యేంద్రుడు దేవతాస్త్రమునుపయోగించెను. ఆ అస్త్రమహిమచే దేవత లెల్లరు విచ్చేసి దానవులపై తలపడిరి. దేవదానవులకే పోరుపొసగినది.

వీరభద్రుడు ఆశ్చర్య చకితుడై యుద్ధము చాలించి "మత్స్యేంద్రా! నీవంటి సమర్థుని నేనింతకాలము చూచి యుండలేదు. నీకు నీవే సాటి యన అది యంతయు తన గురుదేవులగు శ్రీదత్తభగవానుని అనుగ్రహ విశేషమని సమాధానమొసగెను. నీవు సమర్థుడవు. అదృష్టశాలివి. నీ గురువు త్రిలోకైక ప్రపూజ్యుడని మెచ్చితల యూచెను.

దేవదానవాస్త్రమహిమచే దేవదానవులు పోరాడిరి. కొంతసేపటికి వారదృశ్య మైరి. వీరభద్రుడు బ్రహ్మాస్త్రప్రయోగమొనరింప మత్స్యేంద్రుడు కాలాస్త్రమును ప్రయోగిం చెను. దేవతలెల్లరు విమానారూఢులైవచ్చి కాలాస్త్రము నుపసంహరింపుమని మత్స్యేం ద్రుని కోరిరి. లేకున్న లోకములకు అకాల ప్రళయము సంభవించునని తెలిపిరి. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మత్స్యేంద్రుని కడకువచ్చి వీరభద్రుని తమకడకు రావించి ఇరువరనొకటిగ చేతిలో చేయిజేర్చి మైత్రిని కుదిర్చిరి.

త్రిమూర్తులు వీరభద్రునితో "మత్స్యేంద్రుడు సామాన్యుడుకాడు. కవి నారాయణుడు లోక సంరక్షణార్థమై అవతరించినవాడు మీరు మిత్రులై

మెలగుట లెస్సయనిరి. అందులకు వీరభద్రుడు మత్స్యేంద్రుని కోరిక యెట్టిదో తెలిపిన నేనవశ్యము నెరవేర్చెదను. ఇంతకాలము నాధాటికి యుద్ధమున నిలిచిన వారులేరు. నిలిచిపోరాడి మెప్పించిన వీరుడు మత్స్యేంద్రుడే సుమా" యనెను.

అప్పుడు మత్స్యేంద్రుడు "మహాశయా! వీరభద్రా!! పరోపకారమును మించిన పుణ్య మెద్దియును లేదు. అందులకై నేనొక మంత్రశాస్త్రమును రచించి యున్నాను. శాబరీ విద్యయని ఆ మంత్రశాస్త్రమునకు పేరిడి యున్నాను. ఆ శాబరీ మంత్రముల యందు నీ నామమును జతచేసి నిన్ను ధ్యానించిన వారి కోరికను సఫలము గావింప నీవు సంసిద్ధుడవై యుండుటయే నా అభిమతము" అని తెలిపెను. సరి, మంచిది, అవశ్యము సహకారము సలుపుదునని వీరభద్రుడు వాగ్దానమొనరించెను. అచట సమావేశమైన దేవతలు సహితము శాబరీ మంత్రముల యందు వారి నామముల నుచ్చరినంతనే సహాయ మొనరించుదుమని అడుగకయే తెలిపిరి. మత్స్యేంద్రుడు దేవతలందరికి నమస్కరించెను.

విష్ణుదేవుడు మత్స్యేంద్రుని ఆలింగన మొనరించుకొని "వత్సా! మానవులు సంకటముల యందు దగుల్కొని నానామము నుచ్చరించుచు శాబరీ మంత్రమున జేర్చి పఠించినంతనే నేను ప్రత్యక్షముగ నిలిచి సుదర్శన చక్రముచే వారిని కాపాడుదు" ననెను. శివుడు త్రిశూలమును ధరించి తానును శాబరీ మంత్ర పాఠకులకు సహాయ మొసగుదుననెను. బ్రహ్మదేవుడు తన శుభనామమున శాబరీ మంత్రములతో జతగూర్చి ఉచ్ఛరించిన వారలకు వాక్శుద్ధిని గూర్చెదననెను. ఇంద్రాదిదేవతలు తమ సహాయ సంపదచే శాబరీ విద్యకు నిండు దనమును గూర్చుదుమనిరి.

దేవతలందఱు విమానములనధిరోహించి తమ తమ నెలవులకు పయనమగు చుండ మత్స్యేంద్రుడు ఆ దివ్యలోకములను జూడ తనకు వేడుక బొడమినద"నెను. విష్ణుదేవుడు మత్స్యేంద్రుని వైకుంఠమునకు గొనిపోయెను. ఒక దినము మత్స్యేంద్రుడు లక్ష్మీకాంతునితో "ప్రభూ! మేమీ అవతారములను దాల్చుటకు పూర్వము మా శరీరములను మేరుపర్వతముల యందు భద్రపరచితిమి. ఇపుడా సమాధులను జూడ వేడుకగ నున్న"దనెను. విష్ణుమూర్తి మత్స్యేంద్రుని దివ్యవిమానముపై గొనిపోయి వారి సమాధులను చూపించెను. మత్స్యేంద్రుడు సంతసించి వైకుంఠమున నొక ఏడుకాలము సుఖముగ నుండెను.





శివుడు వైకుంఠమునకు వచ్చి మత్స్యేంద్రునికైలాసమునకు గొనిపోవ నచట నొక సంవత్సరము శివుని సన్నిధానమున నుండెను. అటు నుండి ఇంద్రుడు స్వర్గలోకమునకుగొనిపోవ నచట మూడు మాసములుండెను. బ్రహ్మదేవుడు నారదుని స్వర్గమునకు పంపి సత్యలోకమునకు రావించు కొనెను. బ్రహ్మసదనమున ఆరు మాసములుండెను. దేవతలెల్లరు తమతమ నివాసములకు మత్స్యేంద్రు నాహ్వానించి సత్కరించి గౌరవించిరి. ఇట్లు ఏడుసంవత్సరములు దేవతల మన్నన లందుకొని వారికడ సెలవు గైకొని విమానారూఢుడై భూలోకమును చేరెను.

మత్స్యేంద్రుడు తీర్థయాత్రలను పశ్చిమదెసను గూర్చి పయనము సేయుచు కొంకణ రాజ్యమున గల వజ్రవనమున ప్రవేశించెను. వజ్రావతియను మహాశక్తికావనము నెలవైయున్నది. అచట మూడు వందల అరువది ఉష్ణగుండములు కలవు. మత్స్యేంద్రుడా కుండము లన్నింటి యందును స్నానమాచరించెను. తన పేరున ప్రత్యేకముగ నొక కుండమును నిర్మింపదలచి యటచనున్న అర్చక స్వాములతో ఉష్ణకుండము లన్నియుండు టకు కారణమేమని యడిగెను.

అర్చక స్వాములాయనతో "పూర్వము బ్రహ్మర్షియగు వశిష్ఠ భగవానుల వారొక మహాయజ్ఞమునుసలిపి దేవతల నెల్లరనాహ్వానించెను. యజ్ఞము నందు పాల్గొనవచ్చిన దేవతల స్నానసౌకర్యమునకై కుండములనుత్రవ్వ నట్లేర్పడినవి. ఆ యజ్ఞము పండ్రెండేండ్లు జరిగినది. కుండములట్లే ఆయాదేవతల పేర్లతో నిలిచియున్నవని తెలిపిరి. సరస్వతీ నదీతీరమున మత్స్యేంద్రుడు తన పేరున నొక కుండము నేర్పరుప నెంచి వరుణ మంత్రమును పఠించెను. నీరు పెల్లుబికి వచ్చినది. అచటనొక కుండ మేర్పడినది. పాతాళము నందలి భోగవతీ జలమాకర్షింపబడి యందు చేరినది. అగ్ని మంత్రమును పఠింప కుండమునందలి నీరు వేడినీరుగ మారినది. మత్స్యేంద్రుడు శివుడొసగిన త్రిశూలముతో నాకుండమును విశాలముగావించి యందుస్నాన మాడెను. వజ్రాభగవతీ దేవిని తానేర్పటు గావించిన కుండమునందు స్నానము చేయించెను. అమ్మవారు "మత్స్యేంద్రా! భోగవతీ జలముపై నాకు మక్కువ ఎక్కువ. అట్టి జలమున స్నానము చేయించిన నీవును నాకు ప్రీతిపాత్రుడవైతివి. ఒక నెల దినములిందే నీవు నిలిచినాకు సంతసమును గూర్చుమన్నది. ఆ మహనీయుడు దేవి అభీప్సి

తమ మేరకు నెల దినములచటనుండెను. ఒకదినము మత్స్యేంద్రుడు "జననీ నీకు వజ్రాబాయి యను పేరెట్లు కలిగినదని" యడుగ నామె ఇట్లు తెలిపినది.

వశిష్ఠ భగవానుల వారిచట జరిపిన యజ్ఞమున కనేక ఋషులే తెంచిరి. దేవేంద్రుడు సహితము వచ్చినాడు. దేవేంద్రుని రాకను పురస్కరించుకొని మునులులేచి ఎదురేగి గౌరవింపని కారణము ఇంద్రునకు కోపము నొంది మునులపై వజ్రాయుధ మును ప్రయోగించెను. అపుడు శ్రీరామ చంద్రుడు మునులకు మేలు గూర్పనెంచి తానుకూర్చున్న దర్భాసనము నుండి యొక దర్భను తీసి వజ్రాయుధముపై వదలెను. శ్రీరాములు వదలిన దర్భపోచ ఇంద్రుని వజ్రాయుధమును గుటుక్కున మ్రింగినది. దేవేంద్రునకు గర్వభంగమైనది. శరణాగత త్రాణ బిరుదాం కితుడగు శ్రీరాముని పాదారవిందములపై ఇంద్రుడు వ్రాలెను. క్షమాగుణసంపన్నుడగు రాముని కోపముడిగినది. రాముని యనుమతిపై నేను శచీపతికి వజ్రాయుధయును నోటినుండి తీసియిచ్చితిని. అపుడు దేవతలు ఋషులెల్లరు నన్ను వజ్రాభగవతీయను పేరున నిచట ప్రతిష్ఠించినారు. యజ్ఞము పరిసమాప్తమైనంత ఎచటి వారలచట కేగిరి. అలనాటి నుండి నేను వజ్రాభగవతీ–వజ్రాబాయియని వ్యవహరింప బడుచున్నాను. అలనాడు శ్రీరాముడు నన్ను చల్లనీళ్లచే స్నానము చేయింప నేడు నీవు వేడినీళ్ళస్నాన మారచింపజేసి యున్నావు"అనెను.

మత్స్యేంద్రుడచట నెలదినములుండి దేవి సెలవుగైకొని ఉత్తర దెసగ పయనమై ద్వారకాక్షేత్రమును సందర్శించి యచట నుండి అయోధ్యా పట్టణమున ప్రవేశించెను. సరయూనది యందు స్నానమాచరించి శ్రీరామ సందర్శనార్థమై ఆలయమునకు బయలుదేరెను. అదే సమయమున రామచంద్రుని వంశీయుడైన పాశుపతరాజు శ్రీరాముని సేవించి పూజింప ఆలయమున ప్రవేశింప రాచరికపు ఠీవితో వచ్చు చుండెను. పాశుపతరాజు వెంట ఏనుగులు గుర్రములు సైనికులు బయలుదేరిరి. పురోభాగమున మంగళ తూర్యములు వీనుల విందొనరింప నర్తకినులు నృత్య గానములు సలుపుచుండిరి. పగటి దివిటీలు వెలుగుచుండెను.

ఆలయమునందడుగిడుచున్న మత్స్యేంద్రుని జూచి ద్వారపాలకులు "ఓయీ! మహారాజులవారు శ్రీరామ సందర్శనార్థమై వచ్చుట నీకు కనపడకున్నదాయేమి? చెవులకు కుండలములు,చేతులకు కంకణములు







ధరించి సితారా నొకటి పట్టుకొని లేనిపోని వేషమున తగుదునని వచ్చియున్నావు. నీ వేషములిచట పనిగొన జాలవు. పో, పొమ్మని" పలికిరి. ఆలయముల యందు పూజారులు మరుజన్మము నందు కుక్కలుగ పుట్టుచుందురు–ద్వారపాలకులు స్వామి సందర్శనమునకై వచ్చు భక్తులను యుక్తాయుక్త విచక్షణా జ్ఞానశూన్యులై త్రోసిపుచ్చుపాపమున కొడిగట్టుటయే కాక ఆలయాధికారులకు అపకీర్తిని గూర్చుదురు.

ద్వారపాలకుల దౌష్ట్యమును గూర్చి మత్స్యేంద్రు డిట్లాలోచించెను. "ద్వారపాలకులపై నేను కల్పించుకొనుట పిచ్చుకలపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించుట వంటిది. ఆ ప్రయోగమేదో రాజుపై ప్రయోగించుట లెస్స" యని తనజోలె యందలి భస్మము నొకించుక గ్రహించి స్పర్శాస్త్రము నభిమంత్రించి శ్రీరామ ప్రభువును మదిలో ధ్యానించి పాశుపతరాజుపై వదలెను. ఆ సమయమున పాశుపతరాజు గర్భగుడి యందు శ్రీరామునకు సాష్టాంగనమస్కృతు లొనరించుచుండెను. భస్మ ప్రభావమున రాజుకాలు సేతులు కదలవాయెను. రాజు పరిస్థితికి మంత్రి పుంగవుడు చింతిల్లి ఆ హఠాత్పరిణామమునకు కారణమేమి మహనీయులెవరైనవచ్చి యుండ ద్వారపాలకులు వారిని పరాభవించి రాముని విచారణసలిపెను. పర్యవసానముగ ఆలయద్వార పాలకులు మత్స్యేంద్రుని చులకన చేసి మాటలాడి బయటకుపంపిన విషయము తెలిసివచ్చినది. అమాత్య శేఖరుడందందువెదకి మత్స్యేంద్రుని చెంతజేరి "మహాత్మా! మీరు కల్ప వృక్షమున కన్న మిక్కిలి గొప్పవారు. కల్పవృక్షము తన నాశ్రయించిన వారి కోరికలను మాత్రమే తీర్పగలదు. తమ వంటివారు సంకల్పదీక్షచే ఎంత దూరముననున్న వారలనైనను దయదలచి మేలు గూర్చ సర్వసమర్థులనుట సత్యేతరముకాదు. సేవకుల వివేకులై తమ యెడ విధేయతను జూపని దోషమునకు ప్రజలనేలు రాజు శిక్షింపబడుట మాకెల్లరకు సంతాప కరముగ నున్నది. మాకు సంతసమును గూర్చుమని" ప్రార్థించెను. మంత్రి విన్నపము మత్స్యేంద్రు నలరింప జేసినది. ఆ మహనీయుడొకించుక భస్మమును చేగొని విభక్తాస్త్రము నభిమంత్రించి రాజునుద్దేశించి చల్లెను. పాశుపతరాజు యథాప్రకారముగా లేచినిలిచెను.

మంత్రివలన పాశుపతరాజు మత్స్యేంద్రుని మహిమను స్వానుభవముగ తెలిసికొనెను. ఆ యోగిపుంగవుని అపార మహిమాతిశయము

నారాజంతకు పూర్వమే వినియున్న వాడగుటచే ఆ యోగీశ్వరునకు తలయొగ్గి నమస్కరించెను. అట్టి మహామహితాత్ముని సందర్శనము సంప్రాప్తించి నందులకు అమితానందము నొంది రాజభవమునకు గొనిపోయి స్వర్ణపీఠముపై సుఖాసీనుని గావించి పాదపూజలు సలిపెను. స్వయముగ సపర్యలు సలుపుచు కొన్నిదినములు రాజమందిరమున నిలుపుకొనెను.

పాశుపతరాజు సేవకులకు మత్స్యేంద్రుడు పరమానందము నొంది యొకదినము "రాజేంద్రా! మీరునన్నొక వరమునడిగిన నది యెట్టిదైనను అనుగ్రహించుటకు నేను సంసిద్ధముగనున్నా"ననెను అందులకు పాశు పతరాజు "మహాత్మా! సూర్యవంశ సుధాంబుధి చంద్రుడు శ్రీరామమూర్తి. ఆ రామచంద్రుని సందర్శన భాగ్యము లభించుటెన్నడాయని ఎల్లవేళల దలపోయుచున్నాను. జన్మమెత్తి నందులకు ఫలితముగ ఇనకుల తిలకుని జూచుకోరిక తప్ప నాకే కొదవయును లేశమైనను లేకున్నది. రమణీయ రాజ్యభోగములు తృణప్రాయములు. అనంత మహీవలయమునకేకైక సార్వభౌముడగుట కన్న రామపాదుకలను పూజించుటయే మిన్నయని తెలిసినవాడు భరతుడొకడేయని నా యభిప్రాయము. భగవత్సందర్శన భాగ్యమును కల్పించువాడు గురువు. ఈ జన్మకిదియె తుది జన్మమగుటకు శ్రీరామ చంద్రుని సందర్శనమును ప్రసాదింపుమని ప్రార్థించెను.

అందులకు మత్స్యేంద్రుడు "మహారాజా! జగమెఱిగిన ఒక పరమ రహస్యమును నీకు తెలిపెదను వినుము. అంతులేని కరుణా సముద్రమునకు పర్యాయపదమే శ్రీరాముడు. ఆశ్రితవత్సలుడు, ఆశ్రితపోషకుడు శ్రీరాముడు. పగవాని తమ్ముడగు విభీషణుడు ఆయన పాదముల నాశ్రయించి లంకాపుర సార్వభౌముడాయెను. ఇల్లువదలి ఇల్లాలిని గోల్పోయిన సుగ్రీవుడు కిష్కింధాపురమునకు ప్రభువాయెను. స్పర్శవేదిని సోకిన ఇనుము బంగారమగునట్లు రాముని పాదములంటిన కోతులు-ఎలుగుబంట్లు ఉడుత జటాయువు. శబరికి ముక్తిలభించినది. శ్రీరాముని పాదధూళి ప్రభావమున శిలయై పడియుండిన అహల్యకు శాపవిమోచనము లభించినది. రామ యను రెండక్షరములు మహాపాతకోప పాతకములను దహించి దివ్యజ్ఞానము నొసగుననుటకు వాల్మీకి మహర్షిజీవితమే నిదర్శనము. ఆ రామనామ మహిమను తెలిసి రామచింతన చేయు మహదేవుడు శివుడొక్కడే సుమా!! నీవు రామభద్రుని వంశమున పుట్టిన పుణ్యాత్ముడవు. ఎల్లవేళల రామచింతన







హనుమంతునివలె సలుపు భక్తుడవు. కావున నీకారామచంద్రుని దర్శన భాగ్యము తప్పక లభింపగలందులకై నేను తగు ప్రయత్నము సలుపుదునని" దిట్టముగ పలికెను.

మత్స్యేంద్రుడంత రాజభవనము నుండి వెలుపలికి వచ్చినాడు. పాశుపతరాజు ఆయన వెంటనుండెను. ఆ యోగీంద్రుడు తన జోలెనుండి కొంత భస్మమును గ్రహించి ధూమాస్త్రమును నభిమంత్రించి ఆకాశమున చల్లెను. పొగలు ఆకాశము నందంతట దట్టముగ నలము కొనినవి. సూర్యుని రథముగా పొగలు చుట్టుముట్టినవి. పొగలు కనులకు కప్పినందున రథము నడుపుట సూర్యుని సారథియగు అనూరునకు శక్యముగాదాయెను. సూర్యుడది గమనించి ఎవరో యోగ సంసిద్ధి నొందినవాడీ ప్రయోగము గావించినాడని వాయువ్యాస్త్రమును వదలెను. ఆ మంత్ర ప్రభావమునకు ఱెక్కలు లేనిపర్వతములే గాలికి కొట్టుకొని పోవు నేమోయనిపించినది. ఆకాశము వినిర్మలముగ చూపట్టినది.

సూర్యుని రథము కదలినది. మత్స్యేంద్రుడా రథము ముందునకు సాగి పోకుండునటుల పర్వతాస్త్రము ననుసంధించి వదలెను. ప్రభాకరుడు వజ్రాస్త్రము నుపయోగించి యా పర్వతమును తునాతునాకలుగావించెను. మత్స్యేంద్రుడు భ్రమణాస్త్రమును భస్మముతో జేర్చి సూర్యుని పై వదల అనూరునకు-రథమునకు పూన్చి ఏడుగుఱ్ఱములకు భ్రమను గొలిపినది. రథసంచారము కుడి ఎడమలైనది. భాస్కరుడది గమనించి జ్ఞానాస్త్రమును ప్రయోగింప రథము సక్రమముగ సాగిపో దొడగినది.

మత్స్యేంద్రుడంత వాతాస్త్రమును ఆకర్షణమంత్రములను పఠించి వాయు సంచారమును నిరోధింపజేసెను. సప్తాశ్వములు అనూరుడు. సూర్యభగవానుని శ్వాస కవరోధమేర్పడ అంతరిక్షము నుండి ఏక చక్రరథము భూమిపైకి దిగి రాదొడగినది. ఖరకరుని తీక్షణకిరణముల మహోగ్ర తాపమునకు భూలోక వాసులు మాడిమసి యగుదురని మత్స్యేంద్రుడు జలదాస్త్రమునుపయోగించెను. కుంభవృష్టి గురిసి సూర్యుని తాపము నపనయింపజేసి ఉపశమనము గావించినది. సూర్యునకు చలనము లేకుండినది. అకాలప్రళయము వాటిల్లనున్నదని దేవతలందరికన్నముందు దేవతా సార్వభౌముడగు శ్రీమహావిష్ణువు ఱెప్పపాటు కాలమున లోకక్షేమమును మదిదలచి వచ్చెను. విష్ణుదేవుడు మత్స్యేంద్రుని కౌగిలించు

కొని లోకబాంధవుడగు సూర్యునకు సంకటము కల్పించేమి పని కలిగినదని యడిగెను.

మత్స్యేంద్రుడు సవినయముగ "దేవ దేవా! ఇందిరా రమణా! ఈ పాశుపత రాజు సూర్యవంశమున బుట్టినవాడు. వంశకర్తయగు సూర్య భగవానునకు తన వంశములోని వారల కోరిక నీడేర్చుట విధాయకమే కదా!! ఈ పాశుపతరాజునకు ఇనకుల తిలకుడగు శ్రీరాముని సందర్శించు కోరికలను బలీయముగ నున్నది. నేను రచించిన శాబరీ విద్యకు సూర్య భగవానుడు నిండుదనమును ప్రసాదింప వలయును. ఈ రేడు జగములకు ప్రభువునగు నీవు రెండు కోరికలను సూర్య భగవానుని వలన సిద్ధింప జేయుమని" రెండు చేతులు జోడించి నమస్కరించి యర్థిం చెను.

శ్రీమన్నారాయణుడు అట్లేయగుగాక! నీవు లోకోపకార్థామై రచించిన శాబరీవిద్యకు విష్ణుదేవుడనగు నేనేకాక యీ వచ్చిన దేవత లెల్లరు సహకరింపగలరు" రనెను. మత్స్యేంద్రుడు తాజేసిన ప్రయోగము నుప సంహరింప జేసెను. దినకరుడు తొల్లింటి జవసత్త్వములను పుంజుకొనిలేచి నిలిచెను. సూర్యనారాయణునితో బాటు విష్ణ్వాది దేవతలు శ్రీరామచంద్రుని స్మరించిరి. సీతాలక్ష్మణ సమేతముగ శ్రీరాము దచట ప్రత్యక్షమాయెను. దేవతలెల్లరు శ్రీరాముని జూచి అమితానందమున నొందిరి. పాశుపతరాజు శరీర మాద్యంత మొకపరి పులకించినది. ఆనంద బాష్పవారి పరిపూర్ణ లోచనుడై శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహమును తనవిదీర జూచి బ్రహ్మానంద భరితుడాయెను. మత్స్యేంద్రుడు శ్రీరాముని పాదార విందములపైబడి నమస్కరించెను.

శ్రీరామచంద్రుడు తనపాదములపై వ్రాలిన పాశుపతరాజును లేవనెత్తెను. లాలనగ శిరమునిమిరెను. పాశుపత రాజు "ప్రభూ! అంతా రామమయం. ఈ జగమంతా రామమయం. కంటికగుపడు ప్రపంచమే నీవు. నీవే ఈ ప్రపంచమని రామతత్త్వమును తెలిసిన బుధులు పలుకుదురు. అంతియేకాదు. "త్రిభువన వపుషం. విష్ణుమీశంనమామి" అని పంచమ వేదము పలుకుచున్నది. ముల్లోకములే నీ శరీరముగ సర్వవ్యాపకుడవై సర్వమునకు ప్రభువై యున్న నీ పురుష మోహనాకృతిని జూచుటెన్నడని, పుట్టి బుద్ధివచ్చిన నాట నుండి ఉబలాటము నొందుచుంటిని. చాలు, చాలు, ఈ జన్మకిదియె చాలునని" కన్నులారమోడ్చి తన్మయత్వమున పలికెను.





అందులకు శ్రీరాముడు "వత్సా! కుమారా! నీవు ధన్యులలో ధన్యుడవు. సూర్యవంశమునకు కీర్తిని గూర్చితివని" చిరునగవు పెదవులపై సయ్యాట లాడ, దరహాసమనోహర వదనమున పలికి ఆశీర్వదించెను.

అంత మత్స్యేంద్రుడు శ్రీరాముని పెక్కుభంగులస్తుతించి "మహాప్రభో! అన్ని రూపములు నీ రూపములై యలరారుచున్నవి. రూపములెన్నో అన్ని నామముల నీవు వ్యవహరింపబడుచున్నావు. అయినను రామ యను రెండక్షరముల ప్రభావ మమేయము. నేను శాబరీ మంత్రశాస్త్రము నందు బీజాక్షర సమన్వితమగు రామయను శబ్ద బ్రహ్మమును జోడించి ప్రయోగించిన మంత్రము తిరుగులేదనిదై వరలునట్లు నాకభయమొసగుమని ప్రార్థించెను. ఇందులకు మీరిష్టపడకున్న మీతో పోరాడుటకు నేను సంసిద్ధముగ నున్నాను. మీరును ధనుర్బాణములు చేదాల్చి యుద్ధమునకు సిద్ధముగమ్మని" పలికెను.



అందులకు సమాధానముగ శ్రీరాముడు "మత్స్యేంద్రా! దుష్టులను సంహరింప నేను యుద్ధముచేసిన వాడనే కాని శిష్టులతో పోరాడిన వాడను కానని నీకు తెలియ కున్నదా యేమి? మీదు మిక్కిలి యోగులు – మునులు – భక్తులు – సజ్జనులు నాకు పరమాప్తులు. నీవు బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడగు దత్తాత్రేయుని దివ్యాను గ్రహమునకు పాత్రుడవైయున్నావు. నరసింహస్వామి మున్నగు దేవతలు నీకు సహాయ ముగ నెల్లవేళలనుండుట నాకు తెలియనిదికాదు. ఇంకొక మాట, నీవు నారాయణాంశ సంభూతుడవు. నేను నారాయణుని అవతారమూర్తిని. శరీరములు రెండుగ నున్నను మన మిరువుర మొకటియని గ్రహింపుము. సరి మంచిది, అది యట్లుండనిమ్ము. ఆదిదేవుడగు సూర్యభగవానునకు సంపూర్ణముగ స్వస్థతను గూర్పుము. ఆయన అనుగ్రహమునకు నీవు పాత్రుడవగుట లెస్స" యని కర్తవ్యమును బోధించెను.

మత్స్యేంద్రుడు శ్రీరాము నానతిని శిరమున దాల్చి భస్మమును గ్రహించి సూర్యునుద్దేశించి వాతాస్త్రము నుపసంహరింపజేసెను. సూర్యుడు ఎప్పటివలె తేజరిల్లెను. విష్ణ్వాది దేవతలను, శ్రీరాముని జూచి సంతసించెను. తన తేజమును స్తంభింపజేసిన యోగీశ్వరుడెవరని వారల నడిగెను. దేవతల కోరికపై మత్స్యేంద్రుడు చంద్రాస్త్రమును జలదాస్త్రముతో మేళవింపజేసి తనకు కవచములుగ నేర్పరచుకొని సూర్యునికడకేగి నమస్కరించెను. మత్స్యేంద్రుని

పుట్టు పూర్వోత్తరములు విష్ణుదేవుడు సూర్యునకు వివరించెను. అందులకు సూర్యుడు తన అంశతో గూడిన నవనాథులు భువిపై వెలసియున్నారని తెలిసినవాడనేకాని–అంతరిక్షమున సంచరించు వాడనగు టచే వారిని జూచు అవకాశమిందనుక లభింపలేదని తెలిపెను. సూర్యుడు మత్స్యేంద్రునితో "గడచిన మూడుయుగముల యందింతటి అమేయ ప్రభావులు వెలసి యుండలేదు. నేడు నీ వింతటి శక్తి సంపన్నుడవగుటకు శ్రీదత్త భగవానుని దివ్యానుగ్రహమే కారణము. మీదు మిక్కిలి నారాయణాంశ సంభూతుడ వగుట మరియొక విశేషమని" ప్రశంసించెను.

అపుడు మత్స్యేంద్రుడు "లోకబాంధవా! ఆదిదేవా! నా ప్రార్థన మంగీ కరింపుము. నేను శాబరీమంత్ర శాస్త్రమును రచించియున్నాను. అందు నీ పవిత్రనామము నుచ్ఛరించి నంతనే ఆ కార్యము సఫలమగునట్లు వరమును ప్రసాదింపు"మని యర్థించెను. అందులకు సూర్యుడు "లోకమున నున్న వారల కెల్లరకును నేను బంధువును, మీదు మిక్కిలికర్మ సాక్షిని. సత్కర్మ లొనరించువారలు నాకు ప్రీతిపాత్రులు. అట్టిపట్ల లోకక్షేమమును మదినెంచి నీవు మంత్ర శాస్త్రమును రచించుట నాకు సమ్మతమేయగును. నీవు కోరినట్లు శాబరీ విద్యయందు మంత్రము లతో నానామము గూర్చి పఠించిన నేను అవశ్యము సహాయమొనరించి సఫలము సేయుదుననెను. పాశుపతరాజు సూర్యనారాయణునకు నమస్కరించెను. తన వంశములో కలియుగమున రాజుగనున్న పాశుపతిరాజును చూచి సూర్యుడు సంతసించెను. ప్రజాక్షేమము నెల్లవేళల మదినెంచి రాజ్యపాలన మొనరింపుమని హితవు మాటలాడి ఆశీర్వదించెను.

ఏకచక్రరథము ఏడు గుఱ్ఱములతో బాటు అనూరుని రథచోదకత్వ మున సూర్యుని గూడి నింగిలోని కెగసినది. మత్స్యేంద్రుడు శ్రీరామునకు విష్ణ్వాది దేవతలకు నమస్కరించెను. పాశుపతరాజు మరియొక సారి శ్రీరామునకు విష్ణ్వాది దేవతలకు నమస్కరించెను. మత్స్యేంద్రుడు పాశుపత రాజుకడ సెలవు గైకొని తీర్థయాత్రలు సలుపుచు చంద్రగిరి గ్రామమును చేరెను.





ఓం

శ్రీ గురుదత్త జయగురుదత్త

## గోరక్షనాథ చరిత్ర

చంద్రగిరి యను గ్రామము నందు మత్స్యేంద్రుడు భిక్షాటనము సేయుచు నొకదినము బ్రాహ్మణుని యింటికేగెను. భిక్షకై యా యింటి ముందు నిలిచి నంతనే పండ్రెండేండ్ల క్రితము జరిగిన ముఖ్య సంఘటన మాయన మదిలో మెదలినది. ఆ యింటి ఇల్లాలిపేరు సరస్వతి. ఆమె తన భర్తయగు సర్వదయాళునితో గూడి దాంపత్య సౌఖ్యములనుభవించు చున్నను సంతాన యోగము లేకుండినది. సరస్వతికి మత్స్యేంద్రుడు పవిత్ర భస్మమును ప్రసాదించి ద్వాదాశాబ్దములు గడిచినంత తిరిగి వచ్చి బాలునను గ్రహించెద నని తెలిపియుండెను. ఆ బాలుడాయింట పుట్టి పెరుగు చున్నాడని యూహించి బాలునిజూడ వేడుక బొడమి ఉత్సాహము నొందు చుండెను. అంతలోనే సరస్వతి – ఎవరో యోగి భిక్షకై వచ్చి వాకిటికడ నిలచియున్నాడని యొక పాత్రయందు అన్నము కూరలనుంచి ఆయన జోలెలోనిడ నుంకించెను.

మత్స్యేంద్రుడా గృహిణితో "అమ్మా! నీ పేరు సరస్వతి యే కదా? నీ భర్త సర్వదయాళుడను నాతడేకదా? మీరు గౌడ బ్రాహ్మణులగుదురుకదా? యని యడిగి మరల నాయోగీశ్వరుడు "మీకుమారుడింట కాన్పించుటలేదు. గురువులకడ విద్య నభ్యసించుటకై వెడలినాడా యేమి? లేకతోడి బాలుర గూడి ఆటలాడుకొనుటకై వెళ్ళిన వాడయేమని" కుతూహలమతి శయింప నడిగెను. అందులకు సరస్వతి "మహాత్మా! నాకు పుత్రోదయ మింత కాలమైనను లభింపకున్న"దనెను.

అందులకా మహనీయుడు "అమ్మా! అబద్ధములాడుటను మించిన అధమాధమ దోషమింకొకటిలేదు. ఏలనాతో అమృతవాక్యములాడుదువు? పండ్రెండేండ్ల క్రితము నీ సంతాపమును బాపి సత్సంతానమును ప్రసాదింప జాలు పవిత్ర భస్మము నొసగినది నేనని యిప్పటికైనను జ్ఞప్తికి తెచ్చుకొనుము. అమోఘమగు ఆ భస్మప్రభావమున ముదిమి మరణమునునదిలేక మహాతేజస్సంపన్నుడగు నొక మహాపురుషుడు నీ గర్భమున వెలసియుండు ననుట తిరుగులేని సత్యము సుమా! ఆ బాలుని జూడ నాకు వేడుక

అంతకంతకు నతిశయించుచున్నది. ఆలసింపక వేవేగ వెడలి ఆ బాలుని నాకడకు గొనిరమ్మని" పలికెను.

గతము స్ఫురణకురాగా, సరస్వతికాలు సేతులు చల్లబడినవి. కన్నుల వెంట సంతత ధారలుగ కన్నీరొలికినది. అర్థములేని వ్యర్థపు మాటలు నిజమని యెంచి ఇరుగుపొరుగు ఆడవారి మాటలు విని సిద్ధయోగీంద్రు డిచ్చిన పవిత్ర భస్మమును దిబ్బలో పడవైచినది జ్ఞప్తికి వచ్చినది. గుండె దడదడలాడసాగినది. ఎదుట నున్న యోగికోపాగ్నికి భస్మమగుదునను భయము నిలువెల్ల నావరింప సరస్వతి భయోత్కంపము నొందినది.

మత్స్యేంద్రుడామె చేష్టలను గమనించి "అమ్మా! నీకు దయ్యము పట్టినదా! లేక పిచ్చితలకెక్కినదా? ఏమి బాలుని జూపుమని నేనడుగ వెర్రివెర్రి వేషములు వేయుచున్నావని" గద్దించి యడిగెను. కన్నీరొలికించు నందనుక స్త్రీలు అబలలు. శృతిమించిన వారి సాహసమునకు తిరుగు లేకుండును. సరస్వతి ధైర్యమును పుంజుకొనినది. చేసిన పాపము నిజము చెప్పుట వలన కొంత పరిహారము కాగలదు. యోగి శపించినంత మాత్రమున నేమాయె? వంధ్యగ నూతేండ్ల బ్రతుకుట వలన ప్రయోజన మేమున్నది? ఏనాడో ఒకనాడీ శరీరము మట్టిపాలు కావలసినదే కదా? కానిమ్మని" సరస్వతి చేతులు జోడించి దీనవదనమున ఆయన పాదములపై వ్రాలి, "మహాత్మా! మీరు నాకు పవిత్రభస్మము నొసగినది నిజమే! నొసటి వ్రాతమేరకు నేను గొడ్రాలినై యుండుట విధి నిర్ణయమై యున్నది కాబోలు. మీరు నాకు పవిత్ర భస్మము నొసగితిరనియు ఏడు కాలములలో మాతృ మూర్తి నగుదునని పొరుగిండ్ల ఆడువారుతో తెలుప వారు నామనస్సువిరిచి ఏవేవో కల్పించి తెలుప నేను నా దుష్కృత కర్మఫలితముగ మీ రొసగిన పవిత్ర భస్మమును ఆవుపేడను వేయు దిబ్బలో చేర్చితి"ననెను. నా అపరాధమును క్షమించినను-శిక్షించినను ఏమైనను సంసిద్ధముగ నున్నా"నని తెలిపినది.

మత్స్యేంద్రుడు వ్యథనొంది తనలో "ఔరా ! అంగనలను నమ్మరాదని పెద్దలాడుట ఇందులకే కాబోలు స్త్రీల పలుకులు పనసతొనలకన్నను పంచదారకన్నను తియ్యగనున్నను వారి హృదయము విషపూరితము. నిలువెల్ల మాయలనుట కింతకన్న నిదర్శనమేమి కావలయును. స్త్రీలు తామధోగతి పాలగుటయే కాక వారిని నమ్మినవారిని కుప్పగూల్చుదురుకదా!!



భస్మప్రభావమున జగదారాధ్యుడగు నొక మహాపురుషుడుదయించి ప్రపంచము నుద్ధరించునని ఇంతకాలము ఓపిక వహించి వేచియుంటిని. ఇపుడు కత అడ్డము తిరిగిన"దని కొంతవడి విచారించి నిట్టూర్పును వదలినాడు. ఆ యోగీశ్వరుని మస్తిష్కమున నొక భావము మెఱుపు తీగవలె నుదయించినది. భస్మము అత్యంత మహిమోపేతమైనది. సరస్వతి గర్భమున చేరినను పెంటదిబ్బయందు కూరుకొని పోయినను భస్మ ప్రభావము ఊరకపోవునది కాదని నిశ్చయముగావించుకొని, అమ్మా! ఆ భస్మము నెందు పడవైచితివో నాకు చూపుదువు,రా రమ్మనెను.

పండ్రెండు సంవత్సరముల క్రితము ఆమె పడవైచిన భస్మమున్న పెంట దిబ్బను మత్స్యేంద్రునకు జూపినది. ఆ దిబ్బ అలనాటి నుండి పెరిగి పెరిగి ఒక గుట్టవలె నుండినది. మత్స్యేంద్రుడు గుట్టకడకేగి "సూర్యనందనా! ఓ హరినారాయణా! నీవు సజీవముగనున్నచో నీ పెంట దిబ్బనుండి బయల్పడుము నాయనా బలయల్పడుము, అని ఉచ్ఛైర్నాదమున పిలిచెను. పెంట దిబ్బనుండి స్ఫుటముగ నిట్లు వినబడినది. గురు మహారాజా! సద్గురు సార్వభౌమా! నేనీ పెంటదిబ్బయందే సజీవముగ నున్నవాడను, దిబ్బలోనుండి వెలువడుట శ్రమదాయకమై యుండగలదు. దిబ్బను తొలగించినంతనే వచ్చి మీ పాదములపై వ్రాలుదును.

అంత చంద్రగిరి యందలి ప్రజలు వారు వీరేకమై పారలను చేగొని పెంటదిబ్బను పెకలింప, పండ్రెండ్ల యాడుననున్న బాలయోగి ద్వాదశ కళలతో తేజరిల్లు సూర్యనారాయణునివలె వెలువడి మత్స్యేంద్రునికి ప్రణమిల్లెను. ఆ బాలయోగిని మత్స్యేంద్రుడు హృదయమునకు హత్తుకొని శిరము నిమిరి మూర్ధాఘ్రాణ మొనరించెను. గోమయము దిబ్బనుండి వెలువడిన ఆ బాలయోగి గోరక్షనాథుడను వ్యవహార నామమున ప్రసిద్ధిగాంచెను.

విశాలమగు ఫాలభాగము ప్రసన్నవదనము కరుణారసపూరిత కమల లోచనములతో నాబాలయోగి చూపరుల దృక్చకోరములకు పున్నమనాటి చంద్ర బింబమువలె ఆహ్లాదమును గూర్చు చుండెను. సరస్వతి ఆ బాల యోగివంక నొక పరిజూచినది. ఆమె ఆశలడుగంటి అధఃపాతాళమునకు దిగజారిపోయినవి. మత్స్యేంద్రుడు సరస్వతినిజూచకి "దుర దృష్టమను పదము నందు అదృష్టము అను నాలుగక్షరములు లోపించిన నెంత

శతదరిద్రముగ నుండునో నీవంతటి దురదృష్ట వంతురాలివి. నీవిచట నుండతగవు. మొటముచాటు చేసికొని పొమ్మావలకని గద్దించి పలికెను.

మత్స్యేంద్రుడు గోరక్షకుని నుదుట భస్మము నలంకరించి, నారాయణ మంత్రోపదేశ మొనరించి "వత్సా! మనము సాధువులము. ఒకే తావున నుండరాదు. తీర్థయాత్రలు సలుపుట మనకవశ్యాచరణీయము. దేశపర్యటనము సలుపుచు లోక కళ్యాణమును గూర్చుట మన వంతై యున్నది." యని చంద్రగిరిని వదలి వారందందు సంచరించుచు జగన్నాథ క్షేత్రమును సందర్శించి, కనకగిరి యందు గోరక్షనాధుడొక విప్రుని యింటికి భిక్షకై వెడలెను. ఆనాడాబ్రాహ్మణుని యింట ఆబ్దికముండినది. గోరక్షనాధుడా యింటి ముందు నిలిచి అలక్ నిరంజన్" యని భిక్షను యాచించెను. బాలభానునివలె తేజరిల్లుచున్న ఆ బాలయోగి నా యింటి ఇల్లాలు చూచి సంతసించి పళ్లెరము నిండుగ అన్నము – కూరలు, సూపము మినపవడలను గొనితెచ్చి ఆతని జోలియందిడినది. గోరక్షడావెూనాశీర్వదించి గురుశిష్యులిరువురకు సరిపడు భోజనము లభించినందున పొరుగిండ్ల కేగక సరాసరి గురువు సన్నిధిచేరెను. గురవు మినపవడలను ప్రీతిగతిని తృప్తినొందక మరికొన్ని తెచ్చియుండిన సంతృప్తిగ నుండెడిది కదా యనునట్లు సాభిప్రాయముగ శిష్యుని వంక జూచెను. గురువు మనోభావమును పసిగట్టి గోరక్షుడు పితృశ్రాద్ధము జరిగిన యింటికేగి "అమ్మా"యని పిలువ నాగేస్తురాలు వచ్చివాకిటకడ నిలచినది. గోరక్షుడు "అమ్మా! మీ చేతిమినప వడలు చాల రుచికరముగ నున్నటులున్నది. మా గురువుగారికి సమర్పించు కొనుటకు మరికొన్ని ఇమ్మని" యాచించెను.

ఆ విప్రవనిత "బాలకా! నీవెంత గడుసువాడవు. గురువు పేరు చెప్పి నీవే ఆవడలను కడుపార భుజించి గురువున కొసగుటకై మరలవచ్చి యున్నావు కాబోలు. నీ వేషములు కపటనాటకములు నాకడచెల్లవని పరిహాసముగ నవ్వినది. అందులకు గోరక్షుడు, అమ్మా! గురువును మించిన దేవుడు లేడను సిద్ధాంతమును నమ్మినవాడను నేను. అట్టి పట్ల గురుదేవునికి సమర్పింపక నావడల నెట్లు భుజించుదును. ప్రాణము లొడ్డియైనను గురువును సేవించిన ధన్యులు ఇహమున సుఖము, పరమున మోక్షమును బడయగలరు. నీవు నన్ను అపార్థము చేసికొంటివి"యని బదులాడెను.

అందులకా గృహిని మాటవరుసగ "గురువునకు ప్రాణములనైనను



సమర్పించుటకు వెనుదీయని శిష్యరత్నము నీవేయైన నీకంటి గ్రుడ్డును తీసి యిమ్ము. నీకు అయిదారు వడల నొసగుదునని ఆమె పలుకుచుండగనే గోరక్షుడు తెప్పపాటు కాలమైనను జాగుసేయక తన బొటన వ్రేలిని చూపుడు వ్రేలును గ్రుడ్డుపై నుంచి పెకలించి "అమ్మా! నా కంటిని గైకొని వడల నొసగుమని యడిగెను. బాలయోగి కంటి నుండి నెత్తురు కారుచుండినది. ఆ బ్రాహ్మన వనిత దిగ్భ్రమ చెందినది. దిగు లొందినది. దిక్కుతోచినదికాదు. ఆ బాలుని గురుభక్తికి ఆశ్చర్యచకితయైనది. మిక్కుట ముగ పశ్చాత్తాపము నొందినది. "అయ్యయ్యో!! నేను వేళాకోళముగ నన్నమాటలకు ఎంతపని చేసితివి నా తండ్రీయని కన్నీరొలికించినది. నా అపరాధమును మన్నింపుము. ఈ దీనురాలిని దయజూడుమని" పరిపరి విధముల పరితాపము నొందినది. మినపవడల నితోధికముగ గోరక్షుని జోలె యందిడినది. గోరక్షుడు అమ్మా! ఊరడిల్లుము. మించిపోయిన దేమున్నది. గురువు నోటిరుచికై కంటి గ్రుడ్డును సమర్పించితిని. గురువును సేవించుట కింకొక కన్ను మిగిలియున్నదికదా? నీవేల వృధాగా వ్యధ నొందుచున్నావని" ఆ బాలయోగి గురువుకడకు త్వరితగతిని వెడలెను.

గోరక్షుడు కంటిని మీది వస్త్రముచేకప్పి, నెత్తురును ఒత్తుకొనుచు మినప వడలను గురువునకు సమర్పించవలెను. మత్స్యేంద్రుడు శిష్యుని వంక చూచి కంటి కడ్డముగ వస్త్రమునేల యుంచితివని ప్రశ్నించెను. "ఏమియునులేదు, కంటిలో నలుసు పడి నీరుగారుచున్నందున అటుల వస్త్రమునుంచితిలెమ్మని" సమాధాన మిచ్చెను. "శిష్యాగ్రణీ! నీ ముఖవైఖరి మాటల తీరునుబట్టి చూడ నాకేదో సందియ ముగనున్నది. నీవస్త్రమును తొలగించినకాని మినపవడలను నేను ముట్టనని "దిట్ట ముగ తెలిపెను. "తమరు మినపవడలను తిన్నంతనే వస్త్రమును తొలగించనిది నేను వడలనేకాదు సిద్ధాన్నమును సహితము భుజింపకుందు"ననెను. అది నాకు నిషిద్ధమని"నొక్కి పలికెను. గోరక్షుడు మీది వస్త్రమును కంటిపై నుండి తొలగించెను. కన్ను లొట్టపోయినది. గ్రుడ్డేమైనదని గురువు అడిగినాడు. గోరక్షుడిది గోయని తన పిడికట నున్న తన కంటి గ్రుడ్డునుచూపెను. తన చర్యకు కినిసి గురువు భుజింపకుండు నేమో యని సంశయించి "ప్రభూ! నా యీ సాహసముమీకు అపచారమేయగు నెడ నన్ను క్షమింపుమని దీనముగ ప్రార్థించి భిక్షకై వెడలిన దాది యందనుక జరిగనకథ నంతయు పూసగ్రుచ్చినట్లు వివరించెను.

మత్స్యేంద్రుడు శిష్యుని లేవనెత్తి యాతని గురుభక్తికి అమందానందము నొంది శిష్యుని కంటి గ్రుడ్డును చేగొని సంజీవినీ మంత్రమును సూర్య తేజముతో మేళవింపజేసి శిష్యుని నేత్రగోళమునందమర్చెను. గోరక్షునియా కన్నుమునుపటి కన్నమిన్నగ ఆ మంత్రముల ప్రభావమున చెన్నలరారినది.

మత్స్యేంద్రుడు గోరక్షుని తన తొడపై కూర్చుండ బెట్టుకొని లాలనగ నా బాలయోగి శిరమును నిమిరి భుజములను తట్టి వెన్నుపై జోకొట్టి "గోరక్షా! నీవంటి ఉత్తమ శిష్యుడు లభించుట గురువునకు గర్వకారణమని" ప్రశంసించెను. శిష్యుని చెంత గూర్చుండ బెట్టుకొని భోజనము సలిపెను. భోజనానంతరము "గోరక్షా! నీకు గురుదేవుడు శ్రీదత్త భగవానుడు గురూపతేధముగ నేను పొందిన మంత్రము లన్నియు నీకు పలుకుదోడుగ స్వాధీనమగునట్లొనరించుదును" అని శిష్యుని ఒక నెలదినములు తన చెంతనుంచుకొని మంత్రశాస్త్ర పారంగతుని గావించెను.



మత్స్యేంద్రుని వలన గోరక్షుడు బ్రహ్మజ్ఞానమును బడసెను. నాలుగు వేదములను సాంగోపాంగముగ నభ్యసించెను. షట్‌శాస్త్ర పారంగతు డాయెను. వాతాస్త్ర, నాగాస్త్ర, స్పర్శాస్త్ర, మున్నగు అస్త్రములతోబాటు వాసన శక్తిని ప్రయోగోప సంహార విధానముగ తెలిసికొని అస్త్ర విద్యాపారంగతు డాయెను. సంజీవినీ మంత్రమును క్షుణ్ణముగ నభ్యసించెను. మంత్రసిద్ధి నొందిన గోరక్షునకు ఆయా అస్త్రాధి దేవతలు ప్రత్యక్షమై వరములను ప్రసాదించిరి. హనుమంతుడు, శ్రీరాముడు, గణపతి మున్నగువారు ప్రత్యక్ష సందర్శనమొసగి వరములిచ్చి యా బాలయోగి శిరమును తమ వరద హస్తములచే స్పృశించిరి. శివుడు, భైరవుడు, కాలభైరవుడు, బాలభైరవుడు, వీరభైరవుడు, గణభైరవుడు, ఈశ్వర భైరవుడు, భస్మభైరవుడు, గోరక్షుని సాదరముగ నాశీర్వదించి వరములొసగిరి. చాముండా-యక్షిణీ దేవతలు వరములనొసగిరి. బాలా బగళా, లక్ష్మీదేవి గోరక్షునకు వరములొసగి అష్టసిద్ధుల ననుగ్రహించిరి. మత్స్యేంద్రుడు గోరక్షుని కొంతకాలము తపమొనరింపుమని యదాదేశించెను.

గోరక్షుడొకదినము ఏకాంతమున గూర్చొని గురువు వలన నుపదేశము నొందిన సంజీవినీ మంత్రమును జపము సేయుచుండెను. పరిసర గ్రామముల యందలి బాలురెల్ల రచటజేరి ఆటలాడుటకు బంక మట్టిచే ఏవేవో బొమ్మలుచేసి ఉల్లాసముగ నుండిరి. ఆ బాలురు గోరక్షుని





సమీపించి తామాటలాడుకొనుటకు బండినొక దానిని చేసి యిమ్మనికోరిరి. ఆ బాలయోగి తన జపమునకు అంత రాయము కలుగునని పో, పొమ్మనెను. నటుల చేతితో సైగజేసెను. చక్రములొకరు నొగలొకరుగ బాలురెల్లరు ఒక మృచ్ఛకటమును (మట్టిబండిని) తయారుచేసిరి. బాలురెల్లరు కలిసి బండిని నడుపుటకొక మనిషిని చేసిన లెస్సగ నుండునని ఉబలాటముచే నూగిసలాడిరి. అందులకు వారశక్తులగుటచే నెల్లరు గోరక్షుని బండిత్రోలు వానినొకనిని చేసియిమ్మని పట్టుబట్టి పాదములపై వ్రాలి ప్రార్థించిరి.

గోరక్షునకు వారిపై దయకలిగినంది. అయినను జపము సేయుచునే మట్టితో నొక బొమ్మను చేయనది మానవుని ఆకృతిని దాల్చినది. అదేమి చిత్రమో బంకమట్టికి మారు చర్మమేర్పడినది. సప్తధాతువులు ఒప్పినవి. నఖశిఖ పర్యంతము సర్వాంగములు రూపొందినవి. ఱెప్పలల్లార్చుచు కాలుసేతుల నాడించ సాగినది. సమస్త జీవరాసుల యందు ఆబ్రమ్మస్తంబ పర్యంతము వెలసియున్న చైతన్య మా విగ్రహమునందు ప్రకాశింప దొడగినది. ముఖము చిట్లించి ఏడ్పునకు లంకించు కొనినది. చెదరిన గుండెలతో తడబడు మాటలతో కుయ్యో! మొర్రో దయ్యము దయ్యమని బాలురు పిక్కబలముకొలది దిక్కుతోచక పరుగులు తీసిరి. గోరక్షుడు సహితము ప్రాయమందు పిన్నవాడగుటచే ఆవగింజలను చల్లి దయ్యము నుసికొల్పినట్లయినదని భయమునొంది నొక యింట దూరినాడు. మట్టిబొమ్మ యందు వెలసినది నవనాథులలో నొకరగు కరభాజనుడని గోరక్షుడు తెలిసికొన జాలడాయెను. బ్రహ్మ నిర్మితమగు మట్టిబొమ్మలు తల్లి గర్భమునుండి శిశువులై వెలువడచున్నటుల గోరక్షుడా మట్టిని బొమ్మగ రూపొందించు నపుడు విడువక సలిపిన సంజీవిని మంత్రప్రభావ మున ప్రాణప్రతిష్ఠ జరిగినదని తెలిసికొన జాలడాయెను.

బాలురు భయోత్కంపమున పరుగులు దీయుట మత్స్యేంద్రుని కంటబడినది. విషయమేమని యడుగ బాలురు పూసగ్రుచ్చినట్లా మహనీయునకు విశదీకరించిరి. భూతమును జూపుమని యా మహనీయు డడుగ వారు భూతమున్న తావును అల్లంత దూరము నుండియే చూపిరి. గోరక్షుడెచట నున్నవాడని యడుగ ఆయన సహితము భీతిల్లి పారిపోయెనే కాని ఎచటనున్నది తమకు తెలియదనిరి. బాలురు చూపిన తావునకు మత్స్యేంద్రుడు వెడలెను. ఆ మహనీయుడు సర్వజ్ఞుడగుటచే మట్టితో బొమ్మను

చేయునపుడు గోరక్షుడు సంజీవిని మంత్రము నేమరక పఠించిన ప్రభావమున కరభాజనుని ఆత్మ యాశిశువు నందు ప్రవేశించినదని యెంచి పరమానంద భరితుడాయెను. ఆ బాలుని చంక యందిడుకొని ఇంటింటికి తిరిగి తిరిగి చివరకు గోరక్షుడుదాగి యున్న ఇంట ప్రవేశించెను. గోరక్షుడు గురువును చూచి సంతసించి గుండె ధైర్యమును పుంజుకొనినాడు. కాని ఆయన చంకయందున్న భూతమునుజూచి ఏమి ప్రమాదము జరుగనున్నదో యని శంకించెను. గోరక్షుని భయమునుబాపి మత్స్యేంద్రుడా బాలుని తన తలపాగా భూమిపై పరచిభూతమని యెంచిన ఆ బాలునందు పరుండ జేసెను. బాలుడు నిద్రపోవ గోరక్షుడంతయు అనుపూర్వికముగ విశదీకరించెను.

మత్స్యేంద్రుడు "వత్సా! గోరక్షా! ఆంజనేయుని వలె నీశక్తిని నీవు గ్రహింప జాలవైతివి. నీవు సంజీవిని మంత్రము నవిరళముగ జపము సేయుచు బొమ్మను నిర్మింప నద్దానికి నీవు ప్రాణముల నొసగినవాడవైతివి. ఆవు పెంట దిబ్బ నుండి నీవు జన్మించి నటులనే యీ బొమ్మయందు కరభాజనుడను మహాత్ముని ఆత్మ జీవరూపమున ప్రకాశించినది. నీవిక నిశ్చింతగ నుండుమని యంతకు పూర్వము గోరక్షుడున్న ఇంటికి గొనిపోయి శిశువునకు స్నానము చేయించి ఆవు పాలను త్రాపి ఉయ్యల యందు పరుండబెట్టెను.

ఊరివారెల్లరు ఉయ్యలలో నున్న బాలుడెవరని మత్స్యేంద్రునడిగిరి. ఆ మహనీయుడు గ్రామ వాసులకా బాలుని పుట్టు పూర్వోత్తరములు వివరించెను. ఆ గ్రామవాసులు "మహాత్మా! శుక్రాచార్యుడు చచ్చి నేల వ్రాలిన రాక్షసులను బ్రతికించెనే కాని అంతకు పూర్వములేని రాక్షసుని సృష్టింప శక్తిలేని వాడనుట నిర్వివాదాంశమే కదా!! ఇంకొకమాట. బ్రహ్మదేవుడు సహితము పూర్వకల్పము నందున్న వారలను మాత్రమే, మరల సృజించునని "ధాతాయధాపూర్వమ్ సృజత్" అని వేదము పలుకుచున్నది. కావున సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు సహితము ఇంతకు మునుపు ఉన్నవార లను మాత్రమే సృజింపగలడని తేట తెల్లముగ స్ఫురించుచున్నది. ఇపుడు మత్స్యేంద్ర మహామహితాత్ముడు తన శిష్యునితో మట్టిబొమ్మ నుండి యొక మహనీయుని సృజించెను. ఘనతర కీర్తిని బడసినాడని ఊరి వారెల్లరు గొప్పగ కొనియాడిరి.





ఊరివారలు మత్స్యేంద్రునితో "మహానుభావా! ఈ బాలుడు తల్లిదండ్రులు లేనివాడు. మీరు సర్వసంగపరిత్యాగులు. కావున నీ బాలుని పోషణను గూర్చి యాలోచించవలసియున్నది. సంతానప్రాప్తికై మొగము వాచిన దంపతులను రావించి వారి పోషణమున నీబాలునుంచుట లెస్సయని ప్రతిపాదించిరి. భేష్! మంచి యాలోచన యని మత్స్యేంద్రుడు ఆమోదము నొందెను. ఊరివారెల్లరా బాలుడు ఎవరి పోషణమున నుండిన మేలుగ నుండగలదని యాలోచించిరి. ఎల్లరును మధువను బ్రాహ్మణు నకును సుశీల యను సాధ్వీమణికిని వివాహము జరిగి పెద్దకాల మైనది. సంతానము బడయుటకై వారుచేయని పూజలు, సలుపని వ్రతములు, తిరుగమని తీర్థములులేవు. అయినను ఈశ్వర సంకల్పమేమో, వారికి సంతాన లాభము లేనందున నీ బాలుని వారికి అప్పజెప్పుట లెస్సయని ఏకగ్రీవముగ తీర్మానము సలిపిరి.

మత్స్యేంద్రుడు గ్రామవాసుల నిర్ణయమునకు సంతసించి సుశీలా మధువుల నచటకురమ్మని వర్తమాన మంపెను. మత్స్యేంద్రుని మహిమాతిశయమను బాగుగ నెఱిగిన యావిప్రదంపతులు తమకేదో అతిశయ శుభఫలితము సంప్రాప్తించనున్నదని త్వరితగతిని నామహనీయుని చెంత జేరిరి. మత్స్యేంద్రుడా బాలుని సుశీలాదేవి ఒడిలో నుంచి "అమ్మా! ఈ బాలుడు సామాన్యుడని యెంచకుము. నవనారాయణు లలో కరభాజను డీరూపమున ఇలపై నవతరించియున్నాడు. ఈ బాలుని పెంచి పెద్దజేసిన నీకు పుణ్యము-పురుషార్థము లభించుటయే కాక నీకీర్తి దేవకీ యశోదలవలె ఆ చంద్రతారార్కము వర్ధిల్లగలదు. ఈ బాలుని మహిమ నానాటికి పెంపు వహింప గలదు. ఇతడు అయోని సంభవుడనుట ప్రత్యక్ష నిదర్శనముగ నున్నది. ఈతని చరిత్ర అత్యంత గహనముగ నుండగలదు. కావున గహనీనాథుడను పేరున వెలయగలడు. నా శిష్యుడగు గోరక్షుడీ బాలుడు పెరిగి పెద్దవాడయిన పిదప మంత్రముల నుపదేశించి తంత్రములను బోధించి తన యంతవానిని చేయును. కావున నీవీ బాలునకు తల్లివై వెలసి ధన్యతగాంచు" మనెను.

మత్స్యేంద్రుడు పలికిన మాటలన్నియును సాంతముగ విని సుశీలాదేవి "మహాప్రభో! ఈ బాలుని పెంచి పెద్ద జేసిన పిదప మరల నేనాడో యొకనాడు మీరీ బాలుని గొనిపోవుదురు. కనిన మమకారమున కన్నను

పెంచి పోషించిన మమకారము మిన్నయై యుండగలదు. అపుడీ బాలుని ఎడబాసి నేనెట్లు మనగలనని సవినయముగ చేతులు జోడించి విన్నవించెను. అందులకు మత్స్యేంద్రుడు "అమ్మా! లేనిపోని సంశయములను పెంచుకొని నీవు కలవర పడవలసిన పనిలేదు. మాకును ఈ బాలున కికపై నెట్టి సంబంధము పెనవైచుకొని యుండజాలదు. ఈ బాలుడు నీవాడు, నీవీ బాలునకు జీవితాంతము తల్లివై యుండుము. నా శిష్యుడు గోరక్షుడొక ముహూర్తమున మీ గ్రామమునకు కేతెంచి మంత్రోపదేశమొసగి తనదారిని తాబోవును. అంతియేసుమా!" అని భస్మము నభిమంత్రించి ఆ బాలుని నొసట నలంకరించెను. భస్మరేఖాలంకృతుడగు బాలుని గాంచినంతనే సుశీలకు మాతృప్రేమ వాత్సల్యానురాగములు అనుబంధము ముప్పిరిగొని మురిసి మురిసిపోయినది. ఆమె వక్షోజముల యందు స్తన్యమేర్పడినది. మత్స్యేంద్రుని కడ సెలవుగైకొని ఊరివాలర కభినందనములు సలిపి మగనివెంట సుశీల తమయింటికేగినది. ఆ యూరనున్న సువాసిను లెల్లర నాహ్వానించి విందొనరించినది. బాలునకు స్నానము సకాలమునకే చేయించుచు, చనుబాలిచ్చి ఉయ్యాలలో పరుండబెట్టి జోలపాటలు పాడుచు నిద్ర బుచ్చుచుండెను.

మత్స్యేంద్రుడు గోరక్షుని వెంటనిడుకొని ఆ యూరును వదలి యాత్రలకై బయలుదేరెను. చివరకు వారు బదరికావనమును చేరిరి. గోరక్షుని తనయంత వానిని చేయనెంచి మత్స్యేంద్రుడు కేదారేశ్వరుని సన్నిధికేగి "దేవదేవోత్తమా ! దేవతా సార్వభౌమా!! మహాదేవ శంభో! దయాసార సింధో! ప్రభూ! గిరిజారమణా ! శూలపాణీ! మదనాంతకా! కైలాసనాధా!! గంగాధరా! నాగభూషణా! చంద్రశేఖరా! ఆశ్రిత కల్పభూజమా! భక్తవశంకరా! శంకరా!! నీవంటి భక్త పరాధీను డీరేడు జగముల యందులేడు. నీభక్తుల అరిష్టము లన్నింటిని తుంగలో ద్రొక్కి సుఖములను భద్రముగ మూటగట్టియిచ్చు సర్వశుభంకరుడగు శంకరుడనీవు. ఇది జగమెఱిగిన సత్యము.

అన్నపూర్ణాదేవి నీ యర్ధాంగియై యున్నను నీవు మెచ్చిన భక్తుల యిండ్లకేగి మధ్యాహ్నకాలమునందు భిక్షగైకొనెదవు. నవనిధులను కుబేరున కొసగిన నీవు భిక్షాటనము సలుపుటయన-ఇల్లు ఇల్లాలను భ్రమలకు లోనై సంసారమును బురద గుంట యందు కూరుకొనిపోవుట మేలైనది కాదని



తెలుపుటకే యగును. రామయను రెండక్షరములను సర్వకాల సర్వావస్థల యందు నీవు జపము సేయుదువు. భోగ మోక్షప్రదాయకుడవగు నీవు రామనామజపము సేయుటను మదినెంచిన - ఎనుబది నాలుగు లక్షల జీవరాసుల యందు మాన్యమైనది మానవజన్మ. జనన మరణ ప్రవాహ రూపమగు సాగరము వంటి సంసారము నుండి తరింప జేయునది "రామ" యను రెండక్షరములే యని ప్రపంచమునకు తెలుపకయే తెలియజేయుటకే సుమా! ప్రభూ! శంకరుని వంటి దైవము లేదని తెలియని వాడెవ్వడును లేడు. ఎందులకన తల్లిగర్భము నుండి వెలసిన ప్రతియొకడును కాల గర్భమున కలిసి పోవుట విధాయకము. కాలుని ప్రభావము మేరలేనిది. మీరరానిది. అట్టి కాలుని నీ భక్తుడగు మార్కండేయునిబ్రోచి సంరక్షింప గలందులకై శిక్షించిన కాలాంతకుడవు నీవు. ఎంతటి నియమనిష్ఠా గరిష్ఠుడైనను కాంతలకు దాసులను గావించి దాసోహమని దండములు బెట్టించువాడు మన్మథుడు. ఆతనిని నీవు కంటి మంటలచే భస్మము గావించితివి. ఇట్లు అనితరసాధ్యమగు మహత్కార్యము లెన్నియో సలిపిన త్రిపురాంతకుడవు - అని యిట్లు పొగడుచుండ శివుడుప్పొంగి లింగము నుండి వెలసి నిజరూపమున మత్స్యేంద్రుని చేతిలో చేయి కలపి ఆలింగన మొనరించుకొని శిరము నిమిరి "ఇతడు నరనారాయణుల కోవకు చెందినవాడు. ప్రపంచము నుద్ధరింపగల సర్వసమర్థుడు. ఈ నీ శిష్యుడు ఘోర తపమాచరించి శ్రీరాముని, హనుమంతుని, నృసింహస్వామిని, సూర్యుని, భైరవుని, కాళికాదేవిని మెప్పించి వరములను బడసిన ఘనుడు, అని అత్యాదరమున తన తొడపై చేర్చుకొనెను. మత్స్యేంద్రా! నీవీతనికి విద్యల నన్నింటిని ఉపదేశము నొసగియున్నావు. ఏ విద్యయైనను వీర్యవంతము కావలయుననిన తపోబల మత్యావశ్యకమై యున్నది. కావున నీవీ బాలుని నా చెంత నుంచు" మని గురువుతో తెలిపెను.

గోరక్షుడు హిమవత్పర్వతమున శివుని సన్నిధానమున వాయు భక్షణ మొనరించుచు తపమున కుపక్రమించెను. మత్స్యేంద్రుడు గోరక్షుని పండ్రెండేండ్లు తపమొనరింప నియమించి తీర్థయాత్రలకై బయలుదేరెను. శివుడు అనుదినము గోరక్షుని యోగక్షేమముల నరయుచుండెను.

మత్స్యేంద్రుడు శివుని కడసెలవు గైకొని శిష్యు నాశీర్వదించి కాశి, గయ, ప్రయాగ, బ్రహ్మగిరి, త్ర్యంబకము, ఘృష్ణేశ్వరము, పండరీపురము,

శ్రీశైలము, రామేశ్వరము మున్నగు క్షేత్రములనన్నింటిని సందర్శించుచు పండ్రెండేండ్లు గడిపెను.

మత్స్యేంద్రుడు రామేశ్వరమునందు సముద్రస్నానము సేయుచుండ హనుమంతుడా మహనీయుని చెంతజేరెను. బహుకాల సమావేశమున గలిగిన సంతసమతిశయింప నొకరొ నొకరు ఆలింగన మొనరించుకొనిరి. ఉభయకుశలోపరి సంప్రతింపులు జరిగిన పిదప హనుమంతుడు "మత్స్యేంద్రా! ఇరువది నాలుగు సంవత్సరముల యనంతరము నన్నీనాడు చూడ గలగితిని. చాల ఆనందముగ నున్నది. ఇదివరలో నీవు స్త్రీ రాజ్యమున ప్రవేశించి మైనాకిని దర్శనభాగ్యము. స్పర్శసుఖములను గూర్చుచు సురత క్రీడల నానందింపజేయుదునని వాగ్దాన మొనరించియున్నావు. నీవు నా వెంటవచ్చి మైనాకినితియ్యని కోరికనుదీర్చి సంతసింపజేయుమని" తెలిపెను.

మూడు దినములు వారు రామేశ్వరమున నిలిచినారు. హనుమంతుడు మత్స్యేంద్రుడాయాక్షేత్రములను సందర్శించుచు స్త్రీరాజ్యమును చేరిరి. స్త్రీ రాజ్యము నందు మంత్రిణిలు దండనాయకులు, పరివార మంతయు మహిళా మణులే!! హనుమంతుడు మత్స్యేంద్రుడు ఆ మహిళా రాజ్యము నందడుగిడిన శుభవార్త శోభనాంగుల నలరింపజేసినది. మైనాకిని ఆనందమున కవధులు లేవాయెను. హనుమంతునకు అతిధి సత్కారములు వైభవముగ జరిగినవి. మత్స్యేంద్రుని సర్వా లంకార శోభితునిగావించి మైనాకిని స్వర్ణపీఠముపై సుఖాసీనుని గావించి పూజలు సలిపినది. ఇంద్రలోకమున శచీపతివలె మత్స్యేంద్రుడు శోభిల్లెను.

కొంతకాలము జరిగినది. మైనాకిని గర్భవతియై నిర్భరానందమున తేలియాడినది. తొమ్మిది నెలలు పూర్తియైన కొలది దినములు గడిచినంతనొక అత్యంత శుభముహూర్తమున మహిళాలోకపు రాణి యొక మగశిశువును ప్రసవించినది. ఆ బాలుడు మీనకేతనుడగు మన్మథుని వలె చూడ చక్కనివాడు. పండ్రెండవ దినమున నామకరణ మహోత్సవము జరిగినది. ఆ బాలునకు మైనాకిని మత్స్యేంద్రులిరువురు ఏకాభిప్రాయముగ మీననాథుడను శుభనామమునిడిరి. మైనాకిని ముఖ చంద్రబింబదర్శనము గావించుచు మీననాథుని ఎత్తి ముద్దాడుచు మత్స్యేంద్రుడు అమర సుఖములను భవించుచు హాయిగా కొంతకాల మచటగడిపెను.

ఓం తత్సత్







శ్రీరాములు శ్రీపాద వల్లభాయ నమః

## జాలంధరనాథ చరిత్ర

పాండవ వంశాంకురమగు పరీక్షిన్మహారాజు పుత్రుడు జనమేజయుడు. జనమేజయుని సంతతి యందు పదునొకండ తరమున ఖ్యాతి గాంచిన వాడు బృహద్రధుడు. బృహద్రధుడు రాజ్యమునేలు సమయమున కలియుగము రెండువేల ఏడు వందలసంవత్సరములు గడిచి యుండినవి. లోక కళ్యాణమునకై చల్లని ప్రభవులు యజ్ఞయాగము లొనరించి దేవతల ఈనుగ్రహము బొందుచు, భూసురులగు బ్రాహ్మణులకు పలురకములగు దానమొలొసి వారిఆశీర్వచనములను పొందుట పరిపాటిగ నుండినది. బృహద్రధ మహారాజు నేల నాలుగు చెఱగుల యందున్న వేద పండితులను రావించి సంవత్సర దీక్షగ నొక యజ్ఞమును పూర్తిగావించెను. పూర్ణాహుతి సహితము పూర్తియైనది. యజ్ఞకుండము నందలి భస్మమును విప్రులు జనమేజయునకు ప్రసాదించిరి.

శివుని కంటి మంటలకు మన్మథుడు భస్మీపటలమైపోవుట జగ ద్విదితము. మన్మథుని జీవాత్మ ఆ భస్మము నందలి అగ్నియందు సూక్ష్మరూపమున వెలయు చుండినది. అందు నవనారాయణులలో మూడవ వాడైన అంతరిక్షుని జీవాత్మ ప్రవేశించినది. బృహద్రధుడు ఋత్విజులొసగిన భస్మమును తాకినంతనే అంతరిక్షుడు శిశువుగ నావిర్భవించి తల్లి గర్భమునుండి వెలువడిన శిశువువలె నేడ్వసాగెను. ఆ బాలుని జూచినంతనే పుత్రకామేష్టియాగమొనరించిన దశరధ మహారాజు శ్రీరామ చంద్రుని జూచినంత యానందమును బృహద్రధుడనుభవించెను.

బాలుని ఎత్తిముద్దాడి మహారాజు భార్యయగు సులోచన చేతుల యందిడెను. మహారాణి ఈ బాలుడెవరని ఆశ్చర్యమగ్నమానసయై యడుగ సంతాన హీనులమగు మనకు పరమేశ్వరుడు యజ్ఞకుండము నుండి మహాప్రసాదముగ నొసగినాడని తెలిపెను. ఆ మహారాజదంపతులు బాలుని

తమ ఔరస పుత్రుని కన్న మిన్నగ లాలించి పాలించు చుండిరి. ఆ బాలుడు అగ్నిజ్వాల నుండి వెలువడిన కారణమున నామకరణ మహోత్సవము నందు జాలంధరుడను పేరిడిరి. జాలంధరుడు దిన దినాభివృద్ధి నొందుచుండెను. ఉపనయమును సకాలమునకు జరిపించి బృహద్రధుడు జాలంధరునకు వివాహమునకు తగిన వయస్సు ఏర్పడినంతనే మంత్రి పురోహితుని తగిన కన్నియ నన్వేషింప నియోగించెను.

ఒక దినము జాలంధరుడు సులోచనతో ఇష్టాగోష్టి సలుపుచు "అమ్మా! మన ఇంటి పురోహితుడు-మంత్రి అగుపడుట లేదేమని యడిగెను. సులోచన చిరునగవులు చిందుచు "నాయనా! నీకు తగిన భార్య నన్వేషించు టకై మీ తండ్రిగారు వారిని నియోగించినారని బదులాడెను. అందులకు జలంధరుడు "అమ్మా! నాకు రానున్న భార్య యెట్లుండును? ఏమని-యడుగ, సులోచన "నాయనా! ఆమెయు నావలెనొక స్త్రీ. ఆమె రూపురేఖల యందు అందచందముల యందు సౌందర్యవతియై యుండ గలదని తెలిపినది.

ఒకదినము జాలంధరుడు తన యీడు వారలను గూడి ప్రసంగము లాడుచు- మా అమ్మ నాకొక స్త్రీని పెండ్లి చేయుదునన్నది. పెండ్లియననేమో! అద్దాన ప్రయోజమే మున్నదని తన జతగాండ్రనడిగెను. వారు పకపక నవ్వి "ఓయీ! అమాయకుడా! ప్రాయమున నున్నవాడవు. నీకు లోక పరిజ్ఞానము పూర్తిగ లోపించినటులున్నది. పురుషులు స్త్రీల జతగూడి స్వర్గ సుఖములను భవించుదురు. ఆ ఆనందము అనుభవైక వేద్యమేకాని వర్ణింపనలవిగానిది. ఆ సుఖాభిలాషచే పురుషులు కాంతలకు దాసులగు దురు. రుచిగ శుచిగ వంటలుజేసి భార్యలు పగటివేళల భర్త నోరూరునట్లు ఆశ పుట్టించుదురు. రాత్రివేళల మగని కౌగిట జేరి తొడకు తొడజేర్చి సుఖోపభోగములు నొసగుదురని వివరించిరి. జాలంధరుడు వారాడు మాటలను పరిపూర్ణముగ గ్రహింపజాలకుండెను. అంతనా మూర్ఖపు బాలురు తమ మర్మాంగములను చేయిపైగలతో జూపి కిలకిల నవ్విరి.

తన యీడు బాలుర మాటలు చర్యలు జాలంధరునకు ఏవగింపు గావించినవి. తలగిరగిర తిరిగినది. కొంత వడికి తెప్పరిల్లుకొని తనలో తానిట్లాలోచించెను. "ఔరా! లోకముతీరు ఎంత గర్హింపదగి యున్నది? శిశ్నోదర పరాయణులై మానవులు తమ జీవితమును వ్యర్థము గావించు కొనుచున్నారు. మనకెయ్యది జన్మ నొసగుటకు ఉత్పత్తి స్థానమో అద్దానిని



గౌరవ భావమున భావింపక సుఖాభిలాషచే కించ పరచుట భావ్యముకాదు. నన్ను పెండ్లియాడనున్న వనిత మాతల్లిని బోలియుండుటచే నాకు మాతృసమానురాలుగ మన్నన సేయ దగియున్నది."

స్త్రీజాతి మాన్యమైనది. స్త్రీలెల్లరునాకు వందనార్హులు. పూజింపదగిన వారని యెంచి విరాగియై రాజమందిరమును పరివారమును వదలి ఏకాకియై కీకారణ్యమును జేరెను. నగర ద్వారమును వెలువడుచుండునపుడు ద్వారపాలకులు రాజకుమారు డగుటచే అడ్డుకొని ప్రశ్నింపజాలరైరి. అయినను నగర ద్వారపాలకులు ఆ విషయ మును బృహద్రధ మహారాజు నకు నివేదించిరి. రాజు జాలందురుని జాలడ నరసి తోడ్కొని రమ్మని భటుల నెందఱినో నలుదెసల కంపెను. కాని ప్రయోజనము లేదాయెను. ఎవరిదారివారిదైనది.

బృహద్రధమహారాజు, మహారాణి సులోచన, హవ్యవాహనుని వరప్రసాది రాజప్రాసాదమున నుండక, ఏకాకియై యెచటి కేగెనో ఎట్లున్నవాడో యేమోయని దీర్ఘాలోచన పరవశులై చింతిల్లసాగిరి. అమాత్య శేఖరుడు "మహారాజా! జాలంధరుడు జాతవేదుని వరప్రసాది, మీదు మిక్కిలి అయోనిజుడు, దైవాంశ సంభూతుడు. మహాకారణ మేదియో ఆయన నిష్క్రమణకు ప్రేరణగావించి యుండును. ఏది యెట్టులున్నను క్షేమముగ మరలిరాగలడని" రాజ దంపతుల నూరడించెను.

జాలంధరుడు సాంద్రారణ్య గర్భమును జొచ్చి యందలి యొక గుహయందు మార్గయాసక్లేశము నపనయించుకొనుటకై విశ్రాంతిగ పవ్వళించి నిద్రాదేవి ఒడిలో చేరిపోయెను. సూర్యుడస్తమించెను. చిమ్మచీకటు లావరించినవి. అరణ్యము నందు అగ్ని ప్రజ్వరిల్లి నలుదెసల గ్రమ్ముకొనినది. అగ్ని జ్వాలలు జాలంధరుడు పవ్వళించిన గుహను సమీపించినవి. అగ్నిదేవుడు జాలంధరుని జూచి తన వానిగ గుర్తెఱిగి వేడి నుపసంహరించు కొని మానవరూపమును ధరించి "నాయనా! నీవీకాకులు దూరిన కారడవి యందు ప్రవేశింపనేల?" యని సాదరముగ నడిగెను.

జాలంధరుడు "మహానుభావా! తామెవరు? బాంధవాను రాగమున నన్ను ఆప్యాయముగ పలుకరింప నెంచి యీ గుహకడకేగుదెంచినారు. తామెవర"ని చేతులు జోడించి యడిగెను. అందులకు అగ్నిదేవుడు వరుసకు నీకు నేను మాతామహుడ నగుదును"ననెను.

అగ్నిదేవుడినట్లు జాలంధరునితో ప్రీతిపూర్వకముగ మాటలాడి "వత్సా! నీకేమి వరము కావలయునో కోరుకొనుము. అవశ్యము ప్రసాదించుదు" ననెను. అందులకు జాలంధరుడు "మహానుభావా! హవ్యవాహనా! నా మనమున నెట్టి కోరికయును లేదు. ప్రాజ్ఞుడు కోరికలను కూకటి వ్రేళ్లతో తెగద్రుంచి ప్రశాంత చిత్తమున బ్రహ్మాను భవము ననుభవించుట మీకు తెలియనిదికాదు. మానవ జన్మలభించినందులకు కోరికల ఊబిలోదగుల్కొని విలవిలాడుట కన్న అవివేకమేమున్నది? జన్మమెత్తిన ప్రతియొక ప్రాణి గిట్టుట విధాయకము. అయినను చచ్చిన పిదప మరల జన్మమెత్తని విధముగ కోరికలను లయమొనరించి చిత్తమును ఈశ్వరాయత్తముగావించి శ్రీ కైవల్య పదమును జేరుటకు మానవ జన్మ మాన్యమైనది. నా జన్మ చరితార్థమగునట్లు దయజూడుము. నాకు చిరంజీవిత్వమును ప్రసాదించి ముల్లోకముల యందు నాపేరు స్థిరముగ నుండునట్లు అనుగ్రహింపు"మని ప్రార్థించెను.



జాలంధరుని పలుకులు హవ్యవాహనునకు హాయిగొలిపెను. ప్రాయము నందు పిన్నవాడైనను ప్రతిభా విశేషమున మిన్నయని సంతసించి, జాగుసేయక జాలంధరుని తన భుజములపై నెక్కించుకొని శ్రీదత్తభగవానుల కడకేగెను. శ్రీదత్త గురుదేవులు అగ్నిదేవుడు తన కడకు వచ్చుటను సంతసించెను. అనసూయా నందనుడు వెంటనే లేచి అగ్నిదేవుని నాలింగనమొనరించి సగౌరవముగ సత్కరించి రాకకు కారణ మెయ్యదియని చిరునగవులొలికించుచు నడిగి-జాలంధరుని గాంచి యీ బాలుడెవరని యడిగెను.

దత్తాత్రేయునితో అగ్నిదేవుడు "అత్రినందనా! త్రినేత్రుని కంటి మంటలకు మన్మథుడు భస్మసాత్కృడగుట జగద్విదితము. ఆ మన్మధుడు నాయందు నిగూఢముగ నుండి బృహద్రథుడను రాజొనరించు యజ్ఞకుండమున బాలునిగ వెలిసినాడు. ఈ బాలుని పేరు జాలంధరుడు. ఈ బాలుని మీప్రియతమ శిష్యునిగ నెంచి అనుగ్రహిం చిన చిరంజీవియై లోక కళ్యాణమును నెరపుచు ప్రపంచము నుద్ధరింప గలడు. ఈ బాలుడు నవనారాయణులలో నొకడగు అంతరిక్షుని యంశమున వెలసియున్నవాడు. ఆ కారణమున మీ యనుగ్రహమునకు పాత్రుడై శిష్యునిగ వర్ధిల్లగలడు. మీ వరద హస్తము నీ బాలుని శిరముపై నిడి హస్తమస్తక సంయోగమున ప్రభావితుని గావింపు మని" విన్నవించెను. అమృతోప మానములగు





జాతవేదుని పలుకులు దత్తభగవాను నలరింపజేసినవి. నీతిహోత్రుని అభ్యర్థనముపై అనసూయానందనుడు జాలంధరుని తన తొడపై కూర్చుండబెట్టుకొని శిరముపై తన వరదహస్తము నుంచెను. కుడిచెవి యందు సిద్ధమంత్రమునుపదేశించెను. మంత్రపదేశ ప్రభావమున జాలంధరుని మాంసమయ శరీరము మంత్రమయమైనది. హస్తమస్తక సంయోగ ప్రభావమున అలఘుస్థావర జంగమాత్మకమగు దృశ్యప్రపంచము బ్రహ్మపదార్థముగ భాసించినది. నీవు నేనను భేదబుద్ధి నశించినది. ఎనుబదినాలుగు లక్షల జీవరాసుల యందు తనను-తనయందు ఎనుబది నాలుగు లక్షల జీవరాసులను అద్దము పట్టినట్లు చూడగలిగెను.

అగ్నిదేవుడు జాలంధుని అనసూయానందనుని కడజేర్చి అంతర్హితు డాయెను. జాలంధరుడు దత్తగురుదేవులతో బాటు పర్వతారణ్య ప్రాంతముల యందు సంచ రించుచు-గంగాస్నానము సలుపుచు కాశీవిశ్వనాధుని సందర్శించుచు, కొల్హాపురమున భిక్షను గ్రహించుచు, పాంచాలేశ్వరము భిక్షాన్నమును భుజించుచు, మాతాపురము నందు నిదురబోవుచుండెను. ఇట్లు పంద్రెండు సంవత్సరములు గడిచిపోయినవి. శిష్యవాత్సల్యమున శ్రీదత్తదేవుడు జాలంధరునకు సమస్త విద్యలను బోధించెను. మంత్ర శాస్త్రమును పూర్వోత్తరాంగన్యాస సహితముగ నుపదేశించెను. అస్త్రవిద్య యందు అసమాన పండితునిగావించెను. వాతాస్త్ర, కామాస్త్ర, పర్వతాస్త్ర, వజ్రాస్త్ర, వాసవశక్తి, నాగాస్త్ర గరుడాస్త్ర, మోహనాస్త్ర, నిరక్షాస్త్ర, దానవాస్త్రము మొదలగు సమస్తాస్త్రములను ప్రయోగోప సంహారవిధానముగ బోధించి కోవిదుని గావించినాడు.

అగ్నిదేవుని శ్రీదత్తభగవానుడు రావించి జాలంధరుని విద్యా పాటవమును వివరించెను. అగ్నిదేవుని ఆనందమే ఆనందమైనది. జాలంధరుని దేవత లెల్లరు ఆశీర్వదించుట మరియొక విశేషముగ నుండగలదని అగ్నిదేవుడు ప్రతిపాదింప దత్తభగవానుడందులకు సమ్మతించెను. అగ్నిదేవుడు జాలంధరుని భుజములపై నెక్కించుకొని దేవతల కడకు గొనిపోయెను. దేవతలు జాలంధరు నాశీర్వదించి వరముల నొసగిరి. జాలంధరుని అగ్నిదేవుడు బదరికావనమును జేర్చెను. అచట జాలంధరుడు ద్వాదశాబ్దములు ఘోరతపమాచరించెను. దేవతలు మెచ్చి జాలంధరు ననుగ్రహించిరి.

## కనీఫానాథ చరిత్ర



బదరీనాథుని సన్నిధానమున అగ్నిదేవునితో బాటు జాలంధరుడు హాయిగ కాలము గడుపుచుండెను. శివుడొక దినము బదరికాశ్రమమునకు వచ్చి అగ్నిదేవునితో నిట్లనెను.

"హవ్యవాహనా! బ్రహ్మదేవుడు సృష్టికార్య క్రమమున కుపక్రమించి సరస్వతీ దేవిని సృజించినాడు. ఆమె యుక్త వయస్కురాలైనది. బ్రహ్మ చూపులామెపై ప్రసరించి నవి. నాలుగు మోముల వేల్పు ఎనిమిది కన్నులకు సత్యలోకము నందేకాక ఎల్లలోక ముల యందు శారదా దేవికి సాటివచ్చు సౌందర్యవతి లేదనిపించినది. ముసలి వారలకు బుద్ధులు సంచలించుట సహజమేకదా!! లోక పితామహుడు కన్న కూతురని మదినెంచక, యుక్తాయుక్తమును పాటింపక కామాతురుడై గవయనుంకించెను. కంచెయే చేనుమేసి కాపేమి సేయగలదన్నట్లు, భారతీదేవి పరమేష్ఠి బారిన పడకుండ పరుగులు తీసినది. పద్మ సంభవుడు సహితము వాణి వెంట పరుగిడుచుండ ఆయన వీర్యము స్ఖలనమై హిమవన్నమగు నందు నిద్రించుచున్న ఒక ఏనుగు చెవియందు చేరినది అమోఘమగు చతురాస్యుని వీర్యము నందు నవ నారాయణులలో నొకడైన ప్రబుద్ధుని జీవాత్మ ప్రవేశించినది. బాలుని రూపమేర్పడినది. యుగములిప్పటి కెన్నియో గడిచిపోయినవి. ఆ బాలుడు చిరంజీవి యగుటయేకాక బ్రహ్మవీర్య సంభూతుడగుటయే ఏనుగు చెవియందే ఉన్నవాడు. కావున నీవు నీకు మారుడైన జాలంధరు నచటకు





గొనిపోయి ఆ బాలుని బయటకు చేర్పింపుము. ఆతడు ఏనుగు కర్ణమునుండి వెలువడినందున కానీఫాయని పిలువ బడును. నీశిష్యుని కనీఫానను గ్రహింపుమని కర్తవ్యమును బోధించెను.

అగ్నిదేవుడు శివునితో నిట్లనెను. మహాప్రభో! శివాజ్ఞ మీరరానిది. మీ ఆదేశమెల్లరకు శిరోధార్యము, అయినను ఒక విన్నపము : సృష్ట్యాదియందు బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని జూడ ఇంద్రియ స్ఖలనమై శీతశైలము నందున్న ఏనుగు కర్ణము నందు పతనమై ఇన్ని యుగములందే యున్నవాడను చున్నారు. ఇదిమున్నెన్న డును కనీవినీ యెఱుగని సరిక్రొత్త వింత విషయము. ఏనుగు చెవియందున్న బాలుని బయటకు తీయు విధానమెట్టిదో కదా! కావున ఈ కార్యక్రమము మీ పర్యవేక్షణ క్రింద జరుగుట లెస్సయన శివుడు సరి మంచిదని జాలంధరుని అగ్నిదేవుని వెంట నిడుకొని మంచుకొండకు పయనముగావించెను.

హిమగిరియందు పర్వతమును బోలిన ఏనుగువారి కంటబడినది. శివుడా గజరాజమును చూపి నేను తెలిపిన బాలుడీ ఏనుగు చెవి యందు కలడు. అయినను ఈ ఏనుగు స్థిరముగ నొకచోట నిలకడ నుండునదికాదు. కావున జాగరూకత వహించి తగిన ప్రయత్నమున బాలుని బయటకు దీయుమనెను. అంత జాలంధరుడు "ప్రభో! పరమేశ్వరా!! లోకైక ప్రపూజ్యుడగు శ్రీదత్తగురుదేవులు తన వరద హస్తమును నాశిరముపై నిడి అనుగ్రహించి యున్నాడు. దత్తప్రభువు దివ్యానుగ్రహమున కాలాంత కుడగు యముని పటాటోపమును పటాపంచలు గావించుటొక లెక్కలోనిది కాదు. అట్టి పట్ల ఈ ఏనుగెంత? దీని మిడిసి పాటెంత" యని జాలంధరుడు తన సంచిలో నుండి చిటికెడు భస్మమును గైకొని మోహనాస్త్రమునకు స్పర్శాస్త్రమును జోడించి ఏనుగు నుద్దేశించి వదలెను. ఆ భస్మమహిమచే ఏనుగు తీవ్రత ఉపశమించి నది. దేహస్మృతిని గోల్పోయినటుల కదలక మెదలక నాలుగు పాదములొక తావున జేర్చి నిలిచిపోయినది.

జాలంధరుడు శివునకు అగ్నిదేవునకు నమస్కరించి మీరిచ్చటనే యుండుడు- నేను ఏనుగు చెవియందున్న బాలుని గొనివచ్చెదనని ఏనుగు చెవి దగ్గర జేరి "నాయనా! ప్రబుద్ధ నారాయణా!! ఎంతకాలమని ఏనుగు చెవియందు అజ్ఞాతముగ నుండ దలచితివి. బయల్పడుము వత్సా! బయల్పడుము. నీవంటి సర్వసమర్థ డెందును లేడనుట సత్యేతరముకాదు

కర్ణకానీఫాయను శుభనామధేయ మును దాల్చి జగత్ప్రసిద్ధిగాంచు"మనెను. జాలంధరుని పలుకులు మంత్రాక్షరములైనవి కాబోలు. బాలుడు ఏనుగుచెవి నుండి బయల్వెడలి జాలంధరునకు సభక్తికముగ రెండు చేతులు జోడించి నమస్కరించెను. యుగముల గడిచినను ఆ బాలుడు నిత్య నూతన నవ యౌవన విలాసములతో పదునారేండ్ల బాలునిగ తేజరిల్లు చుండెను. జాలంధరుడా బాలుని తన భుజముపై నిడుకొని శివుని చెంత జేర్చ నాయువకుడు శివునకు ప్రణామము లర్పించెను. అటు పిమ్మట అగ్ని దేవునకు నమస్కరించెను.

శివుడాత్యాదరమున రెండు చేతులు చాచి కానీఫాను తన తొడపై కూర్చుండ బెట్టుకొని జాలంధరునితో "నీవీ బాలునను గ్రహింపుము. నీ యనుగ్రహ విశేషమున కానీఫా అజ్ఞానము సూర్యరశ్మికి మంచుకప్పువలె విడిపోగలదు. జ్ఞానియై లోకము నుద్ధరింపగలడని" యాదేశించెను.

ఒక సుముహూర్తమున జాలంధరుడు కానీఫా మస్తకముపై తన వరద హస్తమునుంచి సమస్త మంత్రములనుపదేశించెను. మంత్రో పదేశఫలితముగ కానీఫాకు ఈ మాయమేయ జగము బ్రహ్మస్వరూపమై భాసించినది. తన ఆత్మ విశ్వవ్యాపకమను నిశ్చయ జ్ఞానము కలిగినది. అంతవారు నలువురు బదరికా శ్రమమును చేరిరి. అగ్నిదేవుడు జాలంధరునితో కానీఫాకు దత్తభగవానుని సందర్శన మును కల్పించి దత్తానుగ్రహ పాత్రుని గావింపుమని తెలిపి అంతర్హితుడాయెను.

శివుని సన్నిధానమున అగ్నిదేవుడు జాలంధరుడు ఆరునెలల కాలముండిరి. ఈ వ్యవధియందు జాలంధరుడు తాను దత్తభగవానుని వలన ఉపదేశము నొందిన మంత్ర విద్యను కానీఫాకు బోధించెను. కాని ఏనుగుచెవి నుండి వెలువడిన వాడని యెంచి వాతాకర్షణ సంజీవిని మంత్రముల నుపదేశింపడాయెను. శివుడు జాలంధరు నితో "నీ శిష్యుడగు కానీఫాకు దేవతల నెల్లరనాహ్వానించి వారి వలన వరములను ప్రసాదింప జేయుమనెను. శుభమస్తు అని జాలంధరుడు స్తవనాస్త్రమును జపించి దేవతల నెల్లర నాహ్వానింప వారెల్లరు విమానారూఢులై యరుదెంచిరి. జాలంధరుడు దేవతలతో "వేల్పులారా! ఈ కానీఫా నాశిష్యుడు. మీ అనుగ్రహము నాతనిపై వర్షింపజేసిన నాతడు లోకకళ్యాణ మొనరింప సమర్థుడగుననివిన్నవించెను.





అందులకు బృందారక బృందము ఏకగ్రీవముగ "అయ్యా! నీవు అగ్నిదేవుని పుత్రడవు. దత్త ప్రభువు ముఖ్యశిష్యుడవగుటజేసి మేము నీకు వరములను ప్రసాదించి తిమి. అయినవారి నెల్లరననుగ్రహించుచు వరములొసగుట కాని పని యని నిర్మొహమాటముగ పలికి తమతమ విమానముల నధిరోహించి వెడలనుద్యమించిరి. జాలంధరునకు దేవతల సమాధానము కోపకారణమైనది. తన ప్రభావమును ప్రకటింప నెంచి కొంత భస్మమును గ్రహించి వాతాస్త్రము నభిమంత్రించి ఆకసము వంక వదలెను. దివౌకసుల విమానములు గగన భాగమున బొంగరముల వలె గిరగిరలాడదొడగినవి. పైకెగేసి వేగమును పుంజుకొన జాలవాయెను.

దేవతల కదికోపకారణమైనది. దేవేంద్రుడు వజ్రాయుధమును, వరుణుడు జలదాస్త్రమును, అశ్వినీదేవతలు ధూమ్రాస్త్రమును, గంధర్వులు పర్వతాస్త్రములను మిగిలిన దేవతలు తమ తమ అస్త్రములను జాలంధునిపై నుపయోగించిరి. శివకేశవు లీపోరాట మెట్లు పరిణమించునోయని వేడుకమీర చూచుచుండిరి. దేవతలు తనపై ప్రయోగించిన అస్త్రములను నిర్వీర్యమొనరింప జాలంధరుడు మోహనాస్త్రమును ప్రయోగింప దేవతలు ప్రయోగించిన అస్త్రములన్నియు జాలంధరునకు నమస్కరించి ఏయస్త్రము నెవరు ప్రయోగించిరో వారికడకే మరలిపోయినవి. దేవతలు అగ్రహోదగ్రులై ఖడ్గములు త్రిశూలములు గదలు, ముద్గరచక్రకులిశాయుధములను చేదాల్చి జాలంధరునిపై విజృంభింప నేగుదెంచు చుండిరి.

దేవతల బింకమును వమ్ముసేయ జాలంధరుడు కామినీ అస్త్రము నుప యోగించెను. ఆ అస్త్రమహిమ వలన రంభ, ఊర్వశి, మేనక ఘృతాచి తిలోత్తమ మున్నగు అమరవేశ్యలు పదునారు వేలమంది దివినుండి భువికి దిగివచ్చి హోయ లొలికించుచు విలాసముగ దేవతల చెంత జేరిరి. దేవతలు తమ శస్త్రములను వదలి కుసుమాస్త్రుని పూలబాణముల వంటి పూబోణుల వెంటబడిరి. అప్సరో భామినులు బదరికావన మందలి ముండ్ల చెట్ల నెక్కిరి. తమ తియ్యని కోరికను తిక మక బెట్టక వేవేగ తీర్పుమనియా వారవన జేక్షణలను దేవతలు ముండ్ల చెట్లపై జేరి వేడుకొనిరి. జాలంధరుడు అమర వేశ్యలపై స్పర్శాస్త్రముపై నుపయోగించెను. ఆ అస్త్ర ప్రభావమును స్త్రీలెల్లరు భూమి నంటుకొని కదలజాలరైరి. స్త్రీ వ్యామోహ మగ్నలమై దేవతలు ముండ్ల

చెట్లను వదలి భూమిపై నున్న సురలోక సుందరీమణులను బిగికౌగిట జేర్పక్రిందికి దిగివచ్చు సమయమున జాలంధరుడు వారిపై స్పర్శాస్త్రము నుపయోగింపవారి పాదములు ముండ్ల చెట్లకు హత్తుకొనిపోయినవి. దేవతలు తలక్రిందులుగ వ్రేలాడు చుండిరి. అమరవేశ్యలు దేవతలు ధరించిన వస్త్రములను తొలగించిరి. దేవతలెల్లరు దిగంబరులై తలక్రిందులగు వ్రేలాడుచుండిరి.

జాలంధరుడు కానీఫాను దేవతలకు వస్త్రముల నొసగి మానము కాపాడు మనెను. అంత నామహితాత్ముడు విభక్తాస్త్రమునుపయోగించి స్పర్శాస్త్రపటి మను తొలగించెను. కానీఫా యొసగిన వలువలు దేవతలు ధరించిరి. కానీఫా ఔదార్య మునకు దేవతలు మెచ్చి తలూచి యాతనికి వరములను ప్రసాదించిరి. జాలంధరుని క్షమింపగోరిరి.

జాలంధరుడు దేవతలతో నాథాసంప్రదాయమునకు చెందిన మేము శాబరీ మంత్రశాస్త్రమును రచించియున్నాము. ఆ మంత్రముల యందు ఏ దేవుని పేరు ఉచ్ఛరింప బడునో ఆ వేల్పు ప్రత్యక్షమై మా సంకల్పమునకు నిండుదనమును గూర్పుమనెను. దేవతలు అట్లే యగుగాక! యని పలికి విమానారూఢులై తమ తమ నెలవులకేగిరి. శివుడు విష్ణువు జాలంధర కానీఫాలతో కలసి మూడు దినములు బదరికాశ్రమమున నుండిరి.

శివకేశవులు జాలంధరుడు ముప్పురును దేవతలకిది వరకెన్నడు, నిట్టి భంగపాటు జరిగి యుండలేదనుచు కానీఫాశక్తి సామర్థ్యములను ప్రశంసించిరి. అంత శివుడు జాలంధరుని జూచి "యోగివర్యా! జాలంధరా! ఇకపై జరుగనున్న దినములలో కలి ప్రభావమత్యతిశయముగ విజృంభింప గలదు. వేద విద్యలు వైదిక మంత్రములను కలికల్మష చిత్తులు మానవులు పఠించి యవ్వాని ప్రభావమును ప్రదర్శింప జాలకుందురు. కావున నీవు ప్రత్యేకముగ శాబరీ మంత్రములను రచించి నాగాశ్వత్థము వద్ద మంత్ర పురశ్చరణ సలిపి దైవానుగ్రహమును బడసి యాసిద్ధ మంత్రములను నీ శిష్యుడగు కానీఫాకు ఉపదేశము నొసగుము. కానీఫాకు శిష్యులు పెక్కండ్రుగ నేర్పడుదురు. కానీఫా శిష్యుల వలన శాబర మంత్రములు భువిపై విస్తరిల్లి ప్రజల దుఃఖములను దూరముగావించుచు వారి కోరికల నీడేర్చి మేలు గూర్చును.



ఈ శాబరీ మంత్రశాస్త్రమునకు శాబరి యనుముని పుంగవుడు మూల పురుషుడు, మత్స్యేంద్రుడా మంత్రశాస్త్రమును లక్షమంత్రములుగ రూపొందించినాడు. గోరక్షుడద్దానిని పండ్రెండు కోట్ల తొమ్మిది లక్షల మంత్రములుగ విస్తరిల్ల జేసినాడు. మీననాథుడు అయిదుకోట్ల ఒకలక్షగ చర్పటనాథుడు తొమ్మిదికోట్ల ఏడులక్షలుగ – భర్తరీనాథుడు ఏడుకోట్ల నాలుగ లక్షలు–రేవణనాథుడు రెండుకోట్ల మూడు లక్షలు –వటసిద్ధనాగుడు ఒక కోటి ఒక లక్ష శాబరీ విద్యలను వృద్ధిగావించుదురు. జాలంధరుడవగు నీవలన ముప్పదినాలుగు కోట్ల పదహారులక్షలు నీశిష్యుడగు కానీఫా వలన ఆరుకోట్ల ఎనిమిది లక్షల మంత్రములు వృద్ధి కావలసియున్నది. ముందు తరముల పురుషులు సోమరులు మందబుద్ధులగు వారలగుటచే వారి క్షేమము గూర్చి నిన్ను దీక్షవహింపుమని నేనుప్రేరణ సలుపుచున్నాను. ఇందులకు కానీఫాను తపమొనరింప నాదేశము నొసగుము. శివుని యాదేశము జాలంధరునకు శిరోధార్యమైనది. విష్ణుదేవుడు గురుశిష్యులకు వరములొసగి వైకుంఠమునకేగెను. శివుడచట నిలిచెను. నలుబదికోట్ల ఇరువది లక్షలతో గూడిన మంత్రశాస్త్రమును నాగాశ్వత్థముకడ పురశ్చరణము సలుపుమని శివుడాదేశింప గురు శిష్యులటు లొనరించిరి. అటు పిమ్మట బదరికాశ్రమమునుచేరి, శివుని యానతిని గొని జాలంధరుడు తీర్థయాత్రలకై బయలుదేరుచు శివుని సన్నిధానమున పండ్రెండు సంవత్సరములు తపమొనరింపుమని జాలంధరుడు కానీఫాకు ఆదేశము నొసగెను.

జాలంధరుడనేక తీర్థములను సేవించెను. తీర్థయాత్రా పర్యటనలు సేయుచు ఆవులకు మేతనొసగుటకై పచ్చిగడ్డిని కోసి మోపులను నెత్తిపై నిడుకొనుచు కంటబడిన ఆవులకు గడ్డిని నోటికందించు చుండెను. ఇది వాయుదేవుడు చూచినాడు. వాయువు నుండి అగ్ని ఏర్పడినది. అగ్ని దేవుని కుమారుడు జాలంధరుడు. గడ్డి మోపుల బరువును జాలంధరుడు నెత్తిపై నిడుకొని భారము మోయుశ్రమ లేకుండునటుల ఆ గడ్డి మోపులు జాలంధరుని వెంటగాలిలో తేలియాడుచు వచ్చునటులొనరించెను.

జాలంధరుడటుల గోవులకు గ్రాసమునిడుచు యాత్రా సందర్భమున హేలా పట్టణమను చేరెను. హేలా పట్టణవాసులు జాలంధరుని తలపై గొడుగుపట్టినట్లు గడ్డి మోపులు గాలిలో కదలి యాడుటను చూచినారు. ఇక తెలుపవలసినదేమున్నది? ఆయన సాటిలేని మేటి మహామహితాత్ముడని

ఆ బాలగోపాలము ఆయన పాదములపై వ్రాలదొడగిరి. నమస్కార తిరస్కారములను సమభావమున జూచు మహనీయుల చర్యలు లోకాతీతముగదా? జాలంధరుడు వారి వంక కన్నెత్తి చూడక కంటబడిన ఆవులకు గడ్డినొసగుచు పిచ్చివానివలె సంచరించుచుండెను. జనసంచారము లేని యొకసందులో మురికి కాలువ గట్టున విశ్రాంతిగ కూర్చొనుచు భిక్షకై పట్టణము నందు ప్రవేశించుచుండెను.

ఆదినములలో హేలాపట్టణమును త్రిలోచనుడను రాజకుమారుడ గోపీచందు పరిపాలించు చుండెను. గోపీచందు మిక్కిలి అందగాడు, సకలైశ్వర్య సంపన్నుడు. పండ్రెండు లక్షల గుఱ్ఱములు, పదివేల మదమత్తేభములు అపారమగు సైనిక సంపదచే ఏపుమీరియుండెను. ఆ రాజకుమారునకు పదునారు వందల సుందరాంగనలు భార్యలుగ నుండిరి. చక్కని చుక్కలగు ఆ రాణులతో గోపీచందు తారాపథమున చంద్రునివలె విలాసముగ విహరించువాడు. గోపీచందు తల్లి మైనావతి. సుగుణాల వాల. ఒకదినము రాజమాత అంతఃపురమున నుండ జాలంధరుని నెత్తిపై గడ్డి మోపులు తేలియాడుటను జూచి అమితాశ్చర్యము నొందినది. ఆయన ఒక మహా మహితాత్ముడో, దివి నుండి భువికి దిగివచ్చిన దేవుడై యుండనోపునని ఆమె అంత రాత్మ ప్రభోదమొనరించినది. "శరీరము బుద్బుదప్రాయము. దీపముండగనే ఇల్లు చక్కదిద్దుకొనుట లెస్స, అటులనే దేహమునందు ఊపిరాడుచున్నపుడే మహనీయుల నాశ్రియంచి జన్మసా ఫల్యమునకై పాటుపడుట కర్తవ్యమని" మైనావతి కృతనిశ్చయు రాలైనది. తెప్పపాటు కాలమైనను జాగొనరింపక దాసిని పిలిచి ఆమెతో ఇట్లన్నది.

"ఓసీ! నీవు నాకొక కార్యమును చక్కదిద్దవలయును. అదెద్దియన గడ్డిమోపులు గాలిలో పయనించు చుండ రాచమార్గమున పయనించుచున్న అతడు గొప్ప మహాత్ము దని తెలుపకయే తెలియుచున్నది. ఆ మహానుభావుని సేవించి జన్మ చరితార్థము గావించుట నాతలంపైయున్నది. నీవు ఆయన ఎచట నుండునది తెలిసికొనుటకై ఆయన ననుసరించి వెళ్ళుము. నీవీ పనిని అతిరహస్యముగ నాచరింపుము".

పరిచారిక ఏదో కార్యావరమున్నటుల బయలు దేరినది-జాలంధరుడు పగలెల్లను గోవులకు గ్రాసము నిడుచు ప్రొద్దు గ్రుంకి నంతనే జనసంచారములేని యొక సందులో మురికి కాల్వకడ విశ్రాంతిగ కూర్చొని,



యోగనిష్ఠా గరిష్ఠుడై యుండెను. పరిచారిక, రాజమాత యగుమైనావతికడకు మరలివచ్చి "అమ్మా! ఆయన ఎవరో ఏమోకాని కుక్కలు పందులు సహితము ముక్కువజూపని మురికి కాలువ చెంత కన్నులు మూసికొని ఏదో పరధ్యానమున నుండునని" తెలిపినది. మైనావతి పరిచారికను చెంత నుంచుకొని అర్థరాత్రి సమయమున జనసమ్మర్థము తగ్గినంతనే ఆ మహనీయుని సందర్శన భాగ్యమును పొందుటకై బయలుదేరినది. రాత్రి రెండు ఝాములు గడిచినవి. నల్లని మేలిముసుగుతో నరుల కంటబడకుండ మైనావతి జాలంధరుడున్న తావును చేరినది. తాదెచ్చిన మధురాహారములట నుంచి ఆయన పాదపద్మములకు నమస్కరించి "మహాత్మా! మీరు త్రికాలజ్ఞులేకాదు. త్రిగుణాతీతులు, త్రిమూర్తి స్వరూపులగు అపర దత్తాత్రేయులని నామదికి తోచుచున్నది. సంసార తాపత్రయములతో తల్లడిల్లు వారలకు జ్ఞానభిక్షనొసగి తరింప సర్వసమర్థులగు మీపాదములే నాకిక శరణ్యము. నన్నుదయజూడుమని" ప్రార్థించినది.

మైనావతి చిత్తశుద్ధి పరీక్షింపనెంచి జాలంధరుడు పిశాచగ్రస్తునివలె నటించుచు పో, పొమ్మని గద్దించి ఆమెను పరుగులు దీయించ రాళ్లురువ్వినాడు. మైనావతి ముముక్షువగుటచే స్వామివారి చేష్టలు తన నిజభక్తిని పరీక్షించుటకేయని మదిదలచి చలింపకుండెను. ఆమె మొక్కవోవని భక్తినీ – ఆధ్యాత్మిక దృక్పథమునకు జాలంధరుడు సంతసించి "అమ్మా! నీవెవరు? ఈ నిశీథమున దుర్వాసన లీను యీమలిన ప్రదేశమునకు రానేల? నీ మనమున గల కోరిక యెట్టిది? నీభర్త ఎవరు? నాధ్యాన నిష్ఠనుభంగమొనరించుటకై విచ్చేసితివా యేమని" యడిగెను. అందులకు మైనావతి "మహాత్మా! ఈ దేశము నేలిన త్రిలోచనుడను మహారాజు భార్యను నేను. నన్ను మైనావతి యనెదరు. కాలము దీరి నాభర్త కన్నుమూసినాడు. పుట్టిన ప్రతి యొక ప్రాణి యొక దినమున కాలగర్భమున కలిసిపోవుట సహజమేకదా? అయినను మానవ జన్మ లభించిన పుణ్యవిశేషమున మీ బోటి మహనీయుల పాదముల నాశ్ర యించి జన్మరాహిత్యమునకై పాటుపడుట లెస్స యని మీపాద పద్మముల నాశ్ర యించినదాన" ననెను.

అందులకు జాలంధరుడు "అమ్మా! నీవిపుడెవరి యాశ్రయమున నున్నదానవన" ఆమె తన కుమారుడు గోపీచందు బంగాళ దేశమునకు

ప్రభువై ప్రజలను పరిపాలించుచున్నాడని సమాధాన మొసగిమరల, రాజ్యభోగములు సుఖ సంపదలు అశాశ్వతములు. జనన మరణ ప్రవాహ రూపమగు సంసారమను విషవల యము నుండి నన్ను సముద్ధరింప నిన్నా శ్రయించి యున్నదాన"ననెను. అందులకు జాలంధరుడు "సుమతీ, నేను పిచ్చివాడను. నన్నాశ్రయించుటవలన నీకెట్టి ప్రయోజనము లభింపగలదు? చిత్తమును ఈశ్వరాయత్త మొనరించిన నదియే మోక్షమునకు దారితీయగలదు. రాజమాతవు నీవిచట క్షణమైనను నిలువక నీ నివాసమున కేగుము. నీకుమారున కీవిషయము తెలిసిన అనర్థములు వాటిల్లును. పో, పొమ్మని" సౌమ్యముగ తెలిపెను. ఆమె చిత్తము, మహాభాగ్యమని వచ్చిన త్రోవ బట్టి తెల్లవారకమునుపె పరిచారిక త్రోవ జూప అంతఃపురమును చేరినది.

జాలంధరునిపై గల భక్తినానాటికి మైనావతికి పెంపెసలార దొడగినది. ఆరు నెలలు కాలము అర్ధరాత్రి యందు మైనావతి స్వామి వారున్న తావును జేరి పాదసేవలు సలుపుచు తన అంతఃపురమునకు తొలికోడి కూయకమునుపే చేరు చుండినది.

యథాప్రకారముగ నొకదినము కటికచీకటి యందు మైనావతి స్వామివారికి సపర్యలొనరింప వెళ్లినది. ఆనాడు స్వామివారు మైనావతి తొడపై తన శిరము నుండి గాఢనిద్రాపరవశుడాయెను. జాలంధరుని సంకల్పమున నొక పురుగు మైనావతి తొడను తొలచుచుండ రక్తము కారుచుండినది. క్షత్రియకాంత కావున ఆ బాధ నోర్చుకొనుచు స్వామి వారికి నిద్రాభంగము గావింపరాదని కదలక మెదలక నట్లే యుండినది. ఆమె తొడనంతయు తొలిచిన పిదప నాపురుగు జాలంధరుని మెడపై తొలువ నారంభించెను. జాలంధరుడు దిగ్గునలేచి యది యేమని చూచినాడు. మైనావతి చీర రక్తసిక్తమై యుండినది. ఆమెతొడ యందు పురుగు తొలుచుటచే నట్లయి యుండునని జాలంధరుడామె తొడను అభయహస్తముచే స్పృశింప మైనావతి తొడ తొల్లింటివలెనైనది. మైనావతి దృఢభక్తికి మెచ్చి జాలంధరుడామె కుడిచెవి యందు తారక మంత్రము నుపదేశించుచు తనవరద హస్తము నామె శిరముపై నుంచెను. హస్తమస్తక సంయోగ విశేషమునను, తారక మంత్రోపదేశ ఫలితముగ మైనావతికి ఈ మాయామేయ జగము బ్రహ్మస్వరూపమై భాసించినది. అంతా

రామమయమని పించినది. అనిపించుట యేమి? ఈశ్వరుని అనంత మాయా విలాసనాటకరంగమంతము రాముడై కన్నులకు గట్టినట్లు కాన్పింప మొదలిడినది. రాముడు కానిదెద్దియు మైనావతికి కానరాకుండినది. ఆమె అంతరంగమున నున్న రాముని దివ్య స్వరూపమే ఎందుజూచినను ప్రతిబింబముగ నగుపడుచుండినది. రాముడేమైనావతి, మైనావతియే రాముడను ప్రత్యక్షానుభవము సిద్ధించినది. ఇట్లు కొన్ని ఘడియలు గడిచిపోయినవి. లౌకిక మర్యాదలను పాటించి గురువునకు నమస్కరింప "చిరంజీవ - సుఖీభవ" యని జాలంధరుడు మైనావతి నాశీర్వదించెను. రమ్యమైన రామనామము నందలి రుచిననుభవించినది. జన్మసాఫల్యమైన దని సంతసించినది. పరిచారికను వెంటనిడుకొని ఎప్పటివలె అంతః పురమును జేరినది.

అది మాఘమాసము. ప్రాతఃకాలము నందు చలిగనుండుటయే మైనావతి సౌధాగ్రమున వసారాయందు సూర్యరశ్మికి నిలచి యుండినది. ఒకించుక సేపమయినది. ఆమెదృష్టి తనకుమారుడగు గోపీచందుపై ప్రసరించినది. శ్రీ గంధపు పలకబల్లపై రతనములు తాపిన బంగారు పీఠముపై తనకుమారుడు గోపీచందు కూర్చొని దంతధావనము సేయు ప్రయత్నమున నుండెను. మేలిమి బంగారము వంటి మేనికాంతితో వికసించిన పద్మముల వంటి నెమ్మోములతో చూడచక్కని సుందరాంగనలు పరిచర్య లొనరింప గోపీచందు కనుసన్నల మెలగు చుండిరి. మైనావతి కుమారుని వైభవమును తెప్పలల్లార్పక జూచినది. దీర్ఘముగ నిట్టూర్పు వదలి తలపంకించినది- తన భర్తయగు త్రిలోచనుడు సహితము రమణీయ రాజ్య భోగముల ననంతవైభవముగ ననుభవించుట ఆమెకు తెలియనిది కాదు. ఈ భోగములు వైభోగములెన్నినాళ్ళు? ఈ తోలు శరీరమునందు ఊపిరాడుచున్నంత కాలమేకదా? కాలముదీరి కన్నుమూసినపుడు మట్టిపాలు కావలసినదేకదా? ఇది తెలియని వాడెవ్వడు? జన్మచరితార్థము గావించు కొనుటకై పాటుపడక జనులెల్లరు వ్యర్థజీవనులగుట శోచనీయము. ధర్మపరిపాలనము, ప్రజలనేలుట రాజునకు విహితమైయున్నది. అయినను మిధిలాపురాధీశుని ఆదర్శప్రాయముగ నుంచుకొని పరిపాలన మొనరించు వారు మచ్చుకైనను లేకుండుట సంతాప కరముగ నున్నది" యని ఆమె మదినెంచెను.

ఈ ప్రపంచము మిధ్య. సుదీర్ఘకాలము కలలు గనుట వంటిదని తెలిపిన వినువాడెవ్వడు? గోపీచందుతో నీవేదాంత ప్రసంగము గావించుటకు మైనావతికి అవకాశము లభింపకుండినది. లబించినను గోపీచందునకీ ప్రభోదము మెట్ట వేదాంతముగ త్రోసిపుచ్చితన పలుకుల ననాదరము సేయునని సందేహించినది. తల్లిగ తన ధర్మమునునిర్వహింప నిశ్చయము గావించుకొనినది. కుమారుడగు గోపీచందు అనుభవించు సుఖములు తృణప్రాయములు, మీసాలపై తేనియవంటివి. కఫము నందు బడిన ఈగవలె క్షణిక సుఖముల ననుభవించుచు పునరావృత్తి రహితమగు శాశ్వత బ్రహ్మలోకమునకు పెడమొగము వైచియున్నాడను బాధ ఆమెను తీవ్రముగ కలచివైచినది. తల్లి హృదయము తల్లడిల్లినది. కన్నులు అశ్రు తీవ్రముగ కలచివైచినది. తల్లి హృదయము తల్లడిల్లినది. కన్నులు అశ్రుపూరితమ్ములైనవి. మేడదిగువ భాగమున సువర్ణ పీఠముపై సుఖాసీనుడై యున్న గోపీచందుపై కన్నీటి బిందువులు వానచినుకుల వలె రాలినవి.

గోపీచందు తనపై నీటి బిందువులు పడుట యేమని తలపైకెత్తి చూచినాడు. కన్నతల్లి శోకదేవతవలె దుఃఖముచే దురపిల్లుటను చూచి చింతించినాడు. దంతధావనమును త్వరితగతిని ముగించుకొని వేవేగ మేడపైకి వెళ్ళి తల్లి పాదములకు నమస్కరించి "తల్లీ! నీ విచారమునకు హేతువేమి? నీవిట్లు విలపింపనేల? పరుష వాక్యములచే నవనీత కోమలమగు నీహృదయమును నొప్పించిన వారెవరు? నా భార్యలలో నెవరైన నిన్ను చులకనచేసి తూలనాడిరా? నీవు తెలిపినంతనే వారిని నీ కట్టెదుట కఠినముగ శిక్షించువాడను. లేక నావలన నీకేమైన అపచారము జరిగిన శిక్షాపాత్రుడనగుదును. తల్లిని సంతోష పరుప జాలని వాడు పుట్టలోని చెదపురుగు వంటివాడు. భూదేవికి బరువుచేటు. భార్యతో కులుకులాడుచు తల్లిదండ్రులను చులకన సేయువాడు ద్విపాద పశువున కన్నఅధ మాధముడు. జననీ జనకులకు ప్రీతిగ తిండి తీర్థములను సవరింపక భార్యా పుత్రులతో కడుపు నింపుకొనువాడు పందితో సమానము. భార్యను తూగుటుయ్యెల పైనుంచి తల్లిని తన ఇంటి దాసిగ చూచు అప్రాచ్యుని మొగము జూచిన దోషనివృత్తికి సచేల స్నానమాచరించ వలయును. తల్లిని ములుకులవంటి పలుకులచే నొప్పించుచు భార్యతో సరస సల్లాపములాడు వాడు పుట్టకమునుపె తల్లిగర్భమునందే మరణించుట లెస్సగ నుండ గలడు.





తల్లిని మించిన దైవము లేదనుట నా సిద్ధాంతము. నన్ను నీ సుపుత్రినిగ మది దలచుము. నీకోరిక అదెట్టిదైనను నా ప్రాణము లొడ్డుటకు ఈ గోపీచందు సంసిద్ధముగ నున్నవాడని విశ్వసింపుము" అని గోపీచందు తల్లి ననునయించెను.

గోపీచందు మాతృభక్తికి మైనావతి సంతసించి ఇట్లు తెలిపినది.

"పుత్రరత్నమా! నిన్ను గన్న తల్లినగు నేను ధన్యురాలను, స్పర్శావేది అరచేతి యందున్న వానికి దారిద్ర్యమెట్లు దాపురించగలదు. నాకెవ్వరి వలన బాధ కలుగ లేదని నిజముగ నమ్ముము. నా హృదయ వేదనను విప్పి చెప్పెదను, సావధానముగ వినుము.

మీ తండ్రిగారు జన్మ ప్రభృతి జన్మాంతము వరకు సకల సామ్రాజ్య లక్ష్మీపతియై ఏవుమీరి చివరకు శ్మశాన వాటిక యందు అగ్నికాహుతియై పిడికెడు బూడిదగ మిగిలిపోయెనుకదా! ఇది వరకీ ధరణీ చక్రము నేలిన వారెల్లరి గతియట్టిదేయైనది కదా! వారి రూపనామములు సహితము మరుగున పడిమాసిపోయినవి. ఏనాడో ఒకనాడు నీ పరిస్థితి యట్లు పరిణమించుట అనివార్యమని తోచినంతనే నాదుఃఖము పెల్లుబికి కన్నీటి ధారలై నీపై బడినవి. ఎలుకను కబళింప పాము – గోవును సంహరింప శార్దూలమువలె నెంత వానినైనను మృత్యువు గ్రహింప వేచియుండును. పామును బుట్టలో నుంచి నటుల పెద్దపులిని బోనులో బంధించునటుల మృత్యువు లేని జీవమును సాధించుటకు మారుతాత్కాలిక సుఖము లేశాశ్వతమని నీవు కాలము వ్యర్థపుచ్చుట నాకు సంతాపమును గూర్చినది. శ్రీరామచంద్రుని పాదముల నాశ్రయించి విభీషణుడు, శ్రీమన్నారాయణుని సదాభజించుచు నారదుడు చిరంజీవులగుట మనము పెద్దల వలన వినుచుందుముకదా! నీవును సద్గురువు నాశ్రయించి జన్మ సాఫల్యమునకై పాటుపడుము.

కుమారా! నా హితవు మాటలను శ్రద్ధగ నాలకింపుము. మానవజన్మ కడు దుర్లభమైనది. మాన్యమైన యీ జన్మయందే శాశ్వత సుఖములను బడయుటకై పాటుపడవలయును. జనన మరణ ప్రవాహరూపమైనది సంసారము. దుస్తరమైనది అనగా దాటుటకు వీలుకానిది సంసారము. అన్నింటి కన్నను భయంకరమైనది మరణము. ఈ సంసారసాగరము నుండి

సముద్ధరించునది బ్రహ్మవిద్య. ఈ విద్యను నారదమునీంద్రుడు విష్ణుదేవుని వలన ఉపదేశము నొంది వ్యాసభగవానునకు బోధించెను. వ్యాసమహర్షి తన తనయుడగు శుకమహర్షికి తెలిపెను. శుకుని శిష్యుల వలననీ బ్రహ్మవిద్య నేడు భూలోకమున ప్రచారములో నున్నది. నేటికిని దత్త భగవానుని వలన నాథసంప్రాదాయమను నది మహనీయులలో నీ విద్య ప్రచారము నొందియున్నది. దత్త భగవానుడీవిద్యను తన తండ్రియగు అత్రి మహామునీంద్రుని వలన ఉపదేశము నొందెను. అత్రిమహాముని తన తండ్రియగు బ్రహ్మదేవుని వలన నీ విద్యను గ్రహించినాడు. శ్రీమహావిష్ణువు హంస రూపమున బ్రహ్మదేవునకు ఉపదేశమునిచ్చియున్నాడు. నీవీ బ్రహ్మవిద్యను తెలిసికొని తరించుటకు మారు ప్రాపంచిక వ్యవహారముల యందు చిక్కుపడి యున్నావని దుఃఖము నొంద నది కన్నీరై నీపై పడినదని మైనావతి తెలిపి-సద్గురువు నాశ్రయించి మేలుగాంచుమనెను.

అందులకు గోపీచందు తల్లితో నిట్లనెను.

"అమ్మా! నీవు తెలుపునది పారమార్థిక సత్యమని నేనును విశ్వసించు దును. జననమరణములను విషవలయమునుండి తరింపజేయు బ్రహ్మవిద్యను తెలిసిన మహనీయులు మనకు లభించవలయును కదా? వారెచటనున్న వారోయేమో" యన మైనావతి "నాయనా! మన అదృష్టవశమున మన పట్టణమునందే "జాలంధరు" అను మహా మహితాత్ముడు కలడు. ఆయన నాథసంప్రదాయమునకు చెందినవాడే! నీవా మహానుభావుని పాదపద్మముల నాశ్రయించి బ్రహ్మవిద్యను తెలిసికొని ధన్యుడవు గమ్ము. మనకంటి కనుపడున దంతయును కల్ల. కానరానిదేదో అదియే బ్రహ్మము. ఆ బ్రహ్మమును తెలిసిననాడే బ్రహ్మవేత్త. నాయనా! కుమారా!! గోపీచందూ ! నా మాటను విని నీవా మహితాత్మునా శ్రయింపుము" అను బుజ్జగింపు మాటలతో తెలిపినది.

గోపీచందు తల్లితో నిట్లనెను.

"తల్లీ! తండ్రి హరిజేరుమనియెడు తండ్రి తండ్రి" యని ప్రహ్లాదుడు తెలిపియున్నాడు. తల్లివగుటచే నీవును బ్రహ్మమును తెలిసికొనుమని హితబోధ సలుపుచున్నావు. మంచిది - చాల సంతోషము,కట్టుకున్న ఇల్లాండ్రను, కడుపున పుట్టిన వారలను ఇప్పటికప్పుడే దిగవిడిచి,



పైతృకమగు రాజ్యమును అన్యుల పాలొనరించి సద్గురువు నాశ్రయించుట అంతమేలైన పనికాదని నా అభిప్రాయము. పండ్రెండేండ్లు పరిపాలనా వ్యవస్థను-కుటుంబ వ్యవహారములను చక్కబెట్టి అటు పిమ్మట సర్వసంగ పరిత్యాగ మొనరించి సద్గురువు పాదముల నాశ్రయించుదును.

అందులకు మైనావతి "ప్రాణికోటికి మరణమే నిమిషమున సంప్రాప్తించునో తెలుపగలవారెవ్వరు? ముల్లోకముల నేలు ఇంద్రునకు సహితము ఇడుములు తప్పకున్నవికదా? ఇక మానవులెంత? శుకుడు, ప్రహ్లాదుడు, కపిల మహర్షిని ఆదర్శ ప్రాయములగ నెంచి నామాట కాదు కూడదనక జాలంధరు మహాశయు నాశ్రయించి బ్రహ్మవిద్యనుపదేశము నొందుటకిప్పటికిప్పుడే కృతనిశ్చయుడవు కమ్మని దిట్టముగ పలికినది.

మైనావతి కుమారునితో తెలుపు హితోక్తులను గోపీచందు భార్యలలో నొకర్తులు మావంతిస్యను యను నామె చాటున నిలిచి రహస్యముగ విని తనలో నిట్లు తలపోసినది.

"ఔరా! ఏమియీ వైపరీత్యము! కొడుకు కోడలు చిలుక గోరువంకల వలె ముచ్చటగ నుండ చూచి వారిని కన్నవారు ఆనందించుట లకము తీరైయున్నది. మా అత్తగారు కఠిన హృదయురాలు. మీదు మిక్కిలి పాపాత్మురాలనుట కింత కన్నవేరొండు నిదర్శనముతో పనియేమున్నది? మంత్రులు, సామంతులు హితులు, పురోహితులు పరివారము దండనాథు లను పరిత్యజించి సన్న్యాసులకు సపర్యలు సలుపుచు చంక కొక జోలెను తగిలించుకొని ఇంటింటికేగి బిచ్చమెత్తుకొనుటను మించినదిలేదట. ఈ దుర్భోధలు నా నాథుని తలకెక్కకమునుపె నేను జాగ్రత్త వహింపకున్న మాకథ విషాదాంతముగ పరిణమింపగలదు, అని యామె తన నివాసమును చేరినది.

గోపీచందు తల్లితో "అమ్మా! నీవు తెలుపు జాలంధరుని నేను సందర్శించి ఆయన అత్యంత మహిమోపేతుడే యైన నే నాయన శిష్యుడ నౌదును. మన ఋషులు సహితము "తమసోమాజ్యోతిర్గమయ-మృత్యోర్మా అమృతంగమయ" అని తెలిపినదే నీవు నన్నాచరింపు మనుచున్నావు. సరి మంచిది-నా భవితవ్యమును తీర్చిదిద్దుకొనుట నావంతైయున్నది-నీవు

చింతిల్లకుమని తల్లికడ సెలవు గైకొని గోపీచందు క్రిందికి దిగి స్నానపానాదులు ముగించుకొని కొలువు కూటమును చేరెను.

ఉమావంతి రాణివాసముచేరి జాగుసేయక సపత్నుల కడకు దాసిని పంపి వారిని చేరదీసికొని ఇట్లు తెలిపినది "అక్కలారా! కాలమొక్క రీతి జరుగనేరదని పెద్దలాడుదురు. ఇపుడు కర్మవశమున మనకథ అడ్డముగ తిరిగినది. ఈ పట్టణమున కెవరో జాలంధరు డనుయోగి వచ్చినాడట. ఆయన తన పాదములను పట్టిన వారికి అరచేతిలో అమరలోకమును అమరించునని మన అత్తగారు చెవినిల్లు గట్టుకొని మన భర్తగారికి దుర్బోధను సేయుటను నేను మనపున్నెము కొలది విని మీతో తెలుపుచున్నాను. మన మీ విషయమున ఏమి కొంచెము నిర్లక్ష్యమొనరించిన ఇంతకాలము ఎండకన్నెరుగక ఏడంతస్థుల మేడలో అతిశయ సుఖమయ జీవితము ననుభవించిన వారము వీధి వీధుల వెంట చిప్పచేత బట్టుకొని బిచ్చమెత్తుకొను ఘోర ప్రమాదము వాటిల్లనున్నదనుట సత్యేతరము కాదు. ఇపుడు మన కర్తవ్య మేమన-మనసుండిన మార్గము లేకపోలేదు. ఏ ఉపాయము చేసైనను మనమీ ఆపదనుండి తప్పించుకొనవలయును సుమా! అదెట్లన - నేడు మన భర్తగారు ఎవరి పడక గదిని ప్రవేశించునో ఏమో తెలుపజాలము - ఆయనకు తాంబూలము నొసగుచు ఇష్టాగోష్ఠిని సలుపునపుడు - మాటల సందడిలో మన పట్టణమునకు జాలంధరుడను యోగి వచ్చియున్నాడనియు - భర్తను గోల్పోయిన దిగులును మరచుటకై రామకృష్ణయని హరినామ స్మరణమును మాని మన అత్తగారు ఆయనతో..అదే..మీకు చెప్పుటకు భయముచే నోరాడకున్నది. శివ శివ యనుచు ఇదేమి పనియని చెవులు మూసికొని; మరల అంతలోనె సరే! ఎవరి శరీర ధర్మము వారిది. తప్పులు పట్టుట న్యాయముకాదు. అది చాలదన్నటుల మిమ్ములను సహితము ఆయనకు శిష్యుని గమ్మని ప్రేరణ సలుపుచు ఒత్తిడి సేయుచున్నదని మాకు కర్ణాకర్ణికముగ తెలియుటయేకాదు. ఈ పట్టణ మంతయు కోడియై కూయుచున్నది. ఈ అతిరహస్యము బట్టబయలై "సస్వరి మా అత్త సన్నాసులనే తప్పనితరాదు లను కన్నెత్తి చూడదను సామెతను ఏనాడో మన పెద్దలు తెలివిగలిగి చెప్పిన దానిని ఉగ్గడించు చున్నారు, అని కల్లిబొల్లి మాటలచే మన భర్తగారి మనసును





ముసిముసి నగవులచే పాడొనరింపవలయును. ఇక చెప్పవలసిన దేమున్నది? మన భర్తగారి కోపాగ్నికి జాలంధరుడు ఇంధనముకా గలడు"

ఈ పథకము నమలు పరుచుటకు ఉమావంతి సపత్నురెల్లరు సమ్మతించిరి. సాయం సమయమైనది. గోపీచందు కొలువు కూటమును చాలించి ఉమావంతి సౌధమును చేరిస్నానమాచరించి భోజనాదికములను ముగించుకొని శయన మందిరమున ప్రవేశించినాడు. ప్రసంగవశమున ఉమావంతి గోపీచందుతో తెలుపవలసిన దంతయు కడునైపుణ్యముగ తెలిపినది. గోపీచందు కోపాగ్ని పరాకాష్ఠ నందు కొనినది. మాతృభక్తిపొరలు పొరలుగ విడివడిపోయి మాయలు మంత్రములచే తన మాతృదేవతను వలలో వైచికొనెను. మంత్రిని రావించెను. సేవకులచే లోతైన గోతిని త్రవ్వించి జాలంధరునందు జేర్చి రాసులుగపడియున్న గుర్రపులద్దెలచే నా గోతిని పూడిపించుటకు తీర్మానము గావించెను. ఈ రహస్యమెవరి చెవిని బడినను సేవకులందరి ప్రాణములు పైకెగసిపోగలవని కట్టడిజేసెను.



సేవకులు రాజునానతిని శిరసావహించి పూర్తిచేసిరి. అర్ధరాత్రి సమయమున అతిరహస్యముగ జరిగినందున పట్టణవాసులకు తెలియుట కవకాశమే మాత్రము లేకుండినది, మరుదినము జాలంధరుడు పట్టణమున కానరాడాయెను. గ్రామేక రాత్రం-దినమేక భుక్తం అని సన్యాసులొక చోట నిలువకుందురు. ఎచటి కేగెనో ఏమో! పాము కాళ్లు పాముకే తెలియు నన్నటుల సన్యాసుల సంచారము వారికే తెలియగలదని ప్రజలెంచిరి. పరిచారిక వలన మైనావతికి జాలంధరుడు పట్టణము వదలి వెళ్లెనని తెలిసినది. గోపీచందు ఆమహనీయునికడ బ్రహ్మోపదేశమునొందు మహద్భాగ్యమునకు నోచు కొనాడాయెను కదాయని మైనావతి విచారించినది.

జాలంధరు మహాశయుడు ద్వంద్వాతీతుడు - శత్రువు లెంతో మిత్రులంతియే! రాజభటులాయనను గోతిలో పడవైచిరని కోపము నొందలేదు. చింతిల్లలేదు. ఆకాశాస్త్ర మును పఠించుట వలన గుర్రపు లద్దెల రాసులాయనపై బడకుండ ఉపరి భాగమున నిలిచి యుండినవి. వజ్రాస్త్రమును పఠింపనవి మిద్దెకు పైకప్పు వేసినట్లు దిట్టముగ నిలిచి పోయినవి. గోపీచందు భార్యలు సంతసించిరి.

శ్రీరాములు శ్రీపాద శ్రీవల్లభాయ నమః

## అడ్బంగనాథ చరిత్ర

గోరక్‌నాథు హిమగిరి యందు పండ్రెండేండ్లు తపమొనరించినాడు. ద్వాదశ వర్షదీక్షపరిసమాప్తమైనది – తన గురుదేవులగు మత్స్యేంద్రనాథుని జూడమనసైనది. దేశ దేశములు పర్యటనము సలిపెను. ఆ పర్యటనము నందు బంగాళాదేశమును ప్రవేశించెను. బంగాళా దేశపు ప్రజలు జాలంధరుడను మహామహితాత్ముడు గోపీచందు పట్టణమున కొన్ని ఏండ్లు గడిపి ఎచటికేగెనో యేమో తెలియకున్నదని ప్రజలాడుకొనుమాటలు గోరక్‌నాథుని చెవిని బడినవి. గోపీనాథు జాలంధరనాథుని భూమిలో పూడ్చుట అతిరహస్య విషయమైనందున నెవరికిని తెలియరాకుండినది. తన గురుదేవులగు మత్స్యేంద్రుడే ఆ పేరున వెలసి యందదే తిరుగు చుండునని గోరక్‌నాథుడు మదినెంచి గోపీనాథుడేలు పట్టణమున భిక్షసేయుచు నిలిచెను. గోరక్‌నాథుడొక దినము యోగశక్తి ప్రభావమున భిక్షసేయుచు నిలిచెను. గోరక్‌నాథుడొక దినము యోగశక్తి ప్రభావమున దివ్యదృష్టిని సారించి జాలంధర నాథుని గోపీనాథుడు భూస్థాపితము గావించుటను తెల్పికొనినాడు. అంతట గోపీనాథుని వంశనిర్మూలన







మొనరింప సంకల్పించెను. సమాధిస్థితి యందున్న జాలంధరుడు గోరక్‌నాథు సంకల్పమునెఱిగి శాంతింపుము. నా శిష్యుడగు కానీఫా అంతయు శుభాంతముగ రూపొందించగల శక్తి సామర్థ్యములు గలవాడు. నీవు ఆ విషయమును కానీఫా కెరుకచేసిన చాలుననెను. మీరు మిక్కిలి మన సంప్రాదయము మహిమాతిశయము ఇలపై విస్తృతముగా కలదని భూగర్భమున సమాధి స్థితి యందున్న జాలంధరుడు గోరక్‌నాథునకు సమాధానముగ సందేశము నొసగెను.

అంత గోరక్‌నాథుడు బంగాళాదేశమును వదలి దేశపర్యటన మొనరించుచు నొక ప్రదేశమును చేరెను. అచట నొక కాపువాడు మధ్యాహ్న సమయమున భోజనము సేయు ప్రయత్నమున నుండి గోరక్ నాథుని రారమ్మని పిలిచి కడుపు నిండ భోజనమిడెను. గోరక్‌నాథుడు కాపువాని సాధుసత్ప్రవర్తనకు మెచ్చి "ఓయీ! నీకేమైన వరము కావలసిన నన్నడుగుము. నీ కొసగుదు ననెను" అందులకా నాలుగవ జాతియతను (అడ్బంగ) "అయ్యా! వేళకు ఎవరైన పిలిచి పట్టెడన్నము బెట్టిన తిని కడుపునింపుకొను నీవేమి నాకు వరములనొసగదువని తెలిపి మరల నీవే యేదైన వరము నన్నడిగిన నేను నీకొసగుదుననెను. అందులకు గోరక్‌నాథుడు నీవు నాకు వరమొసగదలచిన నీమనమున పుట్టిన ఏ కోర్కెనను చేయకుండుటయే నీవు నా కొసగ వలసిన వరమని తెలిపెను. గోరక్ నాథుకృపాదృష్టియా కాపు వానిపై బడి దృగ్వీక్షప్రబావమును గావించినది. ఆ దృష్టి ప్రసారమున కాపువాని మానసము సంలక్ప రహితమాయెను. తపమొనరింప కృతనిశ్చయుడాయెను. అతడే అడ్బంగ నాథుడని ప్రసిద్ధిగాంచెను. గోరక్ నాథుడు అడ్బంగ నాథునకు నాథదీక్షనొసగి కొంతకాలము దేశసంచారముచేసి వచ్చియొక మామిడితోట యందు హాయిగ విశ్రమించెను.

## కానీఫా వృత్తాంతము

జాలంధరునాధు తన శిష్యుడగు కానీఫాను తపమొనరింపు యాదేశము నొసగియుండెనుకదా! కానీఫా తపము సిద్ధించినది. నాధ సంప్రదాయము నేల నాలుగు చెఱగుల విస్తరింప జేయుటకు తిరుగు చుండెను. దేశాటన సమయమున కానీఫాకు అనేక శిష్యులేర్పడిరి. శిష్య సమేతముగ కానీఫా స్త్రీ రాజ్యమును సమీపించి యందు ప్రదేశించుట కుద్యమించెను. శిష్యులలో కొందరు స్త్రీ రాజ్యమున పురుషులకు ప్రవేశార్హత లేదనియు–ఆ నియమము నుల్లంఘించి వెడలిన వారికి శిక్షజరుగునని శిష్యులలో కొందరు ముందు వెనుకలాడుచుండిరి. గురువుపై పరిపూర్ణ విశ్వాసము గలవారు అఘట ఘటనాసమర్థుడగు గురువు ననుసరించుటయే లెస్సయని కానీఫా వెంట వెడలుటకు కృతనిశ్చయులైరి. దృఢవిశ్వాసములేని శిష్యులతో కానీఫా "నేను స్త్రీ రాజ్యమును ప్రవేశించి యందున్న పుణ్యక్షేత్రములను సందర్శింప నెంచితిని. ఇష్టమున్న వారు నావెంట రావచ్చును. లేనివారలు మరలిపోవుటకిదే సెలవొసంగు చున్నా"ననెను. విశ్వాస హీనులగు శిష్యులకు రొట్టె విరిగి నేతిలో బడినట్లు గురువు సెలవొసంగి నంతనే వెనుకకు మరలిరి.

మరలిపోవు శిష్యులపై కానీఫా స్పర్శాస్త్రము నభిమంత్రించి ప్రయోగించెను. ఆ శిష్యుల పాదములు భూమికి అంటుకొనిపోయినవి. వారు తమరెండు చేతులను భూమిపై మోపి, నేల కంటుకొనిన పాదములను పైకెత్త ప్రయత్నింప పాదములతో బాటు వారిచేతులు సహితము భూమికే అంకితమైనవి. తమ దురవస్థకు శిష్యులు ఏడ్వసాగిరి. ఏడ్చుట వలన ఏమాత్రము లాభము లేదని తెలివి దెచ్చుకొని "గురుదేవా! కానీఫా మహాప్రభో!! నీ మహిమను తెలివి తక్కువ తనముచే తెలిసికొని జాలని మా అపరాధమును క్షమింపుము. మీ పాదమునికపై వదలు వారము కామని" మొఱలిడిరి. కానీఫాకు వారిపై జాలి గలిగినది. విభక్తాస్త్రమునభి మంత్రించి వదల వారికాలు సేతు లెప్పటివలె నుండినవి.

శిష్య సమేతముగ కానీఫా స్త్రీ రాజ్యము నందు ప్రవేశించెను. హనుమంతుని ఆదేశము మేరకు మత్స్యేంద్రుడు మహిళా మండలము నందు మైనాకినితో రాజ్యభోగములను భవించుచుండెను. వారు వీరెల్లరు కొంతకాలము స్త్రీరాజ్యమున నిలిచిరి. తదుపరి కానీఫా శిష్యులను





వెంటనిడుకొని దేశాటన మొనరించుచు దైవ సంకల్పమున గోరక్షుడు విశ్రమించుచున్న మామిడితోట యందు ప్రవేశించెను. గోరక్షుడు–కానీఫా ఇరువురు నాధసంప్రదాయమునకు చెందిన వారగుట కారణమున పునస్సగమాగమమునకు వారిరువురు చాల సంతసించిరి.

ఇరువురు ఇష్టాగోష్ఠిని సలుపుచు మామడితోట యందలి కలమాగిన పండ్లను జూచిరి. కానీఫా తన శిష్యులనా మామిడి పండ్లను కోసి కొనిరమ్మను. అందులకు గోరక్‌నాధుడు–ఒకవేళ నీ శిష్యులే నీ వెంట లేకుండిన అపుడు నీవేమి చేయగల వాడవని చిరునగవు లొలికించుచు నడిగెను. జాలంధరుని వలన ఉపదేశము నొందిన విభక్తాస్త్రము స్మరించి భస్మమును చేగొని అభిమంత్రించి చల్లినంతనే మామిడిచెట్ల నుండి చూతఫలములు నేలపై రాలినవి. వారెల్లరా పండ్లను తినినను చాల పండ్లు మిగిలిపోయినవి. గోరక్‌నాధుడు కానీఫాతో మనము తినగమిగిలిన పండ్లు బహుళముగ నున్నవి. అవి వ్యర్థమగుట నాకింపతము గాకున్నది. ఈ మిగిలిన పండ్లను చెట్లకు వాని వాని స్థానమున చేర్చుట లెస్సయనెను. అందులకు కానీఫా చెట్టునుండి పండురాలుట ప్రకృతి ధర్మము నేలరాలిన పండును చెట్టునకు జేర్చుట ఎందైన కలదాయని సమాధాన మిచ్చెను.

జాలంధరుడు కానీఫాకు నాధ దీక్షనొసగినను కానీఫా ఏనుగు చెవినుండి పుట్టిన వాడని యెంచి సంజీవిని మంత్రము–వాతాకర్షణ మంత్రముల నుపదేశ మొసగడాయెను. సమర్థసద్గురువు నాశ్రయించి మంత్రదీక్ష గైకొనిన వానికి కానిపని యనునదేముండును? అత్యంత దురూహ్యకార్యములను ఇచ్ఛామాత్రమున సలుపగల డని జాలంధరుడు కానీఫాతో ననెను. కానీఫా జాలంధరుని నీ గురువెవరని యడిగెను. నా గురుదేవులు మత్స్యేంద్రనాధుడు, సృష్టికి ప్రతిసృష్టి విశ్వామిత్రుని వలె గావింప సర్వసమర్థుడని దిట్టముగ పలికెను.

అందులకు కానీఫా గోరక్షునితో "నీ గురువుల వారు నాధ సంప్రదాయమును గంగపాలొనరించి స్త్రీరాజ్యమున స్త్రీలోలుడై మహిళా మండలమున నున్నవాడు కదా? యని అధిక్షేపించెను. అందులకు గోరక్షుడు నీ గురువు సంగతినాకు తెలియనిది కాదు. ప్రస్తుతము హేళాపట్టణమున (బంగాళాదేశమున) గోపీచంద్రు అనురాజు కోపమునకు గురియై భూమి యందు పాతిపెట్టబడినవాడు కదా" యని పలికెను. కానీఫాకు తన గురువైన

జాలంధరు ఉనికి తెలిసి వచ్చినది. గోరక్షుడు సంజీవినీ మంత్ర ప్రభావమున నేలరాలిన మామిడిపండ్లను యధాస్థానమున చేర్చుట కన్నులార గాంచుట కన్న నిదర్శనమేమికావలయును? కానీఫాకు గోరక్షుని ప్రభావముతో బాటు మత్స్యేంద్రనాధుని మహిమ బోధపడినది.

గోరక్‌నాథుని వలన కానీఫాకు తనగురువగు జాలంధరనాధు సమాధి స్థితియందు సజీవముగ నుండగలడని విశ్వసించి శిష్యులను చేరదీసికొని బంగాళా దేశమున ప్రవేశించెను. ఒక మహా మహితాత్ముడు తన పట్టణమున కరుదెంచు చున్నవాడను సువార్త గోపీచందునకు తెలిసినది. లోగడ తన తల్లి మహనీయుల వలన మంత్రోపదేశమును పొందుట జన్మసాఫల్యమను సుధామయోక్తులు స్ఫురణకు వచ్చినవి. శిష్య సమేతముగ నేతెంచు కానీఫా "హేళా" పట్టణమున అడుగిడినంతనే అత్యంత వైభవోపేతముగ గోపీనాధుడు వారికి సుస్వాగతములొసగెను. అతిశయ గౌరవమున తన అంతః పురమునకు రమ్మని ఆహ్వానించెను. మంత్రోపదేశమొసగి ధన్యుని గావింపుమని ప్రార్ధించెను. కానీఫా గోపీచందు వంక కడుతీవ్రముగ జూచి "ఓయీ! మంత్రమునుపదేశింపుమని నన్నర్థించు చున్నావు. కాని నాగురు దేవులు నీ పట్టణమున ప్రవేశింప నంగనాచియగు నీ యాలి కూతలు విని యా కల్ల బొల్లి మాటలు నిజమని యెంచి నీ వతి రహస్యముగ జేసిన ఘోరకృత్యమేమని గ్రుడ్లెర్రజేసి యడిగెను. కానీఫాకు తానతి రహస్యముగ గావించిన మహాపరాధము తెలిసి వచ్చినంతనే భయోత్కంపమున గడ గడలాడుచు గోపీచందు నోటి నుండి మాటలు వెలువడవాయెను. సిగ్గుచేతల వంచుకొని తల్లికడకేగి ఆమె పాదములపై వ్రాలి "అమ్మా! అలనాడు నీవు మంత్రోపదేశము నొందుమని తెలిపితివి. ఆ మహనీయునకు నేను గావించిన అక్షమ్యాపరాధమును తెలుపుటకు నాకు నోరాడకున్నది. నారహస్యవర్తన మిపుడీ వచ్చిన మహాత్మునకు అనుపూర్తికముగ తెలిసినది నేనొక పంచమహాపాపాత్ముని కన్నను అధమాధముడను. ఛీ, ఛీ, బ్రతికి యేమి సుఖము? భూమికి బరువు చేటు. మరణమే నాకిక శరణ్యమని పరి పరి విధముల పశ్చాత్తాపతప్త హృదయుడై పరితపించు చుండెను. గోపీచందు తల్లి మైనావతి కుమారుని మానసిక సంక్షోభమును మదిదలచి కానీఫా కడకేగి "మహాప్రభో! నాకుమారుడొనరించిన గురుద్రోహము నాకిప్పుడే తెలిసి వచ్చినది. పరత్ర్యయ నేయబుద్ధి చేసిన మహాపరాధమును మన్నింపుము, నేను జాలంధర నాధుల శిష్యురాలను, నాకుమారుని దయజూడుమని ప్రార్థించినది.



కానీఫా దయార్ద్ర చిత్తుడు. తనగురువు మహిమాతిశయమును పరిపూర్ణముగ నెఱిగినవాడు. గోపీనాధుడాయనను భూస్థాపిత మొనరించి నను సమాధి స్థితి యందు సజీవముగ నుండగలడని మది నెంచెను. గోపీచందును రావించి "చిరంజీవ సుఖీభవ" యని నొసట భస్మమునలది– జాలంధరుని గోపీచందుడు గుంత ద్రవ్వి పూడ్చించిన నిర్మితమగు వానిని చేర్చించుమనినాడు. గోపీచందు ఆకారమున నున్న ఐదులోహ విగ్రహము లను స్థపతులు సిద్ధమొనరించి గొనివచ్చిరి.

ఒక శుభముహూర్తమున గోపీచంద్రుని, జాలంధరుడు భూస్థాపితము గావించిన స్థలమునకు కానీఫాగొనిపోయెను. ఆ గోతిపై గుఱ్ఱపులద్దెలు రాశిగ పడియుండినవి. పారనొక దానిని చేదాల్చి ఆ గుఱ్ఱపులద్దెలను గోపీచందుని తొలగింపుమనెను–గోతినుండి ఎవరదియను శబ్దము వచ్చి నపుడు నేను గోపీచందుడ ననుచు పరుగులు దీసి ప్రక్కకు తొలగుమని నాడు. గోపీచందుడు గుఱ్ఱపులద్దెలను తొలగించుచుండ భూగర్భము నుండి "ఎవరది?" యనుశబ్దము వినపడినది–నేను గోపీచందుడనని కానీఫా ముందు జాగ్రత్తగ హెచ్చరించినటుల ప్రక్కకు పరుగులుదీసెను "భస్మభవ" యని గోతి నుండి శబ్దము వినబడినది తెప్పపాటు కాలమున గోపీచందుని ఆకారమున నున్న విగ్రహము మంటలై మండి బూడిద మిగిలినది. ఇట్లు మూడు పర్యాయములు జరిగినది.

భూగర్భమున నున్న జాలంధరుడు "ఇదియేమి? నేను భస్మభవ యనుటయే తడవు గోపీచందుడు బూడిదయై మిగిలియుండును. అట్లుగాక మూడు పర్యాయములు సమాధాన మిచ్చుట యేమని యాలోచించెను. అంత, కానీఫా రంగమున ప్రవేశించి "జాలంధర గురుదేవా! నేను నీ శిష్యుడను, కానీఫానాధుడను–నమోనమః నమాంసిభూయాంసి" అని పలికి జరిగిన వృత్తాంతమంతయును విశదముగ వివరించెను. తొలిదినము పశ్చిమ సముద్రమున గ్రుంకులిడిన సూర్యభగవానుడు మరుదినము ఉదయాద్రిపై వెలసినటుల జాలంధరుడు బ్రహ్మతేజోవిరాజితుడై యొప్పుచు గోతి నుండి వెలువడి వచ్చెను. గోపీచందుడు జాలంధరుని పాద పద్మములపై వ్రాలెను. జాలంధరుని జాలిగుండె ద్రవించింది. గోపీచందుడు జాలంధరుని కృపకు పాత్రుడై నాథదీక్షను గైకొనెను. జాలంధరుడు గోపీచందుని కుమారునకు పట్టముగట్టెను – మైనావతి జాలంధరుని శిష్యురాలైనది.

**గోపీచందు దేశాటనము :** గోపీచందు సర్వసంగ పరిత్యాగ మొనరించి ఏకాకియై లభించిన చోట భిక్షనుగైకొనుచు దేశాటనము సలుపుచు తన చెల్లెలగు చంపావతి యున్న పట్టణమును ప్రవేశించెను. ఆ పట్టణమునకు సమీపమున నున్న చెఱువుగట్టుపై గూర్చొని ఏక తారను మీటుచు హరినామ సంకీర్తనము గావించుచుండెను. ఆయూరి అమ్మలక్కలు తటాకోదకమునకై వచ్చి గోపీనాధునిజూచి గుర్తించి యా విషయమును చంపావతి మామ గారితో తెలిపిరి. భిక్షకై ఇల్లిల్లు తిరిగి బైరాగివలె చెరువుగట్టున నుండుట తమ పరువు ప్రతిష్టలకు భంగమని యెంచి నౌకరులతో గోపీచందుని తన అశ్వశాల కడజేర్పించెను. సకాలమునకు భిక్షనొసగు ఏర్పాటు గావించెను. మానావమాన ములను సమదృష్టితో జూచు గోపీచందుడు అశ్వశాలకడనే యుండెను.

చంపావతి ఆడబిడ్డలు "మీ యన్న సర్వమునుత్యజించి బైరాగివలె నీ పట్టణ మునకు వచ్చుటయే కాక అశ్వశాల కడనుండుట మాకు భరింపశక్యము గాకున్నదనిరి, వారి సూటిపోటి మాటలు విని సహింప జాలక చంపావతి పదునైన కత్తిచే పొడుచు కొని ప్రాణములను వదలినది. గది యంతయు రక్తసిక్తమైనది ఊరివారెల్లరు చంపావతి దుర్మరణమునకు గోపీచందుడే కారణమని దూషించిరి. మరుదినము చంపావతి శవము శ్మశానమునకు గొనిపోవుటకేర్పాట్లు జరుగు చుండెను.

గోపీచందు చంపావతిని శ్మశానమునకు గొనిపోవలదనియు తన గురుదేవులు జాలంధరుడు బ్రతికించునని దిట్టముగ పలికెను. అందులకు విరుద్ధముగ ఆమెను మంటల పాలొనరించిన వారెల్లరు తన గురుదేవుల కోపాగ్నికి భస్మీపటలమై పోవుదురని నొక్కిపలికెను. గోపీచందుడు ఏకాగ్రచిత్తమున తన గురుదేవుని మనసార ప్రార్థించెను. ఔప్పపాటు కాలమున జాలంధరుడు వచ్చి సంజీవినీ మంత్ర ప్రభావమున చంపావతిని బ్రతికించెను. ఆ సంఘటనను చూచినవారు,విన్నవారు జాలంధరుని ప్రతిభకు ఆశ్చర్యమగ్న మానసులైరి. నాధసంప్రదాయము యొక్క విశిష్టత మహిమ ప్రజలకు నిదర్శనముగ నిరూపణ జరిగినది.

చంపావతిచే అన్నమును వండించి శాకపాకములతో ఊరివారలకు సమారాధ నము సలిపి జాలంధరనాధుడు మరలివెళ్లెను – గోపీచంద్రుడు నాథ సంప్రదాయ మునకు చెందినవాడై శేషజీవితమును బ్రహ్మ నిష్ఠుడై గడిపి ధన్యత నొందెను.





శ్రీరాములు – శ్రీపాద శ్రీవల్లభాయనమః

## భర్తరీనాథ చరిత్ర

కౌలికుడను మహర్షి యొకదినమున భిక్షాటనమునకై తాను పయోగించు పాత్రను పర్ణశాల ముందుంచినాడు. మహాకారణాంతరమున నాభిక్షాపాత్రయందు సూర్యభగవానుని రేతస్సు పతనమైనది. తన భిక్షాపాత్రయందలి రేతస్సు వలన నొక మహానుభావుడుదయించుట దైవ నిర్ణయమని యా మునివరుని జ్ఞాననేత్రమునకు తోచినది. మహర్షి యా పాత్రనుపయోగింపక నట్లే యుంచినాడు. ఆ వీర్యము దిన దినాభివృద్ధి నొందుచు నొక బాలునిగ రూపొందినది. బాలుడుదయించినంతనే యా పాత్రభిన్నమైనది. భర్తరియనగా భిక్షాపాత్రయను నర్థమొసగును. భిక్షాపాత్ర యందుదయించిన బాలుడు భర్తరియను వ్యవహారనామమున, జగత్ప్రసిద్ధిగాంచినాడు. ఈయనయే భర్తృహరియను కింవదంతి కలదు.

భిక్షాపాత్ర (భర్తరి) యందు బాలుడుదయించు సమయమున ననే యొక లేడి చూలుదాల్చి ప్రసవ సమయమాసన్నమైనందున లేడి పిల్లలను కనెను. ఆ లేడియా బాలుడు తన సంతానమని భావించి తన పిల్లలతో బాటు బాలునకు తల్లివలె పాలిచ్చి పోషింప దొడగినది. భర్తరియను బాలడు లేడి పిల్లలతో కలిసిమెలసి యడవుల యందు సంచరించు చుండెను. ఇట్లు అయిదారు సంవత్సరములు గడిచినవి.

సహనసారూపు – అనుభట్రాజు భార్యాసమేతముగ కాశీయాత్రకై బయలుదేరి వెడలు చుండెను. బాలుడు లేడిపిల్లల తోడిదే లోకముగ తల్లి వెంట గంతులు వేయుచు పోవుటను జూచి అమితాశ్చర్యము నొంది యా బాలుని ఎత్తుకొనినాడు. లేడి తన పిల్లలతో బాటు ఆక్రందన మొనరించినది. బాలుడు సహితము లేడికుటుంబముతోడి ఎడబాటునకు వ్యధనొంది లేడివలె నడచుచు కేకలిడినాడు. సహన సారూపుడా బాలు నోదార్చి బుజ్జగింపు మాటలాడి ఏడ్పుమాన్పించినాడు; భట్రాజు చేరువనున్న గ్రామమును చేరెను. లేడిచేయునది లేక కన్నీరొలికించుచు తన పిల్లలతో బాటు వారి కెడమై పోయినది. భర్తరిని భార్యను వెంటనిడుకొని సహనసారూపుడు ఊరూర భిక్షాటనము సలుపుచు కాశీయాత్ర ముగించుకొని స్వగ్రామమునకు మరలి వెళ్లుచుండెను. వారు అడవియందు పయనించుట కారణముగ దొంగలీతని కడనున్న కొద్దిపాటి ద్రవ్యమును తస్కరించి యాతని ప్రాణములను దీసిరి.

భర్తృమరణమున కాతని యిల్లాలు కంటికి మింటికి నేకధారగ నేడ్చి యొకచితిని పేర్చి నిప్పంటించి భర్తతోపాటు ఆమె సహగమన మొనరించి నది. పదునారేండ్ల ప్రాయమున నున్న భర్తరి ఒంటరి వాడాయెను. నా యనువారులేరైరి. సహన సారూపుడు భట్రాజగుటచే నేర్పిన విద్యలు భర్తరినొక విద్వాంసుని గావించినవి. సమస్త విద్యల యందును పురాణేతి హాసముల యందు ప్రావీణ్యమును గడించెను. కారణ జన్ముడగుటచే చదవుల రాణి యాతనిని లెస్సగ ననుగ్రహించినది. భిక్షాపాత్రనుండి వెలు వడిన నాడు పాలిచ్చి ప్రాణములు నిలిపిన లేడికిని–అటు పిమ్మట పెంచి పెద్దజేసిన సహన సారూపుని గోల్పోయి కింకర్తవ్యతామూఢ చిత్తమున దిక్కుతోచక భర్తరి కన్నులప్పగించి నలుదెసలు పరికించి చూడసాగెను.

కనుచూపు మేర యందువర్తకులు కొందరు ఎద్దులపై మూటలు ముల్లెల నుంచి వ్యాపార నిమిత్తమై దేశాంతరముల కేగుచు తిన్నగ భర్తరియున్నతావును జేరిరి. భర్తరి పూర్వవృత్తాంతము నంతయు నావర్తకులా యువకుని వలన తెలిసికొని తమ వెంట గొనిపోవుచు తిండి తీర్థములకే లోపము వాటిల్లనట్లు పోషింపదొడగిరి. భర్తరి క్రమ విక్రయములయందు వర్తకులకు చేదోడు వాదోడుగ నుండి వారి మెప్పును బడసినాడు.

ఆ వర్తక బృందము దేశదేశముల సంచరించుచు తుదకు అవంతి యను పట్టణమును చేరిరి. కోట గోడల చెంత గుడారముల పాతి, యందు ప్రయాణపు బడలిక తీరునట్లు హాయిగ మైమరచి నిద్రించుచుండిరి. అదినడిరేయి. నక్కయొకటి కూయుచుండ భర్తరి మేల్కొని వర్తకుల నందరిని తట్టిలేపినాడు. వర్తకులెల్ల రొక్కుమ్మడిగ నిద్రాభంగము గావించుటకేమి పని గలిగినదని యాతనిని ప్రశ్నించిరి. అందులకు సమాధానముగ భర్తరి "అయ్యాలారా! దొంగలగుంపొకటి మనపై దాడి సలిపి దోచుకొని పోవనెంచి వేవేగ వచ్చుచున్నదని నక్కయొకటి పదే పదే కూయు చున్నది. కావున మీకు మేలుగూర్పనేనిట్లు మిమ్ములను హెచ్చరించితి"ననెను. అంతలో పరుగులు దీయుచు వచ్చి దొంగలు వారిని ముట్టడించిరి. వర్తకులెల్లరేకమై దొంగలను తరిమి కొట్టిరి. వర్తకులావెనుక భర్తరితో "అయ్యా! నక్కకూతలను బట్టి దొంగలు మనకడకు వచ్చుచున్నారని నీవెట్లు చెప్పగలిగితివని కుతూహలముగ ప్రశ్నించిరి. "అయ్యాలారా! నేను పుట్టిన నాటి నుండియు జింకలతో బాటు కలసి మెలసి తిరిగిన వాడనగుటచే నాకు పశుజాతికి చెందిన భాషాజ్ఞానము కలదని" తెలిపెను. వర్తకులు సంతసించిరి.





## విక్రమార్కుని జన్మవృత్తాంతము

ఒకపరి దేవేంద్రుడు చింతామణీ భద్రపీఠముపై సుఖాసీనుడై యుండ ఆటపాటల యందు నిగ్గుతేలిన అమరవేశ్యలు కాలికి గజ్జకట్టి నృత్యము సేయుచుండిరి. వేయి వేణువులూదినట్లు వారు పాడెను. శృంగార గీతములు రసవన్మ నోహరముగ నొప్పుచుండ పాట యందలి భావమున కను గుణ్యముగ నా విలాసవతులు భ్రూవిన్యాసముచే ముఖభంగిమలను ప్రదర్శించుచు తాళగతిని తప్పని యట్లు పదవిన్యాసము సలుపుచుండ నా నృత్యప్రదర్శనము ప్రేక్షకుల నుర్రూతలూగించుచు, ఉల్లములను పల్లవింపజేయుచు ఆహా పుట్టించుచుండినది. ఆ అందాల భామినుల లోకమోహన మనోహర రూపమును వేయి కన్నుల వేల్పు వేడుకమీర జూచుచు ఆనంద పారవశ్యము నొందుచుండెను. దేవతలు, గంధర్వులు, మహర్షులు సభనలం కరించి మెచ్చి తలలూపుచుండిరి.

సులోచనుడను గంధర్వుడు ప్రేక్షకలోకమున నొకడై యుండి ముద్దులు మూటగట్టినట్లు మురిపెము లొలికించు ఆ ముద్దుగుమ్మల వంక దృష్టిని సారించి మరల్చజాలడాయెను. చిత్తజుబారికిజిక్కి తికమక నొందుచు చిత్తము చిగురింప మోహావేశమున ముందు వెనుకలాలోచింపక అమాంతముగ లేచి యా వారిజాక్షులలో చూడ చక్కని సుందరాంగి నాతడు బిగికౌగిట జేర్చి ముదమార ముద్దిడుకొనినాడు.

సభాగౌరవమును పాటింపనియా మదాంధుడగు గంధర్వునిపై ఇంద్రుడు కోపము నొంది "ఓరీ! నీవు దేవలోకమున నుండ తగినవాడవు కావు. భూలోకమున గాడిదవై యుండుమని" శాపము నొసగెను. ఆశాపాక్షరముల ప్రభావమున సులోచనుడు మిథిలాపుర పరిసరముల యందు గాడిద రూపమును ధరించి సంచరించు చుండెను. మిథిలా పట్టణము నందు కమర్షణుడను కమ్మరి యొకడు కలడు. అతనికి రెండు మూడు గాడిదలుండినవి. గాడిద రూపమును దాల్చిన సులోచనడను గంధర్వుడు ఆకులాలుని గాడిదల జతగూడి కాలమొక రీతిగడుపు చుండెను. ఇట్లు కొంతకాలము గడిచినది.

మిథిలాపురమునేలు రాజున కొక కూతురుగలదు. ఆ కన్యా రత్నమునకు పెండ్లి ఈడు వచ్చినది. తగిన సంబంధము నేర్పాటొనరించి రాకుమారికి వివాహము గావింప నా భూపాలుని సంకల్పమై యుండినది. అర్థరాత్రివేళయందు గాడిద రూపమును దాల్చిన గంధర్వుడు ఆ రాకుమారిని తనకిచ్చి వివాహము సలుపుమని కేకలిడు చుండెను. కుమ్మరి అపలుకులను విని బయటకు వచ్చి చూడ నందెవ్వరును కానరారైరి. రెండు మూడు దినములట్లేగడిచినవి. కులాలుడు తనకడకు వచ్చిచేరిన గాడిదయే యట్లు కేకలిడు చుండుటను గమనించినాడు. ఆ విషయము రాజున కెఱుకయైన తన నిండు ప్రాణములు నిలువున పైకెగసి పోగలవని ప్రాణసంరక్షణార్థమై నడిరేయి మిథిలాపట్టణమును వదలి పయనమై వెడలు చుండెను.

ఆ నిశీథమున తన గాడిదలపై సామగ్రుల నుంచుకొని కమర్షణుడు బయలుదేరి వెళ్లుచుండుట నగర సంరక్షకుల కంటబడినది. రాజభటులు కమర్షణుని రాజు చెంత జేర్చిరి. రాజాతనితో "ఓయీ! నీకు వచ్చిన కష్టమేమి? వేళకాని వేళయందు నిర్నిమిత్తముగ నీవు పట్టణమును వదలి పారిపోవుటకేమి హేతువని" ప్రశ్నించెను. కులాలుడు భయోత్కంపమున గడగడలాడుచు మాటలు తొట్రుపడు చుండ "మహాప్రభో! నాకడ రెండు గాడిదలున్నవి. క్రొత్తగ వచ్చిన గాడిద వాటితో జతగూడినది. వచ్చి కొలది దినములేయైనది. రాకుమారిని తనకిప్పించి వివాహము జరిపింపుమని మానవునివలె పెద్ద పెట్టున అరచుచున్నది. ఇది యెక్కడి వైపరీత్యమని నాగుండెల విసినవి. క్రొత్తగ వచ్చినగాడిద నా కొంప గూల్చి ముప్పుదెచ్చునని అరచేత ప్రాణములుంచుకొని అర్థరాత్రము వేళ నేనీ నగరమును వదలి





వెళ్లుచున్నాను. ఇంతకు మించి నావలన దోషమిసు మంతయైననులేదు. దేవర వారికి యదార్థమును వివరించితినని" చేతులు జోడించి విన్నవించుకొనెను.

కులాలు డాడిన మాటలను రాజు కూలంకషముగ వినినాడు "గాడిద ఓండ్ర పెట్టుటలోకముతీరై యున్నది. మానవుని వలె మాటలాడుట యందేదో దేవరహస్య మిమిడి యుండితీరును. మీరు మిక్కిలి రాకుమారిని తన కొసగి పెండ్లి సేయుమని తెలుప నేల?" యని సుదీర్ఘముగ నాలోచించెను. రాజు శాంతచిత్తమున కుమ్మరికి అభయమొసగి తనలో దానిట్లు యోచించెను.

గాడిద రూపమీతనికి శాపవశమున సంప్రాప్తించి యుండనోపును. ఈతడు సామాన్యమానవుడు కానేరడు. పూర్వజన్మ స్మృతిగల యొక గొప్ప వ్యక్తియై యుండ వచ్చును" అని తలపోసి కులాలునితో ఓయీ! రేపు సహితమీతడిట్లే కేకలిడు నపుడు నీవు, అయ్యా! నీ విషయమై నేను రాజుగారితో సంప్రతించి యున్నాను. నీవు మిథిలాపట్టణమునకు గల ప్రాకారపు రాతిగోడలను కంచుకోటగ రూపొందించగలశక్తి సామర్థ్యములు గలవాడవేని నీవు రాకుమారిని పెండ్లియాడ గలవని, తెలుపుము. సందేహము వలదు. వెళ్లిరమ్మని సెలవొసంగెను.

కమర్షణుడింటికేగెను. సులోచనుడు మరదినమట్లే కేకలిడుచుండ నాతడు గార్దభరూపమున దాల్చిన సులోచనునితో "అయ్యా, నీవు రాకుమారిని పెండ్లియాడ దలచితివేని మిథిలాపట్టణమునకు గల ప్రాకారమును కంచుకోటగ రూపొందించ వలసి యున్నది సుమా!" యని తెలిపెను. అందులకు సులోచనుడు కంచుకోటగ నాకొక లెక్కలోనిదికాదని" జంకుబొంకులేక బదులాడెను.

ఉదయముననే కులాలుడీ విషయమును రాజుగారికి సవినయముగ తెలిసినాడు. రాజుతన కుమార్తె చెంతజేరి లాలనగ నిట్లు తెలిపినాడు. "అమ్మా! కన్న బిడ్డలను తగిన వరునకిచ్చుటకై ప్రతియొకరును ప్రాకులాడుట సహజమేకదా! ఇది నీకు తెలియనదికాదు. మన మిథిలాపట్టణమునకు ఏదో కారణాంతరమున క్రొత్తగనొక గార్దభము వచ్చియున్నది. మాటలు నేర్చిన యా గార్దభము అత్యద్భుత మహిమలను సంతరించుకొని

యున్నదనుట నిర్వివాదాంశము. ఏకారణముననో గాడిదరూపముననున్న యాతనిని నీవు పెండ్లియాడుట నా అభిమతమై యున్నది. అద్దాన భవితవ్యమును నీకు గొప్పమేలు కలుగగలదని నా బుద్ధికి పొడముచున్నది. ఇంకొక విషయము స్త్రీలు పాతివ్రత్య ప్రభావమున అనితర సాధ్యమగు అత్యంత కార్యములను సాధించుట మనము పురాణములయందు చదివియున్నాము. నీకు గాడిదను భర్త నేను జతగూర్చితినని అపోహ నొందకుము. పర్యవసానముగ నీకు అతిశయశుభములు సంప్రాప్తించు గలవని నా అంతరాత్మ ప్రబోధమొనరించు చున్నది. రాకుమారి తండ్రి మాటలను సాంతముగ చెవి యొగ్గివినినది. తండ్రిమాట కెదురాడ దాయెను. రాకుమారిని సమ్మతినొంది రాజు కమర్షణుని రావించి తన కూతురు నాతని చేతులలో నుంచినాడు. రాజుకులాలునితో "ఓయీ! నీవు మిథిలాపురము నందుండుట సమంజసముగ నుండజాలదు. నాకన్న కూతురును కంటికి ఱెప్పవలె కాపాడుచు వేరొండు ప్రదేశమున కేగుమనినాడు. కులాలుడు చిత్తము, దేవర వారి యానతిని శిరసా వహించుదునని పలికి రాకుమారిని తన ఇంటికి గొనిపోయెను. కొలది దినములలో వారెల్లరు అవంతీ నరగమును చేరిరి.

కమర్షణుడు జీవనోపాధికై కులవృత్తిని పాటించుచుండెను. ఇట్లు కొంత కాలము గడిచినది. సులోచనుడు రాకుమారితో నొక సుముహూర్తము నందు మిధున ధర్మమును పాటించి దాంపత్య సుఖముల ననుభవించెను. ఆమె గర్భము దాల్చి పదియవ మాసమున ప్రసవించినది. సులోచనుడు పుత్రుని ముఖారవిందమును గాంచినంతనే శాపము తొలగి గంధర్వ లోకమును చేరినాడు. సులోచనునకును రాకుమారికిని జన్మించిన బాలుడు సర్వశుభలక్షణ సంపన్నుడు మిక్కిలి అవక్రమవిక్రమ పరాక్రమ శాలియై విక్రముడని ప్రసిద్ధినొందిన వాడాయెను.

విక్రమార్కుడు దైవాంశ సంభూతుడగుటచే పువ్వుపుట్టగనే పరిమళమును దాల్చినటుల సమస్త విద్యలాతని నావహించినవి. విక్రమార్కునకు పదునారేండ్ల ప్రాయము వచ్చుసరికి అవంతీ పట్టణపు కోటను సంరక్షించు ఉద్యోగము లభించినది. ఉద్యోగ ధర్మమును నిర్వహించుచు కోటను కావలి గాయుచుండెను. ఒక దినము అవంతీ





పురమునకు చేరిన వ్యాపారులు కోటకు సమీపమున గుడారములను వేసికొని అందు విశ్రాంతి గైకొనుచుండిరి. విక్రముడు వారి సమీపమున నిటునటు సంచరించు చుండెను.

రాత్రి ఒక ఝాముప్రొద్దుగడిచినది. ఇంతలో ఒక నక్కకూత వారి చెవిని బడినది. వర్తకులు పశువుల భాష తెలిసిన భర్తరితో నక్కకూతయందలి భావమేమని ప్రశ్నించిరి. విక్రముడందందు గస్తీతిరుగుచు వారి మాటలను వినుచుండెను. భర్తరి వర్తకులతో "అయ్యలారా! ఉత్తరము దిశనుండి ఒక రాక్షసుడు మనవంకకే వచ్చు చున్నాడట. అతనికడ వెలకట్టుటకు వీలుపడని నాలుగురత్నరాజములు సహిత మున్నవి. ఆ రాక్షసుని చంపియాతని మేనిరక్తమును కోటగోడకు పూసి ఆ రక్తమును నుదుట బొట్టుగ పెట్టుకొనిన యాతడు అవంతీ పురాధీశ్వరుడగునని తెలిపినదని వివరించెను.

ఆ పలుకులు విక్రమునకు శ్రవణానందమును గూర్చినవి. అదృష్టదేవత యాతనిని వరించినది కాబోలు. రాక్షసుడు వర్తకులున్న తావునకే తెంచెను. విక్రముడాతని కెదురొడ్డి నిలిచిపోరాడి యాతనిని వధించినాడు. కోటకు రాక్షసుని మేని రక్తమును పూసి తన నుదుట బొట్టుగ నలంకరించుకొనినాడు. రాక్షసుని కడనున్న అనర్ఘరత్న రాజములను నాల్గింటిని గ్రహించినాడు. పిమ్మట రాక్షసుని రాకను-రత్నములను గూర్చి తెలిపిన వారెవరని విక్రముడు వర్తకులనడిగెను. ఆ బేహారులు అయ్యా! మా కడ భర్తరి యను యువకుడున్నాడు. ఆతడు దేవునివలె మమ్ములను లోగడ దొంగలబారి నుండి రక్షించినాడు. ఇపుడు రాక్షసునిపీడ నీ వలన విరగడైనది. అతనికి పుట్టిన నాటినుండి పశువుల భాషకొట్టిన పిండిగ తెలియునని" వివరించెను. విక్రముడు "అయ్యలారా! వర్తకులగు మీకు ఆయన ప్రాపకమెట్లు లభించినదన భర్తరివృత్తాంతమును వారు పూసగ్రుచ్చినట్లు వివరించిరి. విక్రముడు రాక్షసుని కడగ్రహించిన రత్నములలో రెండింటిని వర్తకులకొసగి-భర్తరిని తన సోదరునిగ నెంచి తనయింటికి తోడ్కొని పోయెను. తల్లితో "అమ్మా! ఈతని పేరు భర్తరి. బహిఃప్రాణము. ఈతడే నేను నేనే యాతడనితెలిపినాడు. విక్రముని కన్న తల్లియగు మిథిలాపురాధీశుని కూతురు భర్తరిని పుత్రవాత్సల్యమున నాదరించు చుండెను. భర్తరి, విక్రముడు అన్యోన్యానురాగమున అన్నదమ్ముల వలె మెలగుచుండిరి.

## విక్రముని వివాహము

అవంతీ పురాధీశున కొక కూతురు కలదు. ఆ బాలామణి దినదిన ప్రవర్ధమాన ముగ శుక్లపక్షము నాటి చంద్రరేఖ పగిది వర్ధిల్లుచుండ పదునారు వసంతములు గడిచినవి. ఆ కన్యామణిని తగిన రాజుకుమారున కొసగి వివాహము సేయుట భూపాలునకు కర్తవ్యమైనందున మంత్రిని చేరదీసికొని వరాన్వేషణమునుగూర్చి ప్రసంగము గావించెను. అందులకు తగిన వరుడెవరని మంత్రితో నాలోచింప, సచివోత్తముడు రాజుతోనిట్లనెను:

"మహారాజా! మీ ఏకైక పుత్రికను సద్వంశ సంజనితుడు లబ్ధప్రతిష్ఠితుడు నగు రాకుమారున కొసగి వివాహము సలుపుట లెస్స. అవంతీదేశ ప్రజలను తమ తదనంతరము పరిపాలించు వారసుడు లేకపోవుట విచారింప దగియున్నది. వైవాహిక మహోత్సవ సందర్భమున రాకుమారితోబాటు మనరాజ్యమును అల్లునకు కట్నముగ సమర్పించుటయే మనవంతైయున్నదికదా" యని సుదీర్ఘముగ నాలోచించి మంత్రిరాజుతో మరలనిట్లనెను.

"ప్రభూ! నాబుద్ధి కొక ఊహ పొడముచున్నది. ఒక శుభదినమున సుముహూర్తమున మన పట్టపుటేనుగును శోభాయమానముగ నలంకరించి



పూల మాలను ఏనుగు తొండమున కందజేసి పట్టణము నందంతటను మహావైభవో పేతముగ ఊరేగింపు గావించుదము. భద్రగజము పూదండ నెవని గళమున నందల కరించునో అతడే అవంతీపురమునకు సార్వ భౌమునిగ పరిగణించుట లెస్స. రాజ్యము నకు వారసులు లేనపుడు అనూచానముగ నీ యాచారమును పాటించుట పరిపాటిగ నున్నది. భవిత్యమున గజారోహణ మొనరించు మహారాజు యోగముగల అదృష్ట వంతునే పూదండచే ఏనుగు అలంకరించునని మన పెద్దల విశ్వాసము కదా? మీదు మిక్కిలి దైవనిర్ణయ మెట్లో ఏనుగు చర్యయట్లుండునని బుధులు వక్కాణించుదురు. ఇందులకు మీ అభిప్రాయమును సెలవివ్వ ప్రార్థనము."

అమాత్యుని పలుకులు రాజు సావధానముగా విని కొంత తడవా లోచించి మంత్రి యాడిన మాటలు సమంజసమని యెంచి "సరి-మంచిది, అటులే కానిమ్మ"నినట్లు తలయాడించెను. ఒక దినమున సుముహూర్తమున పట్టపుటేనుగు నలంకరించి, మేళతాళములతో స్వస్తివాచన మంత్రమును భూసురులు పఠించుచుండ పట్టణము నందంతటను ఊరేగించిరి. ఏనుగు పట్టణము నందంతటను కలయదిరిగి పట్టణ ప్రాకారము వంకకు దారి తీసినది. బురుజుపై విక్రముడు గస్తీ తిరుగు చుండెను. ఏనుగు తొండమును పైకెత్తి రారమ్మనునటుల సరళముగ ఘీంకరించి పూదండను కదలి యాడించినది. విక్రమునితోబాటు కోట బురుజుపైనున్న వారల నెల్లరను క్రిందికిదిగి రారమ్మని రాజభటులు ఉత్తరువు నొసగిరి. భద్రగజము విక్రముని మెడలో పూదండ నలంకరించినది. పురజనుల కరతాళధ్వనులు దిగ్దిగంత ములు కెగబ్రాకినవి.

విక్రముని వంశమెయ్యది? కులగోత్రము లెవ్వి? కన్న తల్లిదండ్రులెవరను విచారణ మంత్రి యానతిపై శరవేగమున పుంజు కొనినది. విక్రమముని తల్లిదండ్రు లెవ్వరోకాని కుమ్మరి వారి యింటనున్న వాడని తెలిసినది. కుమ్మరిని రాజు సభకు రావంచి విక్రమునకు కులాలునకు గల సంబంధమును గూర్చియడుగ, కుమ్మరి "దేవరా! మిథిలాపురాధీశుని కూతురు విక్రముని గన్నతల్లి. సులోచనుడను గంధర్వుడాతని తండ్రి, దైవాంశ సంభూతుడగు భర్తరి యాతని ప్రాణ స్నేహితుడని యదార్థమగు విషయమును చేతులు జోడించి సవినయముగ తెలిపెను. రాకుమారిని విక్రమున కొసగ అత్యంతవైభవముగ వివాహమహోత్సవము జరిగినది.

మంత్రి సత్తమున కొక కూతురు గలదు. ఆమె పేరు పింగళ. యుక్తవయస్సు నున్న పింగళను మంత్రిపుంగవుడు భర్తరికిచ్చి వివాహము జరిపించెను. అవంతీపుర పరిపాలనా భారమును విక్రముడు భర్తరి భుజస్కంధములపై మోపి భార్యయగు అవంతీదేశపు రాకుమారిని తన తల్లిని దోడ్కొని మిథిలాపట్టణమును కేగెను. విక్రముడు అవంతీ దేశపురాజుగ నిమిత్త మాత్రముగ నుండెను.

భర్తరి రాజప్రతినిధిగ అవంతీపురమునేలుచు ధర్మప్రభువని ప్రజాను రాగమును బడసినాడు. ప్రజాను రంజకముగ నొక వంక పరిపాలన మొనరించుచు నింకొక వంక శయన మందిరమున హంసతూలికా తల్పముపై పింగళతో మన్మథ సామ్రాజ్యము నేలుచుండెను. తెప్పపాటు కాలము భర్తరి కనుమరుగైన పింగళ తహ తహలాడుచుండినది. ప్రజా క్షేమమునకై క్రూర మృగములను వేటాడుట, పైరు పంటలకు అడవి జంతువుల వలన నష్టమును లేకుండ జేయుటకై రాజులు కొంత పరి వారమును వెంటబెట్టుకొని మృగయావినోదార్థమై వెడలుట రాచరికపు ధర్మమై యున్నది.

ఒకదినము భర్తరి సప్తవ్యసనములలో నొకటి యగు వేటకై వెడలి అలిసిసొలసి దాహము తీర్చుకొనుటకై యొక సరోవరము చెంతజేరిలోని కేగుచుండెను. దత్తభగవానుడు తాపసివేషమున భర్తరిని జూచి “ఓయీ! ఎవరు నీవు? నీ గురు వెవ్వరు? సద్గురు కటాక్షమున బడసి దీక్షబొందిన వారలకే యీ సరోవరజలమును త్రావు యోగ్యతగలదు. లేనివారకీ జలమును స్పృశించు అధికారములేదు సుమా! యని గద్దించి పలికెను. అందులకు భర్తరి “మహాత్మా! దాహముచే నాలుక తడియారి నా ప్రాణములు పైకెగసిపోవు చున్నవి. మంచినీరు త్రాగుట కనుమతింపుడు. మీకు పుణ్యము లభించుననెను” ఆ తాపసి “ఓయీ! గురూపదేశమును పొంది పండ్రెండేండ్లు తపమాచరించుదునని బాసజేసి యాపిదప సరోవరజలమును గ్రోలు” మనెను. భర్తరి యందుల కనుమతించి నీరుత్రాగి తాపసివంక జూడ నచట నెవ్వరును లేకుండిరి. భర్తరి సేదదీర్చుకొని రాజధానికి పయనమై వెడల పరివార మాయన ననుసరించినది.

ఒకనాటి రేయి భర్తరి పింగళలు ఇష్టాగోష్ఠిని సలుపుచు పడకటింటి సుఖముల నవ్వారిగ ననుభవించి, తాంబూల చర్వణము సలుపుచుండిరి.







పింగళ భర్తవంక జూచుచు, చూపులో చూపునిలిపి చెదరనివ్వక ఆమందా నందమున సురుచిర చిరుమందహాస మొనరించినది. భర్తరి పింగళ సరస సల్లాపములకు శృంగార చేష్టలకు మురిసి ముగ్ధుడై మాట వరుసగ “ప్రేయసీ! నీవు ప్రగాఢముగ నన్ను ప్రేమించుచు, నా ఎడబాటును క్షణమొక యుగమున వ్యథనొందుట నాకు తెలియనిది కాదు. మానవ జీవితము నీటిపై బుడగ వంటిది. పెనవైచుకొనిన భార్యాభర్తల ప్రేమానుబంధములు, సంబంధములు ఏదోయొక నాడు విడిపోవుట లోకముతీరై యున్నది. దైవ నిర్ణయమున నేనే నీకన్నమున్ను అసువుల బాసిన నీవెట్లు ఓర్చుకొని యుండగలవని నా ఊహకు అందరానిదై యున్నది” అనుచు లాలనగ భార్యముంగురు లను సవరించెను.

భర్తతోడిదేలోకమని యెంచిన ఇల్లాలికి భర్తను దైవముగ నెంచిన సుదతికి భర్తృమరణమును కన్నులార జూచినను చెవులార వినినను పంచప్రాణముల పైకెగసి భర్త ననుసరించుననుట యందు వింతయే మున్నది? విశేషమేమున్నది? వియోగము, విరహము, వ్యథయనునవి పతివ్రతల నిఘంటువు నందు లేకుండునని యనినది. మధుర యామినులిట్లా దంపతుల కతిశయ సుఖముల నవ్వారిగ నమర్చుచుండెను.

ఆడు వారి మాటలు అర్థవంతములు కావనులోకోక్తి యొకటి యున్నది. మగువలు మనసులో నొకటి యున్నమాటవరుస కింకొక తీరుగ తియ్యగ పలుకుదురని అనుభవజ్ఞులాడుదురు. భర్త గతించెనను దుర్వార్తాశ్రవణ మాత్రమున నిండు ప్రాణములను గోల్పోయిన వారెవ్వరును లేరు. ప్రాణములను నిలుపుకొనుటకు బహువ్యయ ప్రయాసలకు గురియగు వారున్నారు. కాని మట్టిలో మట్టిని గాలిలో గాలిని చేర్చిన వారు లేకున్నారు కదా! అయినను పింగళ పలుకుల నొకపరి పరీక్షించి చూడ వలయునని భర్తరి మది తలపోయుచుండెను. ఇట్లుకొన్ని దినములు గడిచినవి.

భర్తరి యొకదినము వేటకై వెడలెను. వేట ముగిసినది. అలనాడు పింగళ పలికిన పలుకులెంత నిజమో పరీక్షించుట కాయనకు అభిమతమైనదే కాని పర్యవసాన ముగ నెట్లు పరిణమించునని యాలోచింపడాయెను. తాను ధరించిన దుస్తులకు జంతువుల రక్తమును బూయించి భటునొకనిని రావించి యిట్లు తెలిపెను “ఓరీ! నీవు రాజమందిరమునకేగి దుఃఖసముద్రాన మునిగినట్లు నటించుచు – రాజు వేటతమకమునుండ పొదరింటనున్న

పులి అమాంతముగ వచ్చి ప్రాణములను తీసినదని వల వల నేడ్చుచు దుస్తులను తెచ్చితినని విచారమును వెలిబుచ్చుమనెను.

రాజాజ్ఞమీరరానిది మేరలేనిది. భటుడేమి సేయగలడు? అరసిచూడ భర్తరి మాత్రమిందులకు కర్తయనుటెట్లు పొసగును. ఈ ప్రపంచమే ఒక నాటక రంగము భర్తరి రాజప్రతినిధిగ నింత వరకొక పాత్రధారి. విధి నిర్ణయమునకు విధేయుడై తాను పులివలన మరణము నొందినట్లుగ తన ప్రాణ ప్రియురాలికి ములుకుల వంటి పలుకులను వినిపించుమని తన సేవకుని నియోగించెను. జగన్నాటక రంగమున పింగళపాత్ర విషాదాంతముగ ముగియును. భర్తరి మనఃపరివర్తనము కిదియొక సన్నివేశము. నిరంతర ప్రణయోపాసకుడగు భర్తరి ప్రణవ మంత్రదీక్షా పరతంత్రుని గావించి మేలు గూర్చుటకై భగవంతుడు గావించిన కల్పనము. ఈ కల్పనము సహితము జీవుల మంచి చెడు కర్మల ఫలితముననుసరించి యుండగలదే కాని భగవంతుడు పక్షపాత రహితుడు. సాక్షిమాత్రుడు. కర్మసాక్షి–కర్మఫల ప్రదాతయని పరిపరి విధముల బుధులు పేర్కొనెదరు.

రాజు నానతని భటుడు తుచ తప్పకుండ పాటించెను. భటుడు తెచ్చిన దుస్తులను పుర ప్రముఖులు జూచి హాహాకారములొనరించిరి. భటుడా దుస్తులను పింగళముందుంచి బావురుమని ఏడ్చినాడు. పింగళ భర్తదుస్తులను పోల్చిచూచి భటుని మాటలు నిజమని యెంచి రుద్రభూమికేగి చితిపేర్చి భర్త దుస్తులతో బాటు అగ్ని ప్రవేశమొనరించి ప్రాణములను వదలినది. భర్తరి భార్య యాడిన మాటలను పరీక్షింప నెంచుటయే ముఖ్యమని యెంచిన వాడుకాని, కొంత వ్యవధి కల్పించి ఆమె ప్రాణములను నిలపుకొనునట్లు చేయజాలడాయెను. సాహసము నందు స్త్రీలకు మగవారలెన్నటికిని సాటిరారని ఎంచడాయెను. రెండు మూడు దినములు గడిచిన పిమ్మట పరివారమును వెంటనిడుకొని భర్తరి రాజధానికి మరలి వచ్చినాడు.

ఆబాలగోపాలము భర్తరి పులినోగినుండి వెడలి వచ్చినట్లు వింత వింతగ జూచినారు. రాజప్రతినిధి బ్రతికి బయటపడుట సంతసించ దగినదే!! భటుడు భర్తరి దుస్తులను గొనివచ్చుటయేమి? రక్తసిక్తమైన ఆ దుస్తులను చూచుటయే తడవుగ పింగళ అగ్నికి ఆహుతియగుట యేమని ఎల్లరు శోకవహ్ని జ్వాలల పాలైరి. భర్తరి స్వయంకృతాప రాధమునకు



నెత్తిపై బాదుకొనెను. చేజేతుల భార్యను వధింపకున్నను కపటనాటకమాడి భార్య ప్రాణములను దీసితినని కన్నీటి ధారలు మున్నీటికి కాల్వలై ప్రవహించునట్లు ఏడ్చెను. అనురాగములొలికించుచు ఆప్యాయతను వర్షింపజేయుచు అనుక్షణము అమర సుఖములనమర్చిన అర్ధాంగి లక్ష్మిని గోల్పోయిన అభాగ్యుడనని పెద్దపెట్టున విలపించెను. ఉపశమనము జేసినను ఊరడిల్లని దుఃఖమున లౌకిక సంబంధములన్నింటిని వదలుకొని పింగళ సహగమన మొనరించిన తావును జేరి "పింగళా! పింగళా!!" యని వాపోవ మొదలిడెను. నిద్రాహారములు లేవాయెను. భర్తరి పరిస్థితి విక్రమునకు తెలిసినది. విక్రముడెంత ఓదార్చినను భర్తరి పట్ల నిరుపయోగమాయెను.

భర్తరికి పింగళ నామోచ్ఛారణము మూడక్షరముల మంత్రమైనది. ఇట్లు పంద్రెండేండ్లు గడిచినవి. అలనాడు సరోవర జలమును గ్రోలుటకై, తాపసి వేషమున నున్న దత్తభగవానుని సమక్షమున గావించిన వాగ్దానమునకు నిండుదనము సమకూరి నది. మంత్ర దీక్షపూర్తియైనంతనే దత్తభగవానుడు గోరక్‌నాథ్‌తో భర్తరి నవకవులలో ద్రుమిళుని అంశమున నుదయించినవాడు. నవనాధులలో నొకనిగ నుండ దగిన యోగ్యుడు. ఆతడిపుడు భార్యావియోగమును భరింపజాలక ఆమె నామమే, మంత్రముగ ద్వాదశాబ్దములు జపము సలిపినాడు. నీవు యుక్తి యుక్తముగ నటించి యాతనిని నాకడకు గొనిరమ్మని యాదేశము నొసగెను.

గోరక్షుడు భర్తరి యున్నతావును జేరెను. కుండనొకదానికి రంగురంగులతో రమ్యముగ చిత్రించి నెత్తిపై నుంచుకొని భర్తరి కట్టెదుట ఆకుండతన చేయిజారి పడి శిథిలమై పోయినట్లుగ నటించెను. కుండ పెంకులనన్నింటిని జతగూర్చుచు నిట్లు వాపోయెను. "ఏడు రంగుల మేలు కలయికచే నీలాలనింగిలో నిగనిగలాడు హరివిల్లువలె నయన మనో మోహనమై నాడెందమునకమందానందమును గూర్చుచు క్షణమైన నన్నెడ బాయిన కుంభరాజమా! నేటికి నేల పాలైతివా? అయ్యయ్యో!! అమరావతి యందలి అమృతకలశమే నీకు శతాంశమునకైనను సాటి రాదన ఇక వ్రేపల్లె వాడలోని క్షీరభాండములను పేర్కొననేల? విధి యిట్లు నన్ను నేటికి వంచిం చెను కదా!!

భర్తరి యాదృశ్యమును జూచినాడు. దత్తభగవానుని సంకల్పమున యాతని దురంత దుఃఖము దూరమైనది. గోరక్షుని జూచి "అయ్యా! మట్టి

కుండలు పగిలి పోయిన కంటికి మంటికి నేకథాగిగ నేడ్చు వారు నీవు దప్ప నింకొకరుందరు గదా? నీచర్య కడుచోద్యముగ నున్నదని" నవ్వినాడు.

అందులకు గోరక్షుడు, "మహాశయా! మట్టికుండ లెంతో మానవ దేహములు సహితమంతియే యని తెలియని వాడవు నీవొకడవే కాబోలు. కులాలు నింటి మంటికుండ లెంతో, బ్రహ్మనిర్మితములగు మానవ శరీరము లంతియే సుమా!! విశేషమేమన జీవరాసులకు విధాత ప్రాణములు పోయును. కాలము దీరిన పిదప మానవ దేహములు సహితము మంటి కుండల వలె నేల పాలు కావలసినదేకదా? యన భర్తరి యిట్లు బదులాడెను.

"అయ్యా! కోటి స్వర్గ సుఖములను మూటగట్టి మురిపెము లొలికించుచు ముద్దుముచ్చటగ ముసిముసి నగవులతో రంజిల్లజేయు పింగళ ఎక్కడ? నీ మృణ్మయ భాండ మెక్కడ?

అందులకు గోరక్షుడు అయ్యా! పెక్కుమాటలేల? నీ అర్ధాంగి లక్ష్మియగు పింగళ వంటి వారలను వెయ్యార్లుగ నీకనుల ముందు ప్రదర్శింప జేయుటొక వింతగా నేరదు. కాని నా కుంభ రాజమునకు సాటియగు దానిని సృష్టింప వశమైనది కాదు సుమా!! అని శాబరీ విద్యా ప్రభావమున గోరక్షుడు అనేకమంది పింగళలను అప్పటికప్పుడే అచట కల్పించెను. భర్తరి కన్నులు భ్రమసినవి. అచ్చుగ్రుద్దినట్లు పింగళ రూపమున నున్న వారెల్లరు భర్తరి చుట్టుముట్టి హావభావ విలాసముల నొలకబోసిరి. కామోద్రేకము నాపుకొనజాలనియట్లు నటించి తియ్యనికోరిక నీడేర్చు మనిరి.

అపుడు గోరక్షుడు "అయ్యా! నిద్రాహారములు మాని కంటికి ఱెప్పలు గట్టుకొని నీ వింతకాలము పింగళకై వాపోయితివి. అనేకమంది పింగళలతో హాయిగ నుండుము. ఆడుచు పాడుచు ఆనందము ననుభవింపుమన భర్తరి గోరక్షునితో

"మహాప్రభో !! ఒక పింగళతోడి విరహమే నన్నింతకు దెచ్చి నిలువున క్రుంగదీసినది. ఇంత మంది పింగళలను చూచుటకే నాకు శక్యముగా కున్నది. గతంనాస్తి, ఈ పింగళ రూపముల నదృశ్యముగావించి నన్ను కృతార్థుని గావింపుము నన్నుదయజూడుమని ప్రార్థింప గోరక్షుడు భర్తరిని శ్రీదత్త భగవానుని కడకు గొనిపోయెను.

దత్తభగవానుడు భర్తరికి నాథ దీక్ష నొసగెను.



## మీననాథుడు - చౌరంగనాథుల చరిత్ర

గోరక్‌నాథుడు కానీఫాతో మామిడితోట యందు కలిసినపుడు తమగురువైన మత్స్యేంద్రునాథుడు స్త్రీరాజ్యమునన్నున్న వాడని తెలిసికొనెను. నాటి నుండియు గోరక్షుడు సర్వకాల సర్వావస్థలయందు గురుస్మరణ జేయుచు గురు సందర్శనార్థమై స్త్రీరాజ్యమునకేగ స్థిర సంకల్పము గావించు కొనెను. ఆడవారి రాజ్యము నందు పురుషులకు ప్రవేశార్హత లేదని తెలిసికొనినాడు. అయినను వెనుదీయక సమయమునకై వేచియుండెను.

వేశ్యాంగనలు కొందఱు రాణిని సందర్శించి నృత్య ప్రదర్శనమున వారికి గల నైపుణ్యమును జూచి ద్రవ్యమును మూటగట్టుకొని వచ్చుటకై బయలుదేరుచుండిరి. గోరక్షుడు వారి ననుసరించెదనన - వారదెట్లు సాధ్య మగును? మగపురుగు సహిత మా రాజ్యమున ప్రవేశించుటకు వీలుదేదని తెలియని వాడవా యేమని పలికిరి. అందుకాయన "వార నారీమణులారా! మృదంగమును వాయించుట యందు నాకు గల ప్రజ్ఞ అసమానము. నీ నృత్యమును నావిద్యా ప్రభావమున రక్తిగట్టిరాణి గారి మెప్పును బడసి మీరాశించిన ధనమున కన్న మిక్కుటముగ లభించ గలదనెను. వారి యొద్దనున్న మృదంగమును తీసికొని తన ప్రావీణ్యమును జూపెను. ఆ మృదంగ వాద్యమునకు వారవనితలు ముగ్ధులై ముక్కుపై వ్రేలిడుకొని ముదమొందిరి. అయినను మగవానిని వెంటబెట్టుకొని వెళ్లుటెట్లని వారుముందు వెనుక లాడుచుండ గోరక్షుడు స్త్రీవేషమును దాల్చివచ్చెను. అచ్చుగ్రుద్దినట్లు ఆడవారివలె నున్న యాతనిని వేశ్యావ్రాతము తమవెంట గొనిపోయిరి.

నాట్యకళాప్రదర్శనమున కొకదినము ఏర్పాటైనది. మైనాకినితో బాటు మత్స్యేంద్రుడు ఉచితాసనము నలంకరించెను. ఉన్నతపదవుల యందున్న మహిళా మణులెల్లరు సభనలంకరించిరి. వేశ్యలు తమ సౌందర్యమునకు మెఱుగులు దిద్దుకొని సభాభవనమును జేరి కాలికి గజ్జకట్టిరి. స్త్రీ వేషమున నున్న గోరక్షుడు మృదంగమును కడునైపుణ్యమున మ్రోగించుచు సభ వారిని మంత్రముగ్ధరాంద్రను గావించెను. వేశ్యల కాలి యందలె రవళులకను గుణ్యముగను, లయబద్ధముగ జావళికి తాళగతి తప్పనియట్లు పలికించుచునే అవకాశమును కల్పించుకొని" మత్స్యేంద్ర గోరక్ ఆయా!" యను పలుకులను వినిపింప జేయుచు గురువు వంక జూచుచుండెను. ఆ మృదంగ ధ్వనులు,

స్త్రీ వేషముననున్న గోరక్షుని చూపులు మత్స్యేంద్రునకు బోధపడినవి. వేశ్యలకు భూరి సంభావనలొసగి సత్కరించి సాగనంపెను.

మత్స్యేంద్రుడు ఏకాంతముగ నున్నపుడు గోరక్షుడు కలిసి "గురుదేవా! మనమిచట నుండి వెడలుదమని సవినయముగ విన్నవించెను. ఈ విషయము మహిళాలోకపు రాణియను మైనాకినికి తెలిసి, గోరక్‌నాథుని సహితము నిర్భరవయః పరిపాకమున నిగ్గుదేలి, నీలాలనింగిలో నిగనిగలాడు చందమామను బోలు సుందరాంగ నలవలలో దగుల్కొను నటుల ప్రయత్నములు సలిపిరి. గోరక్షుడు ఊర్ధ్వ రేతస్కుడు. అస్ఖలిత బ్రహ్మచారి, కాంతల వంక కామమోహితుడై కన్నెత్తి చూడ నొల్లనివాడు. గొప్ప విరాగియగుటచే మైనాకిని ప్రయత్నములు పన్నాగములు ఫలించ వాయెను. ఏది యేమైననేమి? ఎట్టకేలకు మత్స్యేంద్రుడు మైనాకినిని నారీ సామ్రాజ్య మును వదలి వెళ్లుట తప్పదాయెను. మైనాకిని చేయగల దేమున్నది? వారి ప్రేమ ఫలమగు మీననాథుని మత్స్యేంద్రునకు ఒప్పజెప్పి ఒక బంగార పుటిటుకను జోలె యందు పడవైచినది. మత్స్యేంద్రుడుజోలెను చంకనిడుకొని మీననాథుని వెంట నుంచుకొని గోరక్షునిగూడి స్త్రీసామ్రాజ్యమును వదలి పయనము సేయుచునొక అరణ్యమున ప్రవేశించినాడు.

మైనాకిని, మత్స్యేంద్రుని వియోగమునకు మీననాథుని ఎడబాటున కోర్వజాలక పరిపరివిధముల పరితాపము నొందుచుండ ఉపరిచర వసువు ఆమె వద్దకు వచ్చి "కుమారీ! ఏలయిట్లు దురంత దుఃఖముననుభవించు చున్నావు? నీ స్వస్థలము దేవలోకము, శాపవశమున నీవు భూలోకమును చేరియున్నావు. శాపము దీరి దేవ లోకమును నీవు చేరు సమయమా సన్నమైనది. నీవారలను గూర్చి నీవు చింతించుట కిది సమయముగాదు" అని ఓదార్చెను. మైనాకిని ఉపరిచర వసువుతో బాటు దేవలోకమును చేరినది. మీననాథుడు బాలుడగుటయే గోరక్‌నాథుడా బాలుని తన భుజములపై కెక్కించుకొని అడవియందు పయనించుచుండెను. ఒక నదీ తీరమును చేరినంతనే మత్స్యేంద్రుడు. గోరక్షుడు ప్రయాణపు బడలికను దీర్చుకొని హాయిగ విశ్రమించిరి. బాలుడగు మీన నాథుడు మలవిసర్జనము గావింప బాలుని శరీరమునకు మలము అంటుకొని యుండినది. మత్స్యేంద్రుడు గోరక్‌నాథుతో బాలుని పరిశుభ్రము గావింపుమనెను. గోరక్‌నాథుడు బాలుని నదీతీరమునకు గొనిపోయి-చాకలివాడు మాసిన బట్టను బండపై నుతికినటుల మీననాథుని శరీరము నందలి రక్తమాంస



పురీషమూత్రములను తొలగించి, తోలు శరీరమును చెట్టునకు వ్రేలాడ దీసినాడు. మత్స్యేంద్రుడు వారున్న కడకు వచ్చి మీననాథుడెక్కడ యని యడిగెను. "గురు సార్వభౌమా! బాలుని లోపలను వెలుపలను శుభ్రపరచి అదిగో, ఆ చెట్టుపై ఆరవేసియున్నానని" చూపెను. మత్స్యేంద్రుడు, ఓయీ! ఎంతపని చేసితివి? నేను చెప్పినదేమి? నీవు చేసినదేమి? పసిబాలుని ప్రాణములను దీయుటకు నీకు చేతులెట్లాడినవి? హా! మీననాథా! యని విలపించుచుండ, గోరక్‌నాథుడు గురువునోదార్చి మృతసంజీవినీ మంత్ర ప్రభావమున బాలుడగు మీననాథుని మునుపటి వలె తండ్రి కన్నుల ముందుంచెను. మత్స్యేంద్రుడు గోరక్‌నాథుని మిక్కిలి కొనియాడ "గురుసార్వభౌమా! సర్వజ్ఞులు సర్వశక్తి సమన్వితులగు మీరిట్లు వాపోవుట తగునా?" యని యడుగ "శిష్యరత్నమా! నీశక్తి ప్రభావమును పరీక్షింప నేనట్లు దుఃఖమున మునిగిన యట్లు నటించితినే కాని, నీవు అమేయన ప్రభావుడనని నాకు తెలియనిది"కాదనెను.

వారు మువ్వురు కీకారణ్యమును జొచ్చి పయనము గావించుచుండిరి. మత్స్యేంద్రుడు గోరక్షునితో "శిష్యాగ్రణీ! కాకులు దూరని యీ కారడవి యందు దొంగలు చుట్టుముట్టి మనలను బాధించుదురేమో కదా" యనెను. అందులకు గోరక్షుడు "గురుదేవా! మనవద్ద నేమున్నదని దొంగలనుగూర్చి భీతిల్ల వలయును. సాధువులమగు మనను జూచి వారు దండము బెట్టి దూరముగ తొలగిపోవుదురు లెమ్మ"నెను. సరి మంచిదని గురువు తెలిపెను. వారుకొంత దూరమేగ నొక నీట మడుగు కాన్పించినది. గురువు బహిర్దేశమునకై వెళ్లివచ్చెదనని తన చంకయందున్న జోలెను గోరక్షున కొసగెను. ఆ జోలె చాలబరువుగ నుండినది. అదియేమని గోరక్షుడు గురువు జోలెను పరీక్షింప నందొక బంగారపు టిటుక కనులను భ్రమింప జేసినది. ఈ యిటుక గురువుగారి మస్తిష్కము నందు శ్రావణమేఘముల వలె మెదలుచుండిన దని యీ బంగారు ముద్దను చేరువ నున్న ముండ్లపొదలో బడవైచెను. గురువుగారు దేహబాధనపనయించుకొని శుచిర్భూతుడై మరలివచ్చి జోలెను గైకొననది తేలికగ నుండినది. బంగారపు టిటుక లేదాయెను. "అయ్యాయ్యో!! నా బంగారు నేమి జేసితివి? ఎందు పడవైచితివని" వ్యథనొందుచుండ గోరక్షుడు బదులాడకుండెను. కొంత దూరమేగినంత నొక రాతిపై గోరక్షుడు మూత్రవిసర్జన మొనరింప నారాతి గుట్ట పదునారు వన్నెలీనుచు కనత్కనక మయమై మిసమిసలాడు చుండినది.

అంత గోరక్షుడు "గురు సార్వభౌమా! తమరికెంత బంగారము కావలయునో తెలిపిన అంత బంగారమును మూటగట్టు కొనివచ్చుటకీ శిష్య పరమాణువు సిద్ధముగనున్న వాడని" చేతులు జోడించి విన్నవించుకొనెను. "శిష్యరత్నమా! నాకు బంగారముతో నేమి పనియున్నది. నీశక్తులను మహిమలను చూడవేడుక నొంది నేనట్లు నటించితినని మత్స్యేంద్రునాథుడు గోరక్షుని ప్రశంసించెను.

ఒకదినము మత్స్యేంద్రనాథుడు గోరక్షుని జూచి "వత్సా! నాకు చాలకాలము నుండి పేదలకు, సాధువులకు ఆ కొన్నవారి కెల్లరకును కడుపార భుజింపజేయు సంకల్పము కలదనెను, అష్టసిద్ధులు గోరక్షుని కడ పరిచారికలవలె ఊడిగము సలుపు చుండును. మంత్ర ప్రభావమును గోరక్షుడే నాటికానాడు అన్నమురాసులుగ సృష్టించి భక్ష్యభోజ్య చోష్య లేహ్యమధుర పానీయములను జతగూర్చుచుండెను. నేల నాలుగు చెఱగుల నుండి లెక్కకు మిక్కుటముగ వచ్చినవారు సంతృప్తిగ భుజించు చుండిరి.

సాధుసంతర్పణమతివైభవముగ పుంజుకొనినది. వారొక పట్టణమును జేర పట్టణ వాసులెల్లరు గుంపులుగ గూడి యొక హృదయవిదారక ఘోరదృశ్యమును గాంచి కంటతడి బెట్టి వ్యధ నొందుచుండిరి. మత్స్యేంద్రుడా చూడవచ్చిన వారిని విషయమేమి? మీ విషాదమునకు కారణమేమని యడుగ వారిట్లు తెలిపిరి. "మహానుభావా! ఈ పట్టణమునేలు రాజునకు పెద్దకాలము సంతానము లేకుండినది. పుత్రుని బడయుటకై భగవంతుని సేవింప యాత్రలకై బయలుదేర నొక పుణ్యనదీ తీరమున అందాల జాబిలి వంటి శిశువారాజు కగుపించెను. ఆడబోయిన తీర్థమెదురైనట్లు దయామయుడగు భగవంతుడు తనకా విధముగ కుమారుని ప్రసాదించినాడని రాజు ప్రమోదము నొందెను. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రుని పగిది దినదినాభివృద్ధి గాంచుచు, పెరిగి పెద్దవాడాయెను.

రాజుమంత్రులను రావించి తనకుమారునకు తగిన చక్కని చుక్కను జూచి పెండ్లి గావించుట తన యభిమతమని - దేశదేశముల యందున్న రాచకన్నియల చిత్రపటములను గొని రమ్మని యాదేశించెను. భగవంతుని లీలలు దురూహ్యములు, కడుంగడు విచిత్రములు. మహారాణి దైవ నిర్ణయమున మరణించినది. రాకుమారునికై తెచ్చిన అంగజురాణి వంటి అందాల రాకుమారి చిత్రపటమును చూచి రాజా కన్యామణిని పెండ్లి యాడెను. రాకుమారుని పెండ్లి తాత్కాలికముగ రాజు తలపెట్ట డాయెను.



రాణి వాసమునకు రాకుమారిని భవన మెడముగ నుండినది. రాజపుత్రునకు తనపిన తల్లి ముఖ సందర్శనమున కవకాశమే లేకుండినది. రాణికి రాకుమారుని గూర్చి యేమియు తెలియకుండినది. కాని రాకుమారునకు తన తండ్రికి పునర్వివాహము జరిగినట్లు తెలియును. మహారాజు వేటకై పరివారమును వెంటగొని అడవి కేగెను. రాకుమారుడొక దినమున మాపటివేళల తానున్న మేడపై నుండి గాలిపటముల నెగుర వేయు చుండెను. ఆ గాలిపటములు విను వీధియందు విహంగముల వలె విహరించు చుండినవి. రాణి ఉబుసుపోకకై సౌధోపరిభాగ మును చేరినది. దాసి యొకతె నామె ననుసరించినది. లోగుట్టు పెరుమాళ్లకెఱుక. రాకుమారుని కథ ఇట్లు పరిణ మించిన దనివారు తెలిపిరి. మత్స్యేంద్రుని దివ్యదృష్టికి తదుపరి ఘట్టము కన్నులకు గట్టినట్లైయినది.

సాయం సమయమున ప్రకృతి సౌందర్యమును జూచి యానందించు రాణికి గగన భాగమున గప్పుమని విహంగము వలె విహరించు గాలి పటము కనుల పండువు నొసగినది. గాలిపటము నాటలాడించు రాకుమా రుని వంకకు దృష్టి మరలినది. అప్పులల్లార్పక నాయువకుని జగన్మోహనా కారమును జూచి ఏదో ఏదో తెలియని యానందము ననుభవించినది. తొలి చూపునందే తియ్యని కోరికలు మదిలోనీరికలెత్తినవి. చిత్తము చిగురించినది. చిత్తజుడామెపై పూలబాణములను వదలెను కాబోలు - నిట్టూర్పులు వదలుచు నిలువ జాలక - కాలుకదుపజాలక నా నవ మోహనాకారుడెవడని దాసినడిగినది. దాసి యా అందగాడు ఆమె కుమారు డని తెలిపినది. ఆ సుందరాంగుని తన కడకు దోడ్కొని రమ్మని పంపినది. దాసి యాతని చెంతజేరి మహారాణిగారు రమ్మనుచున్నారిన తెలిపినది.

రాకుమారుడు తల్లిని జూచు భాగ్యములభించినదని సంతసించి ఆమె దరిజేరి పాదాభివందన మాచరింప నా మద విహ్వలాంగి యిట్లు మాటలాడినది. రాకుమారా! మారసుకుమారా!! వయస్సున నీ కన్న నేను పిన్నదానను, నమస్కరించుట తగదు సుమా!! రాక రాక వచ్చితివి. విందారగించి సావకాశముగ వెళ్ళవచ్చును. మీ తండ్రిగారు సహితమింట లేదు. ఒంటరితనము నోర్చుకొనుట బాధాకరముగ నుండును కదా! అమ్మా!! మా తండ్రిగారు వచ్చినంతనే నేను ఆవశ్యము మీ సన్నిధికి రాగలను. అది మరియొక విషయము ఒకించుక సేపు నిలిచి నేనొసగు మధురాహారముల నారగించి వెడలుట మేలైనదని శయనమందిరమున హంసతూలికా తల్పమును జూపి సుఖాసీనుగవగు మనెను.

అమ్మా, నేను నీ కుమారుడను మీ పడకగదిని ప్రవేశించుట మహాపరాధము సుమా!! మనోహరా! నీవు నన్ను అమ్మాయననేల? నినుకని పెంచిన దాననాయేమి? నాకుమారుడనంటివి. కుః అనగా భూమి మారుడనగా మన్మధుడు. నీవు మహీ తలమున వెలసిన మన్మథుడవని విపరీత వ్యాఖ్యానమొనరించెను.

రాకుమారుడామె పయోముఖ విషకుంభమని వేవేగ అంతఃపురమును వదలి తన మందిరమున ప్రవేశించెను. స్త్రీ బుద్ధి ప్రళయాంతకమని పెద్దలాడుదురు. రాజువేట నుండి మరలివచ్చి మందిరమున ప్రవేశించి నంతనే ఆ అంభోరు హాక్షిభోరు భోరున విలపించినది. రాజామె దుః ఖమున కేమి హేతువని యడిగెను. మహారాజా, ఏమని తెలుపగలను నాకు నోరాడకున్నది-ఒక మాటగ తెలుపవలయుననిన వలదని నేనెంత వారించినను నీవు లేని సమయమున మీ సుపుత్రుడు నీకది తగదు తగదని పాదములంటి వేడినను వదలక నన్ను బలవద్గమన మొనరించి వెడలి పోయెనని వెక్కివెక్కి ఏడ్చినది. ఇక బ్రతికి సుఖమేమున్నదని నెత్తిపై బాదుకొనినది. అంగనల నమ్మరాదని తెలియని వాడెవ్వడు? రాజా విషయమును విచారింపక యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యుడై రాకుమారుని పట్టణమున శృంగాటకము (చౌరస్తా) యందుబల్ల పలకపై పరుండబెట్టి కాలుసేతులను ఖండింపుమని తలవరులకానతి నొసగెను.

మత్స్యేంద్రుడా వృత్తాంతమునంతయు దివ్యదృష్టిచే తిలకించినంత రాకుమా రుడు నవనాదులలో నొకడని అవగతమైనది. రాజు సమ్మతిపై యారాకుమారుని తమ వెంట హిమాలయ పర్వతములకు గొనిపోయి తెగిన కాలు సేతులకు ఆకు పసరులను జేర్చిన నూనె గుడ్డలను కట్టి యొకగుహ యందు కూర్చుండనియోగించి ఏకాగ్రచిత్తమున దృష్టిని నిలిపి తపమొనరింపు శక్తి సామర్థ్యములను ప్రసాదించి మత్స్యేంద్రుడు గోరక్షుడు వెడలిపోయిరి. కాలుసేతులు తెగిన రాకుమారుడు సర్వకాల సర్వావస్థల యందు సర్వేశ్వరుని ధ్యానించుచు తపమొనరించుచుండెను-తపః ప్రభావ మున సాధింపరాని దేమున్నది. రాకుమారునకు కాలుచేతులు యధా తధముగ అచిర కాలమున నేర్పడినవి.

ఈయనయే చౌరంగనాధుడని నవనాధులయందు ప్రసిద్ధిగాంచిన వాడయెను. గోరక్షుడు చౌరంగనాధుడు తపమొనరించుగుహవద్ద కేగి కాలుసేతులేర్పడినందులకు సంతసించి మంత్రోపదేశము నొసగి నాధ దీక్షనిడెను. పూర్వమాయన కాలుసేతులు ఖండింపుమని యానతి నొసగిన రాజేలు పట్టణమును ఇరువురు ప్రవేశించిరి.

"సాధూనాం దర్శనం పుణ్యం" అని ఆదేశపురాజు గోరక్షుని చౌరంగ నాధుని సందర్శింప పురోహితామాత్య ప్రధాన పౌరజనుల గూడి బయలు దేరెను. గోరక్ నాధుడా వచ్చెడి వారలపై చిటికెడు భస్మమునభి మంత్రించి వాతాస్త్రమును ప్రయోగింప రాజుతో బాటాయన ననుసరించి వచ్చిన వారెల్లరు ఝంఝూవాతమునకు ఎండు టాకులవలె గాలిలో కొంతవడి తేలియాడదొడగిరి. గోరక్‌నాధుడు వారి అవస్థను గాంచి దయతలచి మంత్రప్రభావమున వారిని భూమిపై నిలుచునట్లు గావించెను.

ఆమహానుభావుని పాదములపై రాజు సాగిలబడి నమస్కరింప గోరక్‌నాధుడు చౌరంగనాధుని జూచి "ఈయన ఎవరో నీవు గుర్తింపగలవా? యని యడిగి మరల నిట్లు వివరించెను. అలనాడు నీవు నీ ఆలి మాటలను నిజమని నమ్మి నీతలవరులచే కాలుసేతులు తెగద్రుంచబడిన నిరపరాధి ఇతడే సుమా! యని చౌరంగ నాధుని వలన రాజు జరిగినది విని రాణిని సంహరింప నుద్యుక్తుడాయెను. చౌరంగ నాధుడు స్త్రీ హత్య మహాపాపమని రాజునడ్డుకొనెను. రాజా దుస్స్వభావురాలిని వదలి వైచెను.

చౌరంగనాధుడు హిమవత్పర్వత గుహయందు తపమాచరించు సమయమున గోరక్షుడు మత్స్యేంద్రునితో గూడి పయనించుచు గురువుగారి నొక చెట్టు నీడన విశ్రమింపుమని అడ్బంగనాదుని చెంతజేరెను. గోరక్షుడు అడ్బంగ నాధుని జూచి "మహాత్మా!! తాము తపోధనులవలె నాకు దోచుచున్నది. మంత్రోపదేశమొసగి నన్ను కృతార్థుని గావింపుమనెను. అడ్బంగ నాధుడా మాటలను విని గోరక్‌నాధుతో "అయ్యా! మీ పలుకులు వింతగనున్నవి. నీకు వయస్సు మళ్లినను గురూపదేశము నొంది యుండలేదా? నాతో పరిహాసములాడుచున్నటులున్నది. నాకొక మంత్రము నుపదేశించి తరింపజేయుమని అడ్బంగనాధుడు తన కుడిచెవిని గోరక్‌నాధు పెదవుల కడనుంచెను. గోరక్షుడాయనకు తారకమంత్రోపదేశమొసగి నాధసాంప్రదాయమున అడ్బంగనాధుడొకడాయెను.

**పరకాయ ప్రవేశము :**

గోరక్షుడు, మత్స్యేంద్రనాధుడు దేశపర్యటనము సేయుచు నొక పట్టణమును చేరిరి. త్రిలోచనుడను ఆదేశపు రాజు మృతినొంద మృత

దేహమును రాజలాంఛనము లతో శ్మశానమునకు గొనిపోవుచుండరి. ఆ రాజు ప్రజలను కన్నబిడ్డలకన్న మిన్నగ దయజూచిన వాడుకావున ప్రజలెల్లరా రాజు దివంగతుడగుటకు దుఃఖసముద్రమున మునిగి తెప్పరిల్లుకొనజాలరైరి. మత్స్యేంద్రుడు రాజును బ్రతికించి ప్రజలకెనలేని యానందమునుగూర్ప నభిలషించెను. త్రిలోచనుడు బ్రహ్మజ్ఞాని కావున ఆయన ఆత్మ పరమాత్మయందైక్యము నొంది యుండినది. అట్టి వారలకు పునర్జన్మ యనునది యుండజాలదు. అట్టి వారలను బ్రతికించుట అసంభవము. ఆ కారణమున మత్స్యేంద్రుడు తన సంకల్పమును విరమించుకొనెను.

గోరక్‌నాధుడు "గురుదేవా! కన్నతండ్రిని గోల్పోయినటుల ప్రజలెల్లరు మనోవ్యధ నొందుచున్నారు. రాజును బ్రతికించి ప్రజలకు అమందా నందమును గూర్పనాకు మనసైనది.న మీ రానతి నొసగిన నేను రాజును బ్రతికించెదను లేకున్న అగ్ని ప్రవేశమొనరించెదనని" శపథము చేసెను. మత్స్యేంద్రుడు మౌనముద్ర దాల్చి యుండ గోరక్‌నాధుడు గురువు సమ్మతించి నాడని యెంచి తనశక్తి ప్రభావమును ప్రదర్శించెను. ప్రయోజనము లేకపోయినది. శపథము మేరకు అగ్ని ప్రవేశ మొన రించుట విధాయక మైనది. మత్స్యేంద్రుడు శిష్యవాత్సల్యమున" వత్సా! సాహసింప కుము. నీకనుగ్రుడ్లను పెకలించి గారెలను గొనితెచ్చి నీ గురుభక్తిని ప్రదర్శించిన ఉత్తమ శిష్యునివి నీవు, నీ గురుభక్తి మెచ్చదగినది" యని వారిరువురు శ్మశానము కడనున్న శివాలయముకడకేగిరి.

శివాలయమునందు శివార్చన సలుపు స్త్రీ యొకర్తు వారి కంటబడినది. మత్స్యేంద్రుడామెతో "అమ్మా! త్రిలోచనుని మరణమునకు ప్రజలెల్లరాబాలగోపాలము దురంత దుఃఖము నొందుచున్నారు. వారికి సంతసమును గూర్పనేను పరకాయ ప్రవేశ మొనరింపదలచి యున్నాను. అందులకు నా శరీరము నిచట భూగృహమున దాచి యుంచుదును. నీ వీ రహస్యము నెవ్వరి చెవిని బడవైకుమని తెలిపి–మత్స్యేం ద్రుడు తన శరీరమునందుంచి త్రిలోచనుని శరీరమునందు తన జీవాత్మను ప్రవేశింప జేసెను.

రాజు బ్రతికినందుల కాయన భార్య రేవతీ దేవి సంతసించినది. పురజను లెల్లరు హర్షాంబుదినోలలాడిరి. మత్స్యేంద్రుడు సర్వజ్ఞుడగుట వలన కొలువు కూటము నందు సింహాసనము నధిష్టించిన వేల యందును,





శయన మందిరమున రేవతీ దేవితో నున్న వేళల యందును అంతకు మునుపు త్రిలోచనుడెట్లో యట్లు ప్రవర్తించుచుండెను.

మత్స్యేంద్రుడు ఏకాంతముగ నున్న సమయమున గోరక్‌నాధుడాయన కడ సెలవు గైకొని దేశపర్యటనముకై బయలుదేరెను. ఒక దినము రాణియగు రేవతి శివాలయమునకు వెడలి సర్వమంగళయగు పార్వతీదేవిని పూజించి తనకు దీర్ఘ సౌమంగల్యమును ప్రసాదించుమని ప్రార్థించినది, అచట శివాలయము నందు అర్చకురాలిగనున్న స్త్రీరాణి ప్రార్ధన మాలకింపదైవ సంకల్పమున నవ్వువచ్చి నవ్వినది, అకారణ హాస్యమేమని రాణి గద్దించి యామె నడిగినది. అందులకా అర్చకురాలు "అమ్మా! మీ కడభయభక్తులతో వినయ విధేయతలతో మెలగ వలసిన మేము మీతో పరియాచకము లడుటయా? నేనెంత దానను అయినను మీరు నన్ను క్షమించెదనని అభయ మొసగిన నానవ్వునకు కారణమును తెలిపెదను. ఇది అతి రహస్యమగు విషయము, అని చేతులు జోడించి పలికినది. రాణి యా అర్చకురాలికి అభయ మొసగ ఇట్లు తెలిపినది.

అమ్మా మహారాజుల వారు స్మశానమునకు గొనిపోయెడి వేళన యోగీశ్వరు లిరువురు శివాలయమునందు ప్రవేశించిరి. అందు మత్స్యేం ద్రుడు అను మహ నీయుడు పరకాయ ప్రవేశ విద్యా ప్రభావమును రాజుగారి దేహమునందు ప్రవేశింప త్రిలోచన మహారాజునకు చైతన్యము లభించినది. మన కెల్లరకది వింతగ దోచిసంతసమును గూర్చినది, ఆ మహనీయును శిష్యుడు గోరక్‌నాధుడు. గురువు గారి శరీరము నీ శివాలయము నందు నేలమాళిగయందు కడుభద్రముగ దాచి దేశపర్యటన మొనరింప వెడలి యున్నాడు. కొలది దినముల కాశిష్యుడి చటకు రాగలడు.గోరక్‌నాధుడు వచ్చుటయే తడవుగ నిచట దాచిన మత్స్యేంద్రుని శరీరము నందు త్రిలోచన మహారాజుగారి యందిపుడున్న జీవాత్మ ప్రవేశింపగలడు. ఇది అంతయు ఈశ్వరుని అనంతమాయా విలాసముకదా? ఇది తెలిసికొన జాలక మనము ఏవేవో సంబందములు కల్పించుకొని బంధముల యందు దగుల్కొని బొమ్మలవలె నాటలాడుచున్నామని నా మదిలో మెలగినంతనే నవ్వు వచ్చినదని యాస్త్రీ దాపరికమనునది లేక నంతయు వెల్లడించినది.

మత్స్యేంద్రుని శరీరము శివాలయము నందు పదిలముగ నున్నకదా రాజు శరీరము నందలి జీవాత్మ యిందు ప్రవేశించుట – మత్స్యేంద్రుని శరీరమునే తునాతునకలుగ ఖండించుట వలన రేవతి తనకు దీర్ఘ

సౌమాంగల్యము స్థిరపడగలదని యోచించినది. భటులను రావించి భూగృహము నందున్న మత్స్యేంద్రుని శరీరమును ముక్కలు గావించి దిక్కులకు వెదజల్లుమనినది. రాణియానతిని భటులు పాటించిరి.

శంకరుని రాణియగు పార్వతీదేవి రేవతి చర్యను గమనించి చాముండ మున్నగు శక్తులను రావించి యా మహనీయుని శరీర భాగములను కడుభద్రముగ కైలాసమున జేర్చుమనినది. గోరక్‌నాధుడు దేశాటన మొనరించుచు హిమాలయ పర్వతమున గుహయందున్న చౌరంగనాదుని వెంటనిడుకొని మత్స్యేంద్రుడున్న శివాలయము నందు ప్రవేశించెను. గురువుగారి శరీరము పొలకువయే లేదాయెను. అర్చకురాలి వలన పూసగ్రుచ్చి నట్లు విషయము నంతయు విశదముగ వినినాడు.

గోరక్‌నాధుడు దివ్యదృష్టిని సారించి గురువుగారి శరీరపు మాంస ఖండములు కైలాసమున ప్రమధుల వశమున నున్నవని తెలిసికొనెను. కైలాసమునకేగి ప్రమధుల నడుగ వారా మాంస ఖండములను నిచ్చుటకు నిరాకరించిరి. గోరక్‌నాధుడు తన శక్తుల నుపయోగించి ప్రమధ గణములు నోడించి వారికడనున్న శరీరభాగములను గ్రహించెను. సంజీవినీ మంత్రమహిమచే మత్స్యేంద్రనాధుని స్థూలశరీరమును మునుపటివలె నిర్మాణము గావించెను. త్రిలోచనుని యందు జేరిన జీవాత్మ మత్స్యేంద్రుని యందు ప్రవేశించినంతనే రాజు గతించెనను వార్తపట్టణ మంతయు వ్యాపించినది.

మత్స్యేంద్రునకును రేవతికి ఒక కుమారుడుదయించి యుండెను. ఆ బాలుని పేరు ధర్ముడు. ఆ బాలుడు తండ్రి గతించెనని విలపించు చుండెను. రేవతి యా బాలునితో తన తండ్రి యా పట్టణమునందే శివాలయము నందు కలడని బుజ్జగింపు మాటలతో నోదార్చెను. ధర్ముడు - మత్స్యేంద్రుని - గోరక్‌నాధుని భక్తి గౌరవములతో రాజభవనమునకు దోడ్కొని వచ్చెను. గురుశిష్యు లిరువురు కొంతకాలము రాజ భవనము నందే నిలిచిరి. ధర్మునకు వయస్సు వచ్చినంతనే మత్స్యేంద్రుడు నాధ దీక్షనొసగి పట్టాభిషిక్తుని గావించిరి. పట్టాభిషేక మహోత్సవ సందర్భమున సాధువుల కత్యంత వైభవోపేతముగ సమారాదన జరిగినది. గురుశిష్యులు ధర్మునాశీర్వదించి దేశపర్యటనకై బయలుదేరిరి.

ఓం తత్ సత్







శ్రీరాములు - శ్రీపాద శ్రీవల్లభాయ నమః

## చర్పట్‌నాథ చరిత్ర

లోకకళ్యాణార్థము శివగౌరీ వివాహమహోత్సవమత్యంత వైభవోపేతముగ జరిగినది. ముప్పది మూడుకోట్ల దేవతలు దేవయోని విశేషమున బుట్టిన గంధర్వాదులు, అమర వేశ్యలాదిగా నెల్లరు కళ్యాణ వేదికపై పార్వతీ పరమేశ్వరులను నయనమనోరంజకముగ చూచి పరమానందము నొంది శీతశైలమును చేరిరి. త్రిపుర సుందరి యగు పార్వతి లోకమోహన మనోహర రూపమును జూడ మహాకారణాంతర మున బ్రహ్మదేవుని వీర్యము స్ఖలనమైనది. బ్రహ్మదేవుడు చేయునది లేక సభ్యతను పాటించి యా వీర్యమును ఒరులకంట బడని విధముగ తన కాలితో రాచి, రుద్దిన పిదప నది ఊడ్చబడి చివరకు నది నీటి ప్రవాహమున చేరినది. అమోఘమగు బ్రహ్మదేవుని రేతస్సు నుండి అరువది వేలమంది యుదయించిరి. వారే వాల ఖిల్యులని వ్యాస ప్రణీతమగు పురాణముల యందు పేర్కొనబడినది. బ్రహ్మవీర్యము నందలి కణమొకటి నది యొడ్డున చేరినది. యొక బాలుని రూపమును దాల్చినది నవకవులలో నొకరగు పిప్పలాదునుని తేజమా బాలుని యందు ప్రవేశించినది. పౌరో హిత్యమే జీవనాధారముగ నుండిన బ్రాహ్మణుడొకడు దర్భలను సేకరింప నదీ తీరమున కేగ నా బాలుడు విప్రుని కంటబడెను. పురోహితుడా బాలుని తన యింటికి గొనివచ్చి తన భార్యకొసగెను. సంతానలోపముచే సంతాపము నొందు చుండిన యా విప్రవనిత దైవానుగ్రహమునకు మిక్కిలి సంతసించి యా బాలుని కన్న కొడుకున కన్న మిన్నగ నత్యాదరమున పోషించు చుండినది. బాలున కైదవయేట అక్షరాభ్యాస మొనరించి పౌరోహిత్యమును కుపయుక్తమగు మంత్రముల నావిప్రుడు బాలునకు నేర్పుచుండెను. ఆ బాలుడు చర్పట్ యని వ్యవహరింపబడుచుండెను.

సృష్టికి పూర్వము ఆదినారాయణుడు జలరాశి యందు పవ్వళించి యుండెను. శ్రీహరి నాభికమలము నుండి బ్రహ్మదేవుడుదయించెను. విధాత తపోనిష్టను వహించి సృష్టి వ్యాపారముపలుప నుపక్రమించెను.

తొలుదొలుత బ్రహ్మపదిమందిని తన శరీరము నుండి సృజించెను. బ్రహ్మదేవుని బొటనవ్రేలు నుండి దక్షుడు, ఊరువు నుండి నారదుడు

నాభినుండి పులహుడు, చెవులనుండి పులస్త్యుడు, చర్మమునుండి భృగువు, చేతినుండి క్రతువు, ముఖము నుండి అంగీరసుడు, ప్రాణము వలన వశిష్ఠుడు మనస్సునుండి మరీచి, కన్నులనుండి అత్రియు ప్రభవించిరి.

ఒకసమయమున నారదుడు స్వర్గలోకమున కేగెను. దేవేంద్రుడు నారదుని జూచి "త్రిలోక సంచారులు, కలహప్రియులు, మీదు మిక్కిలి కలహ భోజనులగు సురమునీంద్రులకు సుస్వాగతము" అని చులకన జేసి సంబోధించెను. అది నారదునకు మనస్తాపము గావించి దేవేంద్రునకు బుద్ధి గరపుటకు తగిన సమయమునకై వేచియుండెను.

చర్పట్ అను బాలుడు బ్రహ్మవీర్యమున బుట్టి పురోహితుని యింట పెరుగుచు ప్రాయమున నున్నవాడగుట నారదుడు దివ్య దృష్టిచే తిలకించి, యా బాలునిచే శచీపతికి పరాభవము గావింపనెంచెను. అందులకు నారదుడు శ్రీదత్త భగవానుని సన్నిధిజేరి పిప్పలాయనుని అంశావతారమై చర్పట్ అను బాలుడు బ్రహ్మవీర్య సముద్భవు డగుటచే తనకు తమ్ముడగుట కారణముగ నాథదీక్ష యొసగుమని యర్థించెను. దత్తభగవానుడందులకు "సురమునీంద్రా!! నాథ దీక్షనవలంభింప విరాగులే అర్హులు. సంసారలంపటు లందులకు అర్హులుకాజాలరు. ఆ బాలుడు ప్రపంచమును రోసి పరమార్థముపై దృష్టిని నిలిపి నా చెంత జేరి నన్నాశ్రయించిననాడు. నాథ దీక్షయొసగి యనుగ్రహించుదును లెమ్మని" నారదుని సమ్మతింపజేసెను.

నారదుడు బ్రహ్మచారిరూపమును ధరించి చర్పట్‌ను పెంచి పోషించు పురోహితుని ఇల్లుజేరి "మహానుభావా! మీకడ విద్య నభ్యసింపనెంచి వచ్చిన వాడను నేను, నన్ననుగ్రహింపుమని" యర్థించెను. ఆ వచ్చిన బాలుని ముఖమున వెల్లివిరియు బ్రహ్మతేజమును గాంచి, చర్పటునకు చేదోడు వాదోడుగ నుండగలడని మదినెంచి యా బాలుని పురోహితుడు తన యింట జేర్చుకొనినాడు. బాలుని రూపమును దాల్చిన నారదుడు కుటుంబయను పేరున పిలువబడుచుండెను.

ఒక దినము పురోహితుడు, కుటుంబను జతగూర్చి ఆయూరనున్న గృహస్థుని యింట పురోహిత కార్యక్రమమును నిర్విఘ్నముగ నెరవేర్చి రమ్మని చర్పటుని పంపెను. మంచి సమయము మించిన దొరకదు. ఆలసించిన ఆశాభంగమని కుటుంబ చర్పటునితో "మిత్రమా! మనము వయస్సున పిన్నవారలము, లోకానుభవముతక్కువ యైనను గృహస్థులు విది విధానముగ



తమ ప్రయోజనముల నీడేర్చుకొనుటయే కాని అందులకు తగిన ప్రతిఫలమును దక్షిణల రూపమున నిచ్చుటకు కాని వెనుకాడుదురు. మీదు మిక్కిలి మనవయస్సును దృష్టి యందుంచుకొని వారిచ్చునది అత్యల్ప స్వల్పముగ నుండగలదు. కావున నీవు వారితో దిట్టముగ వాదులాడినగాని సరియగు ప్రతిఫలము లభింపనేరదని" ఊదిపల్కెను.

చర్పటుడు – కుటుంబలు గృహమేధి యింం పౌరోహిత్యమును పూర్తిగావించిరి. ఇంటియజమాని చర్పటునకు దక్షిణనొసగినది యత్యల్ప స్వల్పమై యుండగలదని యెంచి యాద్రవ్యమును తీసికొనుటకు నిరాకరించి వాగ్వాదమునకు పూనుకొనినాడు. అది యదనుగ నెంచి కుటుంబ యటనుండి జారుకొని చర్పటుడు ఇంటి వారలతో కలహించుచున్నాడని తెలిపెను. పురోహితునితో గృహమేధి – చర్పటుని దుడుకు తనమును – దక్షిణను గ్రహింపక ఇబ్బడి ముబ్బడిగ నివ్వవలసినదని వాదులాడుటను గూర్చి నేరారోపణజేసెను. పురోహితుడు చర్పటుని చెంపపై నాలుగు దెబ్బలు వేసెను.

చర్పటుడు సరాసరి ఇంటికేగుట కిష్టపడక నాయూరనున్న శివాలయ మున కేగెను. నారదుడు కుటుంబరూపమును వదలి మఱియొక రూపమును దాల్చి "బాబూ! ఎవరునీవు? ఎందులకేడ్చుచున్నావని" సానుభూతిని ప్రకటించి పరామర్శించెను. చర్పటుడు "మహాశయా! ఈ యూరనున్న పురోహితుని యింట కుటుంబయను నతడు కలడు. అతడు నా ప్రాణస్నేహితుడు. నేనీయూరు వదలి ఎచటకైన నేటి విద్యనభ్యసింప దలచినాను. నా ప్రాణమిత్రునిచటకు దోడ్కొని వచ్చి పుణ్యమును మూటగట్టుకొనుమని" నారద వేషధారితో తెలిపెను.

నారదుని రొట్టె విరిగి నేతిలో బడినట్లయినది. నారదుడు మరల కుటుంబ రూపమును ధరించి చర్పటు నోదార్చినట్లభినయించి ఇంటికి పోవుదము రమ్మని బ్రతిమాలెను. ససేమిరా – రానని చర్పటుడు మొండి పట్టుబట్టి వదలడాయెను. నారదుడు చర్పటుని వెంటనిడుకొని శ్రీదత్త గురుదేవుల సన్నిధిజేరెను. దత్తభగవానుడు చర్పటునకు నాథదీక్షనొసగెను. అలనాటి నుండి ఆయన చర్పట నాథుడని విశ్వవిఖ్యాతి గాంచెను.

చర్పటనాథుని నారదుడు సత్యలోకమునుకు గొని బ్రహ్మసదనమునకేగి పరమేష్టితో "లోకపితామహా! ఈ బాలుడు నీ యంశమున బుట్టినవాడు.

నేనెటుల నీకు పుత్రుడనగుదునో యీ చర్పటనాథుడును నీకు పుత్ర సమానుడగును. మేమిరు వురము మీ సన్నిధి నుండి మీకు సేవలు సలుపుచు ధన్యత నొందదలచి యున్నామని విన్నవించెను. నారదుని యభ్యర్థనమును బ్రహ్మదేవుడు మన్నించెను.

నారదుడు చర్పటనాథునితో స్వర్గమునందలి పరిమళ సుమరాజము లను కోసికొని వచ్చి బ్రహ్మదేవుని పూజించుట లెస్సయని తెలిపినాడు. అనుదినము నిర్వురు సురలోక పారిజాతములగొని తెచ్చుటకై స్వర్గమున కేగుచుండిరి. చర్పట నాథుడు నందనవనమును ప్రవేశించుచుండెను. ఒక దినము వనపాలకులు పువ్వులను గోయు చర్పటనాథుని కనుగొని పుష్పాపచయము నేరమని దేవేంద్రుని కడకు గొనిపోయి శిక్షింపదలచిరి.

అపుడు చర్పటనాథుడు తనజోలె యందలి భస్మము నొకించుక గ్రహించి వారలపై స్పర్శాస్త్రమును అభిమంత్రించి ప్రయోగించెను. నందనవనపాలకుల పాదములు నేలకంటుకొనపోయినవి. కట్టుకదలుటకు వీలులేకుండినది. ఇంద్రుడు శివుడు విష్ణుమూర్తి ఒక్కొక్కరుగ నీ విషయ మును తెలిసి చర్పటనాథునిపై దండెత్తి వచ్చిరి. వచ్చినవారలను వచ్చినట్లు చర్పటనాథుడు స్పర్శాస్త్ర మంత్రప్రభావమున వారి పాదములు భూమికి అంటుకొనిపోవునట్లు గావించుచుండెను. శివకేశవులే చేయునదిలేక అట్లే నిలిచిపోవ ఇంద్రుడు నిలువున నీరైపోయెను. చర్పటనాథుడు విష్ణుదేవుని శంఖచక్రములను, త్రినేత్రుడగు శంకరుని ఢమరుకము, త్రిశూలములను గ్రహించెను. నారదుడా విషయమును సత్యలోకమున కేగి బ్రహ్మదేవునకు నివేదించెను.

బ్రహ్మదేవుడు స్వర్గలోకమునకువచ్చి చర్పటనాథుని ప్రతిభా విశేషమునకు, మంత్రప్రభావముకు అచ్చెరువొంది సంతసించి ప్రశంసించి, పెద్దవారియెడ నట్లు ప్రవర్తించుట అపచారమని బోధించెను. విభక్తాస్త్రమున భిమంత్రించి చర్పటనాథు దండతిని విముక్తులగావించెను.

నారదుడు దేవేంద్రుని చెంతజేరి "సురేంద్రా! అలనాడు నన్ను కలహప్రియుడు! కలహాభోజనుడని సంభోధించినది జ్ఞప్తియందున్నది కదా! నేడు నీ సంబోధనమునకు నిండుదనమున చేకూరినదని కడుపుబ్బ నవ్వెను.

ఇంద్రుడు పరాభవముచే తలవంచుకొనెను.





## వటసిద్ధ నాగనాథ చరిత్ర

ఒక మఱ్ఱి చెట్టు తొఱ్ఱయందు నాగుబాముకటి నివాసము గావించుకొని యుండినది. విధివిలాసము విచిత్రముగదా? ఆ నాగ సర్పము పడగపై దైవయోగమున బ్రహ్మదేవుని వీర్యము పతనమైనది. ఆ రేతస్సును సర్పము తిని నంత నదిగర్భమును దాల్చి యొక గ్రుడ్డు పెట్టినది. కొంతకాలమున కాగ్రుడ్డు నుండి బాలుడొకడు వెలువడి యేడ్చుచుండెను. ఆ బాలుని యందు నవకవులలో నొకడగు హవిర్హోత్రుని తేజము ప్రవేశించినది.

మఱ్ఱియాకులను కోసికొనిపోవ వచ్చిన బ్రాహ్మణుడా చెట్టును సమీపించి నంతనే శిశురోదనము చెవిని బడినది, ఆ విప్రుడు భీతినొంది పరుగులు దీయుచు నింటికేగుచుండ ఆకాశవాణి యిట్లు పలికినది. "భూసురోత్తమా! ఆ మఱ్ఱిచెట్టు తొఱ్ఱ యందొక బాలుడు కలడు. నీ పూర్వజన్మ పుణ్యఫలితముగ నీవిపుడిచటకు వచ్చుట తటస్థించినది. ఆ బాలుని నీయింటికి గొనిపొమ్ము. సమస్త సన్మంగళములు నీకు కలిగి వచ్చునని" ఇమ్ముగ పలికెను.

విప్రుడు మఱ్ఱిచెట్టు తొఱ్ఱయందున్న బాలుని వంకతొంగిచూచెను. ఉదయార్కుని వలె తేజరిల్లుచున్న ఆ శిశువును జూచి అమందానందమున తన యింటికి గొనిపోయి భార్యచేతుల యందిడెను. విప్రవనిత ఆ శిశువును తాకినంతనే ఆమె వక్షోజముల యందుస్తన్యము పెంపెసలారదొడగెను. సంతానహీనులగు నా విప్రదంపతులా బాలుని కడుగారాబముగ పోషించు చుండిరి. వటమనగా మఱ్ఱిచెట్టు. నాగసర్పము వలన పుట్టిన ఆ బాలుడు వటసిద్ధనాగుడని పేరున పిలువబడుచు ఐదేరేండ్ల బాలుడాయెను.

బాలబాలికులకు ఆటలపై మక్కువ మిక్కుటముకదా? వటసిద్ధనాగుడు తోటి బాలుర గూడి వారి గ్రామమునకు సమీపమున నున్న నదియొడ్డున నొకదినము భోజనక్రీడను సలుపుచుండెను. ఆ క్రీడయందు బాలురెల్లరు పంక్తులు దీరి కూర్చొని యుందురు. బాలుర కొందఱు వడ్డన సేయునటుల ఇదిగో పచ్చళ్లు, చిత్రాన్నాము, పాయసాన్నము భక్ష్యము, లడ్లు, పప్పుపులుసు, నెయ్యి, చారు, మీగడ పెరుగును అన్నముతో సహావడ్డన సేయునటుల నడుములు వంచి నటించుచుదురు. పంక్తి యందున్న బాలురుకొందఱు

వలదు, వలదను చుందురు. కొందఱు మాకులడ్డు భక్ష్యములు కావలయు నని అడుగుచుందురు. వారికి కోరినవి వడ్డన సేయుచురిక్త హస్తములచే నభినయముగావించుదరు.

దత్తభగవానుడా మార్గమున పోవుచు బాలురయాట కడువినోదమును గూర్పతానొక బాలుని రూపమును దాల్చి బాలుర పంక్తియందు వచ్చి కూర్చొనినాడు. వట సిద్ధనాగుని వెంట వచ్చిన బాలురెల్లరు క్రొత్తగ వచ్చిన బాలుని నీవెవరు? నీ కేమి పని గలిగి యిచటకును వచ్చితివి. పో, పొమ్మనిరి. అందులకు వటసిద్ధునాగుడు "మిత్రులారా! మనము భోజనము సేయు సమయమున అన్నార్తరులై వచ్చిన వారెవ్వ రైనను భగవత్స్వరూపముగ నెంచి తృప్తిగ వారిని సాగనంపుటను మించిన ధర్మ మెద్దియును లేదు. అంతకు మించిన పుణ్యమింకొకటి లేదని వారలను వారించెను.ఆ వచ్చిన బాలుని "అయ్యా! దయచేయుడు వచ్చి కూర్చొనుడు పాపము ఆకలిగొని యున్నటులున్నది. పంచభక్ష్య పరమాన్నములను నీకు ప్రత్యేకముగ వడ్డన సేయుదును. చాలకొలది నెయ్యితోతృప్తిగ నిదానముగ భుజింపుమని ప్రీతిగ రావించి వడ్డన గావించినట్లు నటించెను. వటసిద్ధనాగునిపలుకులు శ్రీదత్త భగవానునకు ప్రీతిని గూర్చినది - శ్రీదత్తభగవానుడా బాలునకు సిద్ధమంత్రమునుపదేశమునొసగి తాను దత్తుడననితెలిపి తన దారిని తాబోయెను.

అది మొదలువట సిద్ధనాగుని నోటిమాటలెట్లో అటులనే సిద్ధముగ జరుగు చుండినది-నోటి మాటలు వరాల మూటలగుటయే కాక భోజన క్రీడల యందు మునుపటివలె నుండక పంచభక్ష్య పరమాన్నములేకాక నేది తలచిన ఉచ్ఛరించిన మరుక్షణము హస్తచలనమొనరింపక యే బహుళముగ లభ్యమగు చుండెడిది. ఆ యూరి బాలురెల్లరీ భోజన క్రీడయందు అనుదినము పాల్గొనుచు మృష్టాన్న భోజనములతో బాటు పంచభక్ష్య పరమాన్నములను సంతృప్తిగ దినుచుండిరి. ఈ వింత విషయమాయూరి వారలకే కాక పరిసర గ్రామముల కెగబ్రాకినది.

వటసిద్ధ నాగనాధునకు శ్రీదత్తభగవానుని సందర్శన మహాభాగ్యమెపుడు లభించును, ఎపుడు శ్రీదత్తగురు దేవులకడ మంత్రదీక్షను పొందగలనాయని రేబవలాలోచించుచుండెను. దత్తభగవానుడు స్థిరముగ నెచట నుండును. సందర్శనము తన కెట్లులభింపగలదని పెద్ద వారల







నెల్లరనడుగు చుండెను. అందులకు సమాధానముగ వయోవృద్ధులాతనితో దత్తభగవానుడిచటకలడు, ఇచట లేడనుటెట్లు పొసగును. సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు. మీదు మిక్కిలి భక్తులు స్మరించినంతనే యచటజేరు స్మర్తృగామికి స్థిరనివాసమను నదేమున్నది? అదియునుగాక అన్ని రూపములాయన రూపములై యలరారుచుండును. ఎల్లతావుల యందాయన సంచరించుచునే యుండును. ఆయనను గుర్తించుట కడుదుర్లభమేయైనను ఆయనను సందర్శించుటకొక సౌలభ్యము కలదు. అద్దెద్దియన మధ్యాహ్నసమయమగు సరికి ఆయన శ్రీమహాలక్ష్మీదేవి వెలసిన కొల్హాపురమునకు భిక్షకై యరుదెంచును. నీ సంకల్పము నెరవేరుటకై కొల్హాపురమును జేరుమనిరి.

వటసిద్ధనాగుడు శ్రీదత్త ప్రభువుల సందర్శనార్థమై కొల్హాపురమును జేరెను. శ్రీమహాలక్ష్మీదేవి ఆలయమున నందు స్థల పరస్థల వాసులకెల్లరకు ప్రతినిత్యము అన్న సమారాధన మత్యంత వైభవముగ మంత్ర ప్రభావమున నడుపుచుండెను. ఎప్పటివలె శ్రీదత్తభగవానుడు మధ్యాహ్న సమయముల యందు భిక్షకై కొల్హాపురమును చేరియు లక్ష్మీదేవి ఆలయము నందుకాక దుకాణములకడ తినుబండారములను గైకొని వెడలుచుండెను. క్షేత్రవాసులా రహస్యమును వటసిద్ధనాగనాధునకు తెలిపి యాయన ఉప్పుపులుసుతిన్న ఋణమును తీర్చుకొనిరి. వటసిద్ధుడు దత్తస్వామి వచ్చి నపుడు తనకు జూపి పుణ్యమును మూటగట్టుకొనుమని వారిని ప్రార్థింప మరుదినమే శ్రీదత్తదేవుని యాతనికి జూపిరి. నాగనాధుడు ఱెప్పపాటు కాలమైనను జాగొనరింపక వేవేగ వెడలి శ్రీదత్త భగవానుని పాదార విందములపై సాగిలపడి నమస్కరించి శరణుజొచ్చెను. దయామయుడగు దత్త ప్రభువు నాగ నాధుని సాదరముగ లేవనెత్తి తన వెంటనిడుకొని యాతనికి నాథదీక్ష నొసగెను.

వటసిద్ధనాగనాధుడు దత్తదేవుని వలన నాథదీక్షను బొందెను. శిష్యవర్గ మేర్పడినది. ఆశ్రమనిర్మాణము జరిగినది. నాగనాధుడెల్ల వేళల సమాధి నిష్ఠయం దుండెడివాడు. వటసిద్ధనాగ నాధుని కీర్తి దశదిశలకెగబ్రాకినది. మత్స్యేంద్రులవారు దేశపర్యటనము సలుపుచు వటసిద్ధనాగుని చూడవచ్చిరి. నాగనాధుని శిష్యులు మత్స్యేంద్రుడు లోన ప్రవేశింపనెంచ నంతరాయమును కల్పించిరి. శిష్యుల చర్య మత్స్యేంద్రునకు కోపకారణమై వారలను కొట్టుటకుపక్రమించెను. వారెదురు తిరిగిరి. ఈ అలజడి నాగనాధుని

సమాధి నిష్టకు భంగము గావింప నాగనాధుడు మత్స్యేంద్రుని గరుడాస్త్రము పనిగొనినట్లు గావించి నాగాస్త్రమును మత్స్యేంద్రుని మీదకు వదలెను. లెక్కింప నలవిగానన్ని సర్పములు మత్స్యేంద్రుని పీడింపసాగినవి. మత్స్యేంద్రుడు గరుడాస్త్రమునుపయోగింప నా అస్త్రము పనిగొన కుండునట్లు తొలుతనే నాగనాధుడు బంధించిన కారణమున గరుడాస్త్రము తటస్థముగ నుండినది.

మత్స్యేంద్రుడు అసహాయస్థితి యందు దగుల్కొని దత్తా దత్తాయని దత్తభగవానుని నామసంకీర్తనముగావించెను. దత్తనామ సంకీర్తనమును నాగనాధుడు విని ఆ వచ్చినది శ్రీదత్త భగవానుని కూర్చుభక్తుడు. నాధసంప్రదాయమునకు మొదటి వారని తెలిసి నాగాస్త్రము నుప సంహరించెను. మత్స్యేంద్రుడు వటసిద్ధనాగు లిరువురొకరి నొకరు ప్రశంసించుకొని పరస్పర సమావేశమునకు పరమసంతసమును వెలిబుచ్చిరి. మత్స్యేద్రుడు వటసిద్ధ నాగనాధునితో “మనము సాధువులము. శాంతము సముద్రము కన్నగొప్పది. ఎదుటివారలు తమబాధలను తీర్పుమని మన నాశ్రయించు దురు. మనము తపోనిష్ఠ యందున్నను ఆ వచ్చిన వారల బాధను దీర్చి వారికి మేలు గూర్చి చల్లగ సాగనంపుట మనకు ధర్మమైయున్నది. పరోపకారమును మించిన పుణ్యము పరపీడనమును మించిన పాపము లేదని మన పెద్దలాడుట మనకు తెలియనిది కాదు గదా?” యని తెలిపెను. నాటి నుండి వటసిద్ధనాగనాధుడు తన నాశ్రయించిన వారి దుఃఖములను తొలగించి కష్టములను మాపుచుండెను.

ఇట్లుండనొకదినమా యూరనున్నవారు సర్పదష్టుడై మరణించెను. చనిపోయిన వానిని బ్రతికింపుమని వటసిద్ధ నాగనాధుని ఆశ్రమమునకు నాతని బంధుమిత్రులు వచ్చిరి. వటసిద్ధనాగనాధునకు మించిన పనియేమున్నది? చచ్చినవాడు బ్రతికి బయటపడి బట్టగట్టినాడు. ఈ విషయము నేల నాలుగు చెఱుగులకెగ బ్రాకినది. ఒక నారికేళమును భగవంతునకు సమర్పించి నందులకు నవనిధులిమ్మను వారు న్నారు. పుణ్యమో పాపమో అనుభవింపక తీరదు అనుట కర్మసిద్ధాంతము. కర్మసిద్ధాంత మునకు విరుద్ధముగ నిండుగ నూఱేండ్లు మానవుడు ఇంద్రభోగము లనుభవింప నెంచును. గుంపులు గుంపులుగ ప్రజలు వటసిద్ధనాగనాధుని ఆశ్రమము ముందు తమగొంతెమ్మ కోరికల నీడేర్చుకొనుటకు ఇసుక రాల్చిన నేలపై బడనట్లు మూగుట మొదలైనది.





ఆ వచ్చిన వారి కోరికల నీడేర్చుట కన్న తాను అవతారమును చాలిం చుట మేలైనదని నిశ్చయముగావించుకొనినాడు.

లోగడ చర్పటనాధుడు దేవతల నందఱిని స్పర్శాస్త్ర ప్రభావమును జూపి బంధించిన నాటి నుండియు దేవేంద్రుడు నాధ సంప్రదాయము యొక్క అప్రతిహత శక్తికి ప్రభావమునకు ఎదురు లేకున్నదని యోచించు చుండెను. దేవతలు నాధ సంప్రదాయమునకు తలలొగ్గవలసి నట్లున్నదని విష్ణవదనముతో బృహస్పతి దరిజేరి తమ మనోవేదనను నివేదించిరి. దేవగురువగు బృహస్పతి లెస్సగ నాలోచించి నాథ సంప్రదాయమునకు చెందిన వారి నెల్లరను రావించి స్వర్గలోకమున నొక యజ్ఞము చేయింపుమని సెలవిచ్చెను.

దేవేంద్రుడు ఉపరిచరవసువును రావించి విమానమునొసగి నాధ సంప్రదాయ మునకు చెందిన వారెల్లరను స్వర్గమునకు ఆహ్వాన పూర్వకముగ రావించెను. భారీ యెత్తున యజ్ఞము జరుగుచుండినది. యజ్ఞమొక వంక జరుగుచుండ మత్స్యేంద్ర నాధుడు తనకుమారుడగు మీననాధుని నొక వృక్షము కడకు గొనిపోయి తాను రచించిన శాబరీ మంత్రశాస్త్రము నందలి రహస్య విషయముల నన్నింటిని అరటి పండు ఒలచి చేతికందించినట్లు తేటతెల్లముగ వివరించెను. నెమలి రూపమును దాల్చి యాదివ్య వృక్షము నెక్కియా శబరిమంత్రములన్నింటిని ఇంద్రుడు గ్రహించెను. యజ్ఞము సక్రమముగ పూర్తియైనది. నవనాధులు దేవేంద్రునిచే సత్కరింపబడి దివి నుండి భువిని జేరిరి.

ఆ సమయమున తురుష్కమతము వ్యాప్తినొందినది. నవనాధులు తమ అవతారములను పరిసమాప్తము గావించుట లగ్గైన పనియని మదినెంచిరి. తమ స్థూలదేహములను సమాధులయందు జేర్చి సూక్ష్మ రూపములను దాల్చి కపటభక్తుల వంక కన్నెత్తిచూడక నిజమగు భక్తుల ననుగ్రహించుటకు కంకణము గట్టుకొని యున్నటుల నవనాధ భక్తిసారమను గ్రంథమునందు పేర్కొనబడినది.

నవనాధులను ధ్యానించి నవనాధ చరిత్రమును భక్తితో పఠించి, సత్యదత్త వ్రతవిధానమున పూజించు వారలకు నవనాధులు అనుగ్రహమును జూపుచు కోరికల నీడేర్చుదురు. దత్తభక్తులకీ గ్రంథరాజము కొంగు బంగారమనుట నిర్వివాదాంశము.

## ఫలశ్రుతి

ఈ నవనాథ చరిత్రము భక్తి శ్రద్ధలతో నియమ నిష్టలతో నిత్య పారాయణము సలుపుటకు యోగ్యమగు పవిత్ర గ్రంథరాజము. పారాయణ మొనరించు భక్తులకు భూతములవలన, దుష్టశక్తులవలన, క్షుద్రమంత్ర ప్రయోగముల వలన భయము లవలేశమైన నుండజాలదు. సాంసారిక క్లేశములు దారిద్ర్య దుఃఖములంతరించి సర్వసంపదలు సమకూరగల వనుట నిర్వివాదాంశము. శత్రువులు ముక్కుజూపజాలక దూరముగ తొలగి పోవుదురు. దుఃఖములన్నియు వమ్మైపోవును, మానసికోల్లాసము, శాంతి లభించితీరును, అగ్నిబాధలకు గురికాకుందురు.

ఈ పారాయణ మొనరించుటవలన సర్వదేవతలు ప్రీతిజెంది అనుగ్రహించుట మరియొక గొప్ప విశేషము. మహాపాతకోప పాతకములు నశించును. శారీరక మానసికక్లేశములు నశించును. కారాగారము నందు చిక్కుబడిన వాడీ పారాయణ ఫలితముగ బంధవిముక్తుడగును. ఇంట బయట కలతలు క్లేశములుండజాలవు. గృహచ్ఛిద్రములు తొలగును. గ్రహ బాధలుపశమించును. దుస్స్వప్నదోషము లంతరించును. చెడు తలంపులు మదిలో మెదలకుండును. మొండిరోగములు, దీర్ఘరోగములచే పీడింప బడు వారలీ గ్రంధపారాయణ ఫలితముగ ఆరోగ్యమును పొందుదురు. దొంగల బాధ, దొరల ఒత్తిడి నుండజాలదు. వివాహముకాని యువతీ యువకులీ గ్రంథపారాయణ ఫలితముగ దాంపత్య సుఖములను భవించుదురు. చేపట్టిన కార్య క్రమములు నిర్విఘ్నముగ నెరవేరును. విషజంతువుల వలన బాధ యుండజాలదు. ఆయురారోగ్య ఐశ్వర్యములు లభింపగలవు. దేహాంతమున శ్రీ కైవల్య పదమును గూర్చును. సిద్ధులను ప్రసాదించుటకీ నవనాథ చరిత్ర పారాయణ మొక సాధనమని నవనాథ భక్తసారము గ్రంథమునందు "మాలు" యనుకవి మహాశయుడు తెలిపియున్నాడు. ఈ గ్రంథమును పూజించి, నవనాథులను పేర్కొను దిగువ శ్లోకమును పఠించి కార్యావసరమై బయలుదేరిన నవనాథులు ప్రచ్ఛన్నముగ భక్తునకు తోడు నీడగ నుండి యాతనికార్యమును సఫలముగావించుదురు. ఇంటింట ఈ గ్రంథము పూజింపదగినదై యున్నది. ప్రతియొక్కరు పారాయణ మొనరించి మేలు గాంచుట లెస్స. అది వశమైనదికాదు. దత్త గురుదేవుని సంకల్పము.

**శ్లో॥ మత్స్యేంద్ర గోరక్షజలంధరాద్యాః గహనీ అడ్బంగ చౌరంగ ముఖ్యాః**
**భర్తరి చర్పట నాగనాథ సిద్ధాః భూమ్యాంబ భూవుః నవనాథ ముఖ్యాః**
ఓం ద్రాం దత్తాత్రేయాయ నమః ఓం తత్ సత్.

## చివరిమాట

Some are born great; some achieve greatness and
greatness is thrust upon some others - షేక్స్పియర్

మహామహితాత్ములు దివ్యశక్తులను సంతరించుకొని పుడమిపై వెలసి ప్రజలను సన్మార్గముల నడిపించి ధన్యజీవులను గావించుదురు. జన్మాంతర వాసనా విశేషమున కొందఱు జపతపానుష్ఠానుముల నవిరళముగ సలిపి దివ్యశక్తులను సముపార్జించు కొని ప్రజలను తరింపజేయుదురు. కొందరు పౌండ్రకవాసుదేవుని వలె వేషభాషా లంకరణములచే నేనే ఆ వాసుదేవుడనని నటించుచుండ ప్రజలెల్లరు జేజేలు పెట్టుచు వారి చుట్టు జేరి భజనలు సేయుచుందురు. అట్టివారు తాము ఆత్మవంచన గావించుకొని ప్రజలను మభ్యపెట్టి అందలము నలంకరించుచున్నారు.

దేహమే దేవాలయము వంటిది. గుడిలోని విగ్రహము ఆత్మ "మమాత్మాసర్వ భూతాత్మ" యని భగవద్గీత యందు తెలిపినటుల ఆ భగవంతుడు సర్వభూత హృదయాంతర్వర్తి. నీ యందును నాయందును నిఖిల భూతముల యందును ప్రహ్లాదుడు తెలిపినటుల నిస్సందేహముగ నెలకొనియున్నాడు "మమైవాంశోజీవలోకే జీవభూత స్సనాతనః" అని భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగము యందు గీతాచార్యుడు తెలిపినటుల మానవుడు భగవదాంశ సంభూతుడు. హరిమయముకాని వస్తువు పరమాణు కూడలేదని భాగవతమునందు తెలిపినటుల మనము చూచునది వినునది యంతయు భగవంతుని లీలావిశేషమైయున్నది "అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః"

అయినను మాయామోహితులమై యున్న మనము ఆ భగవంతుడు లోకాంతర ముల యందు కలడని భ్రమించుచున్నాము, వాపోవుచున్నాము. ఆ బంగారపు గొలుసు నీమెడయందే అలంకరింపబడియున్నదని గుర్తుచూపువాని వలె భగవంతుడు నీయందే యున్నవాడని తెలుపువాడు గురువు. గురువే పరబ్రహ్మము– గురువును మించిన దేవుడు లేడు. దేవతలు భావనాగమ్యులు, మంత్ర ద్రష్టలగు మహాత్ములు మన ఉపాసనా సౌలభ్య

మునకై ఆ భగవంతున కొక రూపమును కల్పించి ఒక పవిత్ర నామమున వెలయింప జేయుచున్నారు.

తుర్లపాటి బాలగురునాథం అను పేరున వెలిసి పుట్టుకతో దివ్యశక్తులను సంతరింపజేసి కొని శ్రీశ్రీ శ్యామచరణ మహారాజుగ ప్రసిద్ధిగాంచిన మహితాత్ముని సందర్శన భాగ్యము శ్రీదత్త భగవానుని కృపవలన శ్రీగురు లీలామృతము అనుగ్రంథ మును నేను వ్రాసినది అచ్చయిన రోజులలో లభించినది. ఆ మహానుభావుడు నన్నును గ్రహించు టయేకాక మాకుటుంబము వారిని మా గ్రామవాసులను షిరిడీ శ్రీ సాయి మార్గమున ప్రవర్తిల్లజేయుటకు శ్రీశ్రీ చోడవరపు సాంబమూర్తి బాబాగారితో బాటు మా గ్రామమునకు విజయముచేసినారు. మేము మా గ్రామవాసులు వారల నిరువురను బలరామకృష్ణులుగ నెంచి మా గ్రామమునందు ఉత్సవమును జరిపితిమి. శ్రీ శ్యామచరణ బాబాగారి అనుగ్రహభాషణమున "కొలది కాలమునకు ఏ సౌకర్యము లేని మీ గ్రామము చందలూరు- చందనవనముగ రూపొందునని సెలవిచ్చినారు. సంజీవమూర్తిగ వెలసిన మా ఊరి ఆంజనేయస్వామి దేవాలయమున ఆయన అమృత హస్తములతో శ్రీసాయినాధుని పటమునొక దానిని ప్రసాదించియున్నారు. మీదు మిక్కిలి ఇచటనొక సాయి మందిరము వెలయునని సెలవిచ్చినారు. బస్సు, ఎలెక్ట్రిసిటీ, ఫోను, తారురోడ్డు, వాటర్‌ట్యాంకు సౌకర్యములతో నూతనముగ ఒక చెరువు నిర్మాణ ముతో అలనాటి కుగ్రామమునేడు అన్ని సౌకర్యములతో నలరారుచున్నది. క్రొత్తచెరువు నిర్మాణముతో రైతులు కూలివారలు శ్రమజీవితము ననుభవింపక సుఖజీవన మొనరించుచున్నారు.

శ్రీసాయి మందిరము నిర్మాణ దశలోనున్నది. మందిరము చిన్నదియే యైనను శిల్పరత్న బిరుదాంకితులగు శ్రీదురుగడ్డ రామకృష్ణమాచార్యుల హస్తకళాకౌశలముచే శ్రీసాయి విగ్రహము, రెండు స్తంభముల యందు గణపతి, శివుడు, దత్తాత్రేయుడు, శ్రీకృష్ణుడు, లక్ష్మీసరస్వతుల విగ్రహములు, పై కప్పునందు అష్టదళ పద్మము ద్వార శాఖలతో పాలిష్ బండలతో ఒక కళాఖండముగ రూపొందుచున్నది. శ్రీదత్త లీలాతరంగిణి, శ్రీదత్త వైభవము, శ్రీ గురుచరిత్ర, శ్రీసాయిలీలామృతము, శ్రీ సాయి మనము ఏకాదశ సూత్రములకు వ్యాఖ్యానము, శ్రీ సాయి అష్టోత్తర శతనామము లకు వివరణనువ్రాసి శ్రీసాయి సేవలో ఆలయ నిర్మాణ కార్యక్రమమును చేపట్టి,





శ్రీస్వామి సమర్థ (అక్కలకోట మహారాజు) గ్రంథము రచన పూర్తిగావించి శ్రీ సాయి నాధ స్తవనమంజరి అచ్చయిన పిదప శ్రీ శ్యామచరణ మహారాజు గారి ఆశీర్వాదము లందుకొని శ్రీసాయి మందిరమును నిర్మించుచు ఈ స్వభాను నామసంవత్సర గురు పూర్ణిమకు "శ్రీ నవనాధచరిత్రను అచ్చు వేయించుటకై శ్రీవారి అనుమతిని బడసినాడు.

మహనీయులను మనము గుర్తించడం కడుదుర్లభమైనది. కారణమేమన, వారును మనవలెనే మానవులుగ వెలయుచు మనలో నొకరిగ మెలగుటయే! భగవగద్గీత యందీ విషయమును వివరించుచున్నది.

**శ్లో॥ అవజానన్తి మాంమూఢాంమానుషీ తను మాశ్రితం**
**పరంభావమజానన్తో మమభూత మహేశ్వరః**

మానవదేహమును ధరించిన కారణమున మూఢప్రజలు భగవంతుని సాటి మానవులలో నొకనిగ పరిగణించుదురు, షిరిడీ సాయినాధుని సహితము ఒక ఫకీరుగ నెంచి వర్తకులు దీపములను వెలిగించుటకు నూనెను పోసినవారు కారు.

అంతా రామమయం ఈ జగమంతా రామమయం అను దృఢ చిత్తమున సీతారాములను తన హృదయ మందిరమును సుప్రతిష్ఠితము గావించుకొని సర్వకాల సర్వావస్థలయందరు ఆత్మారాముని యందే దృష్టిని నిలిపి, త్రివేణి సంగమమునందు గంగ, యమున, సరస్వతులు కలిసినట్లు శ్రీసాయితత్త్వమును అనుభవ సిద్ధముగ నలవరుచుకొని, అరుణాచల రమణ భగవానుల మార్గమున పయనించుచు గమ్య స్థానమునుచేరి శ్రీరామకృష్ణ పరమహంస వలె నిరాడంబరముగ జీవిత యాత్ర సలుపుచు మనకు బోధామృతమును పంచిపెట్టుచు, చెంత జేరిన వారి వంతబావు మహా పురుషుడగు శ్రీశ్రీశ్రీ శ్యామచరణ మహారాజు గారికి శ్రీవారి అర్థాంగ లక్ష్మి సౌభాగ్యవతి శారదామాత గారికి శతకోటి ప్రణామములు.

శ్రీ శ్యామచరణుల చరణార విందములకు ప్రవిమల పారిజాత సుమరాజముగ "నవనాధచరిత్ర" యను గ్రంథరాజమును సభక్తికముగ సమర్పించుచున్నాను. నవనాధుల పేర్లను స్మరించుచు మనమే కార్యమును చేపట్టినను విజయవంతముగ ఫలించుననుట అనుభవజ్ఞుల ఆప్తవాక్యము.

– / –

E/Srinivas/Nava Nadha Charitra

## ఈ పంచాంగమునందు.....

రిత్ర




నామనక్షత్ర, రాశి, గుణ పొంతనము
2005-2006 శ్రీ పార్థివనామ సం॥ర దినాధిపతుల-
దినచర్యతోపాటు తారాబలం చూచుకొను విధము
దినాధిపతులు ఫలములు
తారాబలము చూచుక్రమము
చంద్రబలము
ధనప్రాప్తియోగము
ప్రతీరోజూ ఉదయాది గ్రహములు పరిపాలించు కాలచక్రము
హోరా కాలములో చేయు పనులు
గౌరీ పంచాంగము
2005-2006 శ్రీ పార్థివనామ సం॥ర మాసాధిపతులు
ఈ సంవత్సరం మాసాధిపతులు ఫలితములు
నవగ్రహములకు ఉచ్ఛ, నీచ, మిత్ర, శతృత్వములు
శ్రీ పార్థివ నామ సంవత్సర రాజాది నిర్ణయము
అశ్వగజాధిప నిర్ణయము
సంవత్సర ఫలం
వాస్తు కర్తరీ నిర్ణయము
మౌఢ్యమీ నిర్ణయము
యోగ పంచక ఫలము
మనకు కన్పించని సూర్యగ్రహణములు
కందాయ ఫలములు
ఆదాయ వ్యయ పూజనీయ అవమానములు
ఉదయాస్తమయాలు
శ్రీ పార్థివనామ సంవత్సర వర్షయోగ చక్రము - ఫలములు
వర్షయోగములు
శ్రీ పార్థివ నామ సంవత్సర వర్షధాన్యాదులు
రాజాది నిర్ణయములు
మకర సంక్రమణ నిర్ణయ-ఫలము
సంక్రాంతి పురుషుని ఫలము
శ్రీ పార్థివ నామ సంవత్సర వస్తువుల ధరలు
శ్రీ పార్థివ నామ సంవత్సర ముఖ్య పండుగలు
శ్రీ పార్థివ నామ సంవత్సర శుభ ముహూర్తములు
1. మేషరాశి 2. వృషభరాశి 3. మిథునరాశి 4. కర్కాటక రాశి
5. సింహరాశి 6. కన్యారాశి 7. తులారాశి 8. వృశ్చికరాశి





10. మకరరాశి 11. కుంభరాశి 12. మీనరాశి ..........................

శుభముహూర్త విషయములు
స్త్రీల విషయములో శుభముహూర్తములు
మాసాధిపతులు - మాసనామములు
వ్యవసాయ విషయములు
మత్స్య పరిశ్రమకు ముహూర్తములు
పశువుల విషయము
వ్యాపార విషయ ముహూర్తములు
విద్యావిషయ శుభ ముహూర్తములు
గృహసంబంధమైన క్రొత్తవస్తువులు వాడుటకు
ప్రయాణ విషయములు
ప్రయాణమునకు ఆనందాదియోగములు
శిశుజనన, నక్షత్ర పాద దోషములు
వధూవర గుణ మేళన చక్రము
జాతకరీత్యా నవగ్రహములకు మహాదశా, రవ్యాది గ్రహ అంతర్ధశా వివరములు
నవగ్రహ జప దాన పూజా వివరములు
దేశాంతర సంస్కార నిర్ణయం
ప్రథమ రజస్వలయందు శుభాశుభదినములు
అశౌచ విషయములు
పక్షిణ్యా శౌచము
గౌళిపతన (బల్లిపాటు) ఫలితము
బల్లిపలుకు- నక్క అరుపు - తుమ్ముల ఫలములు
శుభశకునములు
అశుభశకునములు
సుస్వప్నములు
దుస్వప్నములు
ఔషధ సేవా శుభకాలము
ఆయుష్కర్మ (క్షౌరమునకు) శుభాశుభములు
చుక్కెదురు దోషము
నక్షత్రములు, నవరత్నాములు ఉంగరధారణ ఫలితములు
సవ్యమగు రాశి చక్రములు
తిథులు
లగ్నాంతకాలముల పట్టికలు








వెల : 18/-

పబ్లిషర్స్
మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం - రాజమండ్రి.

72
E/Srinivas/Nava Nadha Charitra

# శ్రీ సాయి ఆరాధన - షిరిడీ వైభవము

**ఇందులో**

శ్రీ సాయి ఏకాదశ సూత్రములు
శ్రీ సాయి సూక్తులు
శ్రీ సాయిబాబా జీవితచరిత్ర - అంశములు
శ్రీ సాయిబాబా జీవితచరిత్ర - ప్రత్యేక అంశములు
శ్రీ సాయీ సచ్చరిత్ర-పఠారాయణ ఫలితములు అంశములు
శ్రీ సాయినాథ మండలదీక్షా విధానములు
శ్రీ సాయి భక్తులకు మార్గదర్శక సూత్రములు
శ్రీ సాయి అభిషేకములు - ఫలితములు
శ్రీ సాయి - అనుష్ఠాన మార్గములు
శ్రీ సాయి మండల దీక్షా విధానము (మాలధారణ)
ఓం శ్రీ సాయిరామ్ అఖండనామ మహాయజ్ఞము
54 గురువార నైవేద్యములు
శ్రీ రామ నవమి - ఆచరించు విధులు
శ్రీ సాయిబాబా మహాసమాధి - ఆచరించు విధులు
దీపావళి - ఆచరించు విధులు
దత్త జయంతి - ఆచరించు విధులు
నూతన శ్రీ సాయి మందిరములు - సూచనలు
శ్రీ సాయిబాబా మందిరములలో-పాటించవలసినవి
శ్రీ సాయి అవతారములో ప్రధాన సంఘటనలు
శ్రీ సాయిబాబా - ముఖ్య సంవత్సరములు
శ్రీ సాయి అద్భుతములు
హేమాదిపంత్ జీవిత - సంగ్రహము
సాయిభక్త పాదరక్ష - హేమాదిపంత్
శ్రీ సాయి సచ్చరిత్ర రచయితలు శ్రీ ప్రత్తి నారాయణరావు
శ్రీ సాయి సచ్చరిత్ర రచయితలు శ్రీ బాపట్ల హనుమంతరావు
శ్రీ సాయిబాబాను దర్శించిన తెలుగువారు
ఈనాటి సాయి అంకిత భక్తులు
శ్రీ సాయీ భక్తులు - వారి వివరములు
శ్రీ సాయి మాసపత్రికలు
శ్రీ సాయి సాహిత్యము (ఇంగ్లీషు)
శ్రీ సాయి సాహిత్యము (తెలుగు)
శ్రీ సాయి సినిమాలు
శ్రీ సాయి ఆడియో క్యాసెట్లు
శ్రీ సాయిబాబా మాహాత్మ్యం (పాటలు)
శ్రీ సాయి గురువు సమాధి - శైలు
శ్రీ సాయి జన్మస్థలం - ప్రత్తి
శ్రీ సాయి మందిరం - శివాజీనగర్ (పూనా)
ఆంధ్రరాష్ట్రంలో మొదటి సాయిమందిరం - తెనాలి
దక్షిణ షిర్డీ (దేశములో తొలి విగ్రహం) - కర్నూలు
మరో ద్వారకామాయి - హైదరాబాద్
శ్రీ సాయి ఉపాసనీ మందిరము - హైదరాబాద్
శ్రీ సాయి భక్తులకు దర్శినీయ క్షేత్రములు
శ్రీ సాయి స్వయముగా నిర్మింపజేసుకొన్న మందిర-బివ్‌పురి
షిర్డీ హారతులు - ఎవరు రచించారు?
శ్రీ సద్గురు సాయిని ఎవరు ఎప్పుడు ఆశ్రయించినారు?
శ్రీ సాయి సన్నిధి చేరిన భక్తులు
బి.వి. నరసింహస్వామిజీ-శ్రీసాయి భక్తుల అనుభవములు
శ్రీ సాయి అనగానేమి?
శ్రీ సాయి ఆధ్యాత్మిక జీవితము-అయిదు దశలు
శ్రీ సాయి - శ్రీ శివ పోలికలు
శ్రీ సాయి దర్శనం - ఎవరి ద్వారా దర్శించిన సంవత్సరములు
శ్రీ సాయి - మహనీయుల ప్రశంసలు
శ్రీ సాయి పంచభూతములపై అధికారం
శ్రీ సాయి - సకల ప్రాణ స్వరూపులు
శ్రీ సాయి - దక్షిణ చమత్కారములు
శ్రీ సాయి - సకల దేవతా స్వరూపులు
శ్రీ సాయి - వెలిగించిన ఆధ్యాత్మిక జ్యోతులు
శ్రీ సాయి - భక్తులను రక్షించుట (మహాసమాధి తరువాత)
శ్రీ సాయి - యోగలీలలు
శ్రీ సాయి - దినచర్య
శ్రీ సాయి - సన్నిధిలో సద్గతి పొందినవారు
షిరిడీ పుణ్యభూమి ఆనాటి భక్తుల పేర్లు
రాజమండ్రి నుంచి బాబాకు కానుక
శ్రీ భగవతి సాయి సంస్థాన్
శ్రీ సాయి - ఆరతులు
శ్రీ సాయిభక్తులు - మహాసమాధి తర్వాత మాయమైనవారు
శ్రీ గురుచరిత్ర - ప్రశ్నలు - జవాబులు
శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర - ప్రశ్నలు - జవాబులు
శ్రీ సాయి సచ్చరిత్ర - ప్రశ్నలు - జవాబులు
శ్రీ సాయ లిఖితనామ పుస్తకములు షిర్డీ పంపాలా?
శ్రీ సాయి - అభయ దర్శన చిత్రము వివరణ
శ్రీ సాయి - పటము రూపములో వేంచేసిన ఫోటో
శ్రీ సాయి - అభయ హస్త అష్టోత్తర శతనామావళి చిత్రము
శ్రీ సాయి - స్నానం చేస్తున్న ఫోటో
ఓం శ్రీ సాయిరామ్ కోటిలేఖన గ్రంథము - విశిష్ఠత
ఓం శ్రీ సాయిరామ్ లిఖితరూప ద్వారకమాయి చిత్రము
శ్రీ సాయి - గురువారం ప్రాముఖ్యత
శ్రీ సాయి - దక్షిణేశ్వరుడు
శ్రీ సాయి - సత్యనారాయణ వ్రతము
శ్రీ సాయి పూజారి - మహల్సాపతి
శ్రీ సాయి దీక్ష
శ్రీ సాయి - దత్తాత్రేయుడు వారి 5వ అవతారము
శ్రీ సాయి దినచర్య
శ్రీ సాయి వాహనము - శ్యామకర్ణ
శ్రీ సాయి ప్రచారకులు - దాసగణు
షిర్డీలో శ్రీ సాయి విగ్రహ ప్రతిష్ఠ చేసినవారు
శ్రీ సాయి సేవకురాలు - రాధాకృష్ణమాయి
శ్రీ సాయి - దొంగవారసులు
25 దత్త క్షేత్రములు
అష్టాదశ దత్త క్షేత్రములు
శ్రీ సాయి - రూపురేఖలు
శ్రీ సాయి సమాధి అనంతరం ప్రత్యక్ష లీల
శ్రీ సాయి అందరివాడు
శ్రీ సాయి - జన్మ వివరములు
శ్రీ సాయి అవతార రహస్యము
శ్రీ సాయి - భారత స్వాతంత్ర్య సిద్ధికి సూత్రధారణ
శ్రీ సాయి - దొంగ కరపత్రములు
శ్రీ సాయి - గొలుసు సందేశాలు
శ్రీ సాయి ప్రచారకులు - శ్రీ నరసింహస్వామిజీ
శ్రీ సాయి ప్రచారకులు - వేమూరి వేంకటేశ్వర్లు
శ్రీ సాయి ప్రచారకులు - స్వామి కేవశయ్య
శ్రీ సాయి గురువు ఎవరు?
శ్రీ సాయి నిత్య విధులు
శ్రీ సాయి మహాసమాధి అనంతరం భక్తులు
శ్రీ సాయి సమాధివద్ద సంగీతధ్వనులు వినిపించేవి

**రచన : డా॥ ఆదిపూడి**

షిర్డీ సంస్థాన్ ఆవిర్భావం
షిర్డీ - దర్శనీయ పవిత్ర స్థలాలు
షిర్డీలోని ఇతర దర్శనీయ స్థలాలు
షిర్డీకి దగ్గరలోని పుణ్యక్షేత్రములు
మహారాష్ట్రంలోని పుణ్యక్షేత్రములు
షిర్డీలో - చేయవలసినవి - చేయకూడనవి
శ్రీ సాయిబాబా ఇంటర్నెట్ సైట్ వివరాలు
షిర్డీలో పారాయణ చేయవలసిన ముఖ్య అధ్యాయములు
షిర్డీలో ఆచరించవలసిన విధులు
షిర్డీలో లభించే సౌకర్యాలు
షిర్డీ సంస్థాన్ - శ్రీ సాయిభక్తుల లేఖ
షిర్డీలో పండుగలు
షిర్డీలో పండుగ కార్యక్రమములు
సమాధి మందిరము ముందు కుడివైపులో శ్రీ సాయి భక్తుల ఫోటోలు
సమాధి మందిరము ఎడమవైపులో శ్రీ సాయి భక్తుల ఫోటోలు
సమాధి మందిరము నందు వాడబడిన వస్తువులు
బాబా సమాధి మందిరము
ద్వారకామాయిలో గమనించదగినవి
ద్వారకామాయి 3 మెట్లు
ద్వారకామాయి దర్శించు భక్తులకు విన్నపము
చావడిలోని ఫోటోలు
చావడిలోపల ఫోటోలు
గురుస్థానంలోని ప్రతిరోజు కార్యక్రమములు
సమాధి మందిరములోని కార్యక్రమములు
ద్వారకామాయిలోని కార్యక్రమములు
చావడిలోని కార్యక్రమములు
గురువారం రోజు చావడీ కార్యక్రమములు
షిర్డీలో ఉత్సవాలు - పండుగలు
షిర్డీలో శ్రీరామనవమి
షిర్డీలో విజయదశమి
షిర్డీలో గురుపౌర్ణమి
షిర్డీలో - టెలిఫోన్ నెంబర్లు
షిర్డీ ట్రావెల్స్ ఫోన్ నెంబర్లు
షిర్డీ హోటల్స్ ఫోన్ నెంబర్లు
షిర్డీ నైట్ సీయింగ్ ప్రదేశములు
షిర్డీ టాక్సీ చార్జీలు
షిర్డీ ప్రముఖ స్థలములకు దూరము
షిర్డీ ప్రైవేటు బస్సులు బయలుదేరి వేళలు
షిర్డీ ప్రముఖ దర్శనీయ స్థలాల ఛార్జీలు
సర్క్యులర్ ప్రయాణపు టిక్కెట్
బాబా ఆరతుల సమయాలు
నాగర్‌సోల్ స్టేషన్ నుండి రైళ్ళ రాకపోకలు
షిర్డీ నుండి ప్రముఖ నరగముల దూరము (రోడ్డు)
షిర్డీ నుండి ప్రముఖ నగరముల దూరము (రైల్వే)
షిర్డీ వైభవాలు - సంవత్సరములు
షిర్డీ ఆచరించవలసినవి
షిర్డీ - దర్శనీయ స్థలములు - వాని విశిష్ఠత
షిర్డీ యాత్ర 3 రోజులు చేయాలి
షిర్డీ ఎక్కడ ఉంది? ఎలా వెళ్ళాలి?
ధర్మక్షేత్రం - షిర్డీ
శ్రీ సాయి ద్వారకామాయి
టూరిస్టు బస్సు ద్వారా షిర్డీ యాత్ర

